# లేపాక్షి

(చరిత్రాత్మకము నవల)

దర్శనాచార్య :
కొండూరు వీరరాఘవాచార్యులు
వి. యస్. ఆర్. కళాశాల, తెనాలి

ప్రకాశకులు :
కె. వి. ఆర్. అండ్ సన్, తెనాలి

# ఈ నవల

లేపాక్షి అనంతపురముజిల్లాలోనున్న సుప్రసిద్ధ కళా క్షేత్రము. ఇచ్చట శిల్ప-చిత్రకళలు రెండును 'సమపాళ్ళ'లో విలసిల్లినవి. ఈ శిల్ప-చిత్రములను వెలయింపజేసిన మహనీయుడు విరుపణ్ణ. ఈ విరుపణ్ణ చరిత్రను, ఇచ్చటి శిల్ప చిత్రముల కథ ఒక చక్కని నవలకాగలదని తలంచితిని. 1968 సెప్టెంబరు నెలలో నేను లేపాక్షికి వెళ్ళి అచ్చటి శిల్ప-చిత్ర కళా విశేషములను పరిశీలించితిని. దేవాలయార్చకుల వలన అనేకాంశములను తెలిసికొంటిని. లేపాక్షి గ్రామము నానుకొని యున్న కూర్మాద్రి మీది దుర్గాదేవి పాదముద్ర, స్తంభోద్భవ దుర్గాదేవి, అగస్త్యమహర్షి తపస్సుచేసిన గుహ, ఏడుతలల నాగేంద్రునిచే చుట్టబడియున్న నాగలింగేశ్వరుడు, పాపనాశేశ్వర, రఘునాథ, వీరభద్రమూర్తులు, వటపత్రశాయి శ్రీకృష్ణుడు, పద్మినీపాంచాలజాతి మూర్తులు, అంతరిక్ష స్తంభము, యాదవుడైన కన్నప్ప శిల్పము, ప్రధాన శిల్పాచార్యుని వంటసాల, విరుపణ్ణ కన్నులూడబెకికకొని కొట్టిన దేవాలయపుగోడకు పడిన గుంటలు, ఆ గుంటలనుండి కారిన నెత్తురు చారలు—మున్నగు వానిని సవిమర్శముగా కనులార చూచితిని.

పైని పేర్కొన్నవాని నన్నింటిని నాటి విజయనగర సామ్రాజ్య వాతావరణమునకును, చరిత్రకును, అనుసంధించు నట్లు కూర్చుకొని, ఉచితములగు కల్పనలు చేసికొని ఈ నవల రచించుటమైనది. దీనిని వ్రాయుటలో శిల్పాగమ, జ్యోతిష, వాస్తు, శిలా, లోహ, నాట్య, సంగీత, తత్త్వ, యోగాది-బహుశాస్త్ర విషయములు ప్రధాన కథలో కలసిపోవునట్లు చేసికొనుటకు చక్కని అవకాశములు పొసగినవి.

ఇందు ప్రస్తావింపబడిన ముమ్మనాచార్యుని వంశ విశేషములును, పాటూరిని పాలించిన శిల్పి రాజుల యుదంతమును గాయత్రీ పీఠాధిపతులును-షణ్మత స్థాపనాచార్యులును నగు శ్రీ వీపూరి వేంకటాచార్య స్వాములవారు రచించిన ఆంధ్ర "విశ్వకర్మ పురాణము" పద్యకావ్య ప్రథమాశ్వాసములోని యుపోద్ఘాత పద్యముల నుండి గ్రహింపబడినవి. వీనినిగూర్చి ఖరసంవత్సర మార్గశీర్ష (1951 డిసెంబరు) భారతిలో

"విశ్వకర్మ పురాణము-కొన్ని చరిత్రాంశములు" అని యొక వ్యాసమును వ్రాసియుంటిని. పెందోటను పాలించిన ధవళేశ్వరపు మార్కండేయ ప్రభుని వంశప్రస్తావన, అయ్యంకి బాలసరస్వతి, తుర్గా రాజకవి గారలు వ్రాసిన ఆంధ్ర నాగరఖండ కావ్యపుటుపోద్ఘాతములో గలదు. దీనిని గూర్చి గూడ - ఖర సం॥ చైత్రి (1951 ఏప్రిల్) భారతిలో "పెందోట పురము-మార్కండేయ ప్రభువు" అను వ్యాసమున వివరించియుంటిని. విజయనగర రాజ్య స్థాపనము, తద్వైభవ విశేషములకు సంబంధించిన యంశములకు తెలుగు విజ్ఞాన సర్వస్వము సంస్కృతి సంపుటిలో శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాసిన "విజయనగర సామ్రాజ్యము" అను వ్యాసము కొంతవఱకు ఆధారము. పద్మశ్రీ శ్రీ కల్లూరి సుబ్బారావుగారు పైని పేర్కొన్న సంపుటిలోనే లేపాక్షిని గూర్చి ఒక వ్యాసము వ్రాసియున్నారు. వారందు వీరణ్ణ-విరుపణ్ణలు నంది లక్కిసెట్టిగారి పుత్రులని సూచించినారు. విరుపణ్ణను గూర్చిన ఆయా యంశములు శాసనబద్ధములై కూడ లేపాక్షి వీరభద్రాలయమున దొరకుచున్నవి. శ్రీ దేవళ్ళ సత్యనారాయణగారు "నాట్యకళ" పత్రికలో ప్రకటించిన లేపాక్షి నాటకమునుగూడ చూచియున్నాను. నా నవల కథకును, దానికిని చాల భేద మున్నది. ఈ నవలలోని శైవమత సంబంధములగు కొన్ని విషయములను శివశ్రీ శ్రీ బండారు తమ్మయ్యగారి వ్యాసములనుండి గ్రహించుటయైనది. శిల్పాగమ సంబంధములగు కొన్ని విశేషములను కీ. శే. కవిశేఖర వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాంగమము" నుండి స్వీకరించినాను. వీరికందఱకును నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇట్టి పరిశ్రమతో వ్రాసిన చరిత్రాత్మకమగు నీ నవల సహృదయుల మన్ననలకు పాత్రమై సముచితోపయోగము నందినచో, సార్థకమైనట్లు భావింతును.

తెనాలి
సౌమ్య, వైశాఖము

గ్రంథకర్త
20-4-1969

# లేపాక్షి

## 1

శాలివాహనశక సంవత్సరము పదునాలుగువందల యేబది నాలుగు. శరత్తు చనినది. హేమంతము వచ్చినది. పూర్వదిశాంగనా ముఖమండలము లోధ్రపుష్ప రజశ్చర్చితమైనట్లు తెలికాంతుల నీనుచున్నది. ఉదయాచల శిఖరము విభూతిధవళిత సర్వాంగుడైన పార్వతీరమణునట్లు ప్రకాశించుచున్నది. కొంతవడికి అంబరమున అరుణకాంతులు పర్వినవి. అవి దక్షయజ్ఞధ్వంస సముద్యుక్త వీరభద్ర కోపారుణిత నేత్రాంచలములను–మహిషదనుజ మర్దనావసర మహాదుర్గా భయంకర క్రోధానల జ్వాలలను పురుడించినవి. ప్రాతర్భాను సువర్ణ మరీచిమాలికా సహస్రములు ప్రోవులు ప్రోవులై కచ్ఛపాద్రీశ్వరుని ఆపాదమస్తకము అలంకరించుచున్నవి. దక్షిణదిశాయాత సురభిశీతల మంద గంధవాహములు గుణగరిష్ఠుడగు నా పర్వత ప్రభువును సేవించుచున్నవి.

కచ్ఛపాద్రి లేపాక్షి నానుకొని యున్నది అది ఆకృతిలో చిన్నదే. చిన్నదనగా మఱీ చిన్నదని కాదు. మహాపర్వతశ్రేణిలో జేర్పదగనంత పరిమాణము కలదన్నమాట. ఆ కొండ యెత్తు తక్కువైనను వెడల్పు విరివిగా కలదే.

భూభారమును మోయు నాదికూర్మరాజు విశ్రాంతికొఱకు భూమి పైకివచ్చి స్వస్వరూపముతో శైలాకృతి దాల్చినాడా యన్నట్లది యొప్పుచుండును. దాని యాకృతిని బట్టియే దానిని కూర్మాద్రి యన్నారు.

ప్రతిదినము ఆలకాపరులు, గొఱ్ఱెల కాపరులును ఆ కొండమీదికెక్కియే పశువులను మేపుకొనుచుందురు. గ్రామము లోని బాలబాలికలు సాయంసమయములందు దానిమీదికెక్కి ఆటపాటలతో కాలక్షేపము చేయుచుందురు. సాయంకాలపు వృద్ధభానుని బంగారుకిరణములతో ధగద్ధగితమై పోవుచుండు నా కొండమీదికెక్కి యువమిథునములు క్రీడావిహారాదు లొనర్చుచుందురు. వెన్నెలరేలగూడ తత్పర్వత పాదప్రదేశముల గూర్చుండి గ్రామస్థులు ఉబుసుపోకకు ఆయా కథలు చెప్పుకొని ఆనందించుచుందురు. ఇన్నివిధముల లేపాక్షిగ్రామవాసుల కది యొక సుందరక్రీడా పర్వతమై యొప్పుచున్నది.

ఆ కొండ అంతగా ఊరివారి కాదరణీయమగుటకు అందు వెలసిన పాపనాశేశ్వర స్వామి ప్రభావమే కారణము. శ్రీరామచంద్రమూర్తి ప్రతిష్ఠించిన రామేశ్వర స్వామియు, హనుమంతుడు ప్రతిష్ఠించిన హనుమల్లింగమూర్తియు ఈ కూర్మాద్రిపై కొలువుదీరి యున్నారు. ఈ లింగత్రయమును సేవింపవచ్చిన బ్రహ్మవిష్ణ్వాది సమస్తదేవతాకోటియు నందు మనుష్యదృష్టికి గోచరింపక క్రీడించుచునే యుందురు. కనుక నిది మనుజులకే కాక దేవతలకును క్రీడాద్రియైనది. పార్వతీ పరమేశ్వరావాసమగు రెండవ కైలాసముగా కూర్మాద్రి నెన్నవచ్చును.

పాపనాశేశ్వరుని గుడి యానాటికే మిక్కిలి చిన్నది. నాలుగువైపుల నున్న అతిగోడలతోను పైనున్న అతిబండల కప్పుతోను మాత్రమే అది యలరారుచున్నది. ఆ దేవళమున కొక ప్రక్కన కొండలోనే సహజముగా నేర్పడిన యొక గుహ కలదు. ఆ గుహ పెద్దవై శాల్యముకలది కాకున్నను దాదాపు ఇరువదిమంది మనుష్యులు కూర్చుండుటకు వీలైనంత పెద్దదే. గుహలోనికి వెలుతురు వచ్చు నవకాశము లంతగా లేవు. ప్రవేశ ద్వారమున వచ్చు గాలితోనే అందున్న ప్రాణులు తృప్తిపడవలయును. ప్రకృతి సిద్ధమగు నిట్టి గుహ, ఆ గుహ నానుకొనియే పరమేశ్వరాలయము నేర్పడుట చూచువారి కొక వింతగా తోచును.

నాటియుదయము నుండియు విరుపణ్ణ పాపనాశేశ్వర లింగమున కెదుట గూర్చుండి ప్రణవపంచాక్షరీ మంత్రమును జపించుచున్నాడు. అతని కప్పటికేబదియైదు వత్సరముల ప్రాయ ముండవచ్చును. మేల్మి బంగారు వంటి మేనిచాయ, వ్యాయామ కర్కశమగు శరీరము, అందమును చిందించు నవయవ సన్నివేశము ఆతడొక అసాధారణ వ్యక్తి యని చెప్పుచున్నవి. అఱుత రుద్రాక్షమాలలు, మెడలో స్వర్ణ మయమగు లింగకాయ, మెయినిండ నలదిన విభూతిరేఖల యొప్పిదము, తెల్లనిజందెము కలిగి రూపుదాల్చిన పాశుపతదీక్ష యన్నట్లాత డొప్పుచున్నాడు. పదిగడియల ప్రొద్దెక్కువఱకును ఆతడు పంచాక్షరీమంత్రోపాసనము చేయుచునేయుండెను. కొంత తడవు పెదవులు కదలునట్లు జపించెను. ఆపై మునినాలుక మాత్రమే చలించునట్లు జపము చేసెను. అటుతరువాత

సర్వావయవములు, సర్వేంద్రియములు నిశ్చలము లగుడు మానసికమైన యుపాంశుజపము నొనర్చెను. జపము సమాప్తమైన తరువాత సంస్కృతభాషలో పుష్పదంత విరచితమైన మహిమ్నస్తోత్రమును పఠించెను. ఆవల మల్హాణ కవీంద్రుడు శంకరుని స్తుతించుచు వ్రాసిన మల్హాణ స్తవమును పారాయణము చేసెను. పిమ్మట మలయరాజు శివునిగూర్చి వ్రాసిన మలయ రాజీయమును చదివెను. తరువాత హలాయుధుడను వీరశైవ రాజేంద్రుడురచించిన హలాయుధ స్తవమును పఠించెను. కడపట పదలాలిత్య గౌరవమునకు పేరుగన్న దండి మహాకవీంద్రుడు వ్రాసిన అనామయ స్తవమును భక్తియుక్తుడై పారాయణ మొనర్చెను. ఈ అనామయ స్తోత్రమును పఠించునప్పుడాతని నేత్రములు అశ్రుపూర్ణము లైనవి. కంఠము రుద్ధమైనది. శరీరమున పులకలు పొటమరించినవి. ఏదో యొకానొక ఆర్తి తన్ను పీడించుచున్నట్లాతని యప్పటి సమస్త స్థితియు తోపింప జేసినది.

శివభక్తులకు పైని పేర్కొన్న పంచ స్తవములు పఠనార్హములు. వారు జపతపములు ముగించిన యనంతరమీ పంచ స్తవములను పారాయణచేయుట పరిపాటి. అందును కడపటిదగు అనామయ స్తవము భక్తులకు మానసికములు, దైహికములునగు ఆధివ్యాధులను బోగొట్టి ఆరోగ్యమును ప్రసాదించునని వారి విశ్వాసము. ఇందాశ్చర్య మేమియు లేదు. భగవదుపాసనము, భగవన్నామ స్తోత్రము, భగవద్గుణ సంకీర్తనము, భగవత్సేవ సర్వార్థసిద్ధిప్రదములని చరిత్రలు తెలుపుచున్నవి. మయూరమహాకవి సూర్యశతకమును జెప్పి, తదనుగ్రహముచేత

రోగవిముక్తినందెనని వింటిమికదా ! ఇంక ఎందఱెందఱో శైవ వైష్ణవ భక్తుల జీవితాంశము లీ విషయమును రుజువు పఱచుచున్నవి.

తన [illegible] ముగించి పంచస్తవములను పారాయణ మొనర్చులోపల వీరణ్ణ పదునొకండు కొబ్బరికాయలను, కొన్ని పండ్లను, పూలను, బెల్లమును, కర్పూర కుంకుమ తాంబూలాది పూజాద్రవ్యములను తీసికొని వచ్చినాడు. ఆతడు వాని నందుకొని స్వామికి షోడశోపచార పూజలొనర్చి నారికేళాదులను సమర్పించి మంత్రపుష్పముతో అర్చన ముగించినాడు. విరుపణ్ణ మోమున దైన్యరేఖలు తారాడుచున్నవి. మనస్సులో శాంతిలేదు. ఏదో దుఃఖము ముసుగువడగా గద్గదస్వరముతో నాత డిట్లన్నాడు.

“నాయనా! నేఁటికి మనదీక్ష ప్రారంభమై ముప్పదియైదు దినములు చెల్లినవి. ఇంకను అయిదురోజులు మాత్రమే వ్రతమునకు మిగిలియున్నవి. ఇంతవఱకును లవమాత్రమేని ఫలము కలిగినట్లు లేదు. స్వామి అనుగ్రహము వచ్చునని నమ్మలేకున్నాను. ఇది మహాక్షేత్రమని శంకరాచార్యులవారు సెలవిచ్చియున్నారుగదా ! నూటయెనిమిది మహాశైవక్షేత్రములలో లేపాక్షి ఒక్కటని లలితాగమములో “లేపాక్ష్యాం పాపనాశనః” అని నేనును చదివియున్నానే.”

వీరణ్ణ : శిల్పులును భక్తులును ఏవేవో చెప్పుచుందురు. వాని నెల్ల నమ్మి నీవు పడుపాట్లు చూడ నాకు జాలి గలుగుచున్నది. ఇంతకును ఈ క్షేత్రప్రభావ మెట్టిదని శంకరు లన్నారు ?

విరుపణ్ణ: తమ్ముడా! ఇది యెంతటి పూర్వచరిత్రగల క్షేత్రమో వినుము. ఇదిగో! ఇటు రమ్ము. ఈ దేవళము నానుకొని యున్న ఈ గుహను పరికింపుము. ఇందతి ప్రాచీన కాలమున అగస్త్యమహర్షి తపస్సు చేసి యున్నాడట. అగస్త్య ప్రభావమును మనము పురాణములలో చదివియే యున్నాము. ఆయన మహావీర శైవ వ్రతాచార సంపన్నుడు. ఆ లోపాముద్రావల్లభుడు పరిపీత సప్త సాగరుడు. వింధ్యాద్రిగర్వము నడంప దక్షిణాపథమునకు బయలు దేఱి తనపాదములపై బడి నమస్కరించిన వింధ్యాద్రిని తాను వచ్చువఱకు పైకి లేవవలదని ఆదేశించి యిటు వచ్చినాడా మహానీయుడు. ఈలేపాక్షి ప్రాంతమునకు వచ్చునప్పటికి ఈ కూర్మాద్రి ఆయనను కదలనీయ లేదట. అనగా నిచ్చటినుండి పయనము సాగించుటకు ఆయనకు మనస్సు రాలేదన్నమాట. అయినను మనః ప్రబోధమును లెక్క చేయక ఆతపస్వి నడక సాగించినాడు. రెండు మూడడుగులు వేసి ఆతడు కుప్పన గూలిపోయినాడు. ఇదేమా అని ఆతడు కూర్మాద్రి నలుగడలు కలయదిరిగిచూడ మొదలిడెను. ఆతనికీగుహ కనబడినది. భవ్యములైన రెండు లింగములుకూడ దర్శనమిచ్చినవి. ఈ సంగతి నెఱింగిన లోపాముద్ర ఇదేదో భగవదాదేశముగ నున్నదని పతికి విన్నవించి ఆ గుహలో కొంత కాలము కాపురముందమని కోరినది. అందుకా తపస్వి యంగీకరించి రామేశ్వర హనుమల్లింగముల నారాధించుచు ఆ గుహలో తపస్సుచేయ నారంభించినాడు. పెద్దకాల మగస్త్యుడందు కఠోర తపము చేసెను.

ఆ తపస్సువలన ఆతని మనోదోషము లెన్నో కడుగ బడిపోయినట్లాతనికి దోచినది. మనస్సునకు మునుపటికన్న నైర్మల్యము చేకూరినది. ధ్యాన ధారణా సమాధుల నెడి యోగాంతరంగముల సమైక్య సాధనముచేత ప్రాతిభ మగు నొకానొక విశిష్ట విజ్ఞాన మాతనికి కలిగినది. ఆతడు సంయమి యయినాడు. ఆతడు వలచిన విద్యలెల్ల ఆతనికి కరామలకములు గాజొచ్చినవి. ఇంత వఱకును సంస్కృత ప్రాకృత భాషలయందే ప్రాభవమున్న యాతనికి దాక్షిణాత్యములైన దేశభాషలయందును పరిజ్ఞానము కలుగ జొచ్చినది. ఇందుకాతడెంతో వింతపడినాడు. ఈ కూర్మాద్రి క్షేత్రము, ఈ లేపాక్షి అలౌకిక మహిమాఢ్యములని యెఱింగినాడా జపదారి. అంతట ఇక్కడనొక శివలింగమును ప్రతిష్ఠింప సంకల్పించుకొన్నాడు ఆ పరమశైవోత్తంసుడు. ఈ యభిప్రాయమును లోపాముద్ర కెఱింగించినాడు. ఆ వీర శైవ వ్రతాచార పరాయణయు అందు కుత్సహించినది.

ఒకనాడా మునిపత్ని కూర్మాద్రి చఱియల విహరించుచుండ ఆమెకొక శివలింగాకృతిలో నున్న శిల పొడకట్టినది. అది ఎవరో శిల్పీశ్వరుడు చెక్కినట్లు సర్వలక్షణ సంపన్నమై తోచిన దామెకు. కాని అందు ఉలి నొక్కులు మున్నగు చిహ్నము లెవ్వియు లేవు. ఆ పరమ శివసందర్శనము తామింతవఱకొనర్చిన తపస్సునకు ఫలమని ఆమె భావించి యా లింగమును పతికి జూపినది.

ప్రకృతిలో పెక్కైన శిలలు వివిధాకారములతో సిద్ధమగుచుండును. అనేకములు శివలింగాకారములో నుండుట, వానిని స్వయంభువులని భక్తులు భావించి పూజించుట అనుభవసిద్ధము. ఈశిలలు లింగాకారములోనే గాక నానావిధ దేవతాకృతులతో గూడ నేర్పడుట ప్రకృతి సిద్ధమగు నొక ధర్మము. అట్టివన్నియు ఆయా దేవతలుగా మనుష్యులచే భావింపబడుటలో వింత లేదు. శ్రీకూర్మములోని కూర్మనాథస్వామిమూర్తి ప్రకృతిసిద్ధమైనదే. దానిని స్వయంభువుగానే మనవారు భావించినారు. మానవసంతరణమునకు భగవత్ప్రేరణగా ప్రకృతి ఈ నానారూపములను సృజించి మనకందించుచున్నదని తలంపవచ్చును. శివలింగపు పువ్వులు అట్టివే కదా! ఆ పుష్పములో ఒక పానవట్టము, దానిపై నొక లింగము, దానిపై నాగేంద్రుని పడగ – ఇవియన్నియు శివాలయములో వలెనే సుందరముగా నిమిడ్చిన పరమేశ్వరుని సృష్టివిలాసమెంత కొనియాడదగినది! ఈ లింగములలో స్వయంభూలింగములు, బాణలింగములు, అర్ష లింగము లనియు భేదము లున్నవి.

అగస్త్యు డది స్వయంభూలింగమని యెఱింగినవాడై కాశీవిశ్వనాథుడీరూపమున తమకు తోచినాడని యెంచి హర్షబాష్పము లొలుక దానినట ప్రతిష్ఠించి ఆస్వామికి పాపనాశేశ్వరుడని నామకరణ మొనర్చినాడు. తరువాత కొంతకాలమిచ్చటనే యాతపస్వి సతీసమేతముగా నివసించి స్వామిని సేవించి దక్షిణాపథమునకు పయనమై

పోయినాడు. నాటినుండియు ఈ లేపాక్షియు ఇందలి కూర్మాద్రిపై వేంచేసియున్న పాపనాశేశ్వర లింగమును సుప్రసిద్ధములైనవి.

వీరణ్ణ అయిన అగస్త్యుడు మహా వీరశైవుడని నీ యభిప్రాయమా యన్నా!

విరుపణ్ణ ఔను నాయనా! వీరశైవ మతి ప్రాచీనమైనది. వేదములనుండి సముత్పన్నమైనదే ఈ వీరశైవము. పంచముఖుడగు పరమశివుని సద్యోజాత, వామదేవ, అఘోర,తత్పురుష, ఈశానములను నైదు మొగముల నుండి వీరుడు, నంది, భృంగి, వృషుడు, స్కందుడు - అను నేవురు మహాత్ము లుదయించినారు. వారు వీర శైవగోత్ర కర్తలై శైవమును ప్రచారి మొనర్చినారు. ఈ మహాత్ములు భిన్న భిన్న యుగములలో భిన్న భిన్న నామములతో శివతత్త్వ ప్రచారము చేసినట్లు సుప్రబోధాగమాది గ్రంథములు వచించుచున్నవి. కలియుగములో వారు రేణుక, (రేవణసిద్ధ) మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్యులుగా ప్రసిద్ధులు. వీరు భారత దేశము నలుగడల పీఠములను సంస్థాపించి మతప్రచారము చేసి యున్నారు. వీరిలో రేణుకాచార్యులవారు అగస్త్యమహర్షికి వీరశైవ మత సిద్ధాంతమును మూలమట్టుగా బోధించినారట. ఆయన అగస్త్యునకు బోధించిన శైవ తత్త్వ రహస్యములనే శివయోగి శివాచార్యుడు ఇరువదియొక్క ప్రకరణము లతోనొప్పు "సిద్ధాంత శిఖామణి" యను గ్రంథముగా

విరచించినాడు. కనుక అగస్త్యుడు వీర శైవు డనుటలో నెట్టి సందియమును వలదు సోదరా! ఆతడీ కూర్మాద్రి మీది గుహలో శివుని గూర్చియే తపస్సుచేసి మహా సిద్ధుల నందినా డంటిని గదా!

అంతియేకాదు. ఈ క్షేత్రమున శివప్రసాదమునకు పాత్రుడయిన అగస్త్యుడు తమిళ దేశమున కేగి, నాడు గానటబీసటగా నున్న తమిళ భాషను సంస్కరించుట కొక వ్యాకరణ గ్రంథమును గూడ వ్రాసినాడు. ఆ గ్రంథమును అగత్తియము, పేరగత్తియము— అని పిలుచుచున్నారు. తమిళములో దొడ్డకవిగా పేరందిన "తోల్ కాప్పియనారు" ఈ అగస్త్యమహర్షి శిష్యుడే. సంస్కృతమున క్షుణ్ణముగా వ్యాకరణాదు లభ్యసించి తమిళులచే 'అగస్త్యరు' అని పేర్కొనబడిన ఈ ముని తన ప్రియశిష్యుడగు తోల్కాప్పియనారుకు ఐంద్ర వ్యాకరణాదులను బోధించి తమిళమునకు ఛందో వ్యాకరణాలంకారములను సృష్టించు నేర్పునుగూడ అలవఱచినా డందురు. ఈ అగస్త్యుని శాస్త్రప్రభావము తోల్కాప్పియరు రచించిన "తోల్కాప్పియం" అను తమిళ గ్రంథమున పలురీతుల వ్యక్తమగుచున్నదట. తమిళములో ఆయా కాలములందు వెలసిన సంగ (సంఘ) కవులమీదగూడ అగస్త్యుని సాహితీముద్రలు ఎంతగానో ముద్రితములైనవని చెప్పుదురు. ఇంకను అగస్త్య మహర్షి సంస్కృతములో విశ్వకర్మ మను మయాది శిల్పబ్రహ్మలు వ్రాసిన శిల్పగ్రంథముల నాకళించుకొని

స్వయముగా 'శిల్పకళాదీపిక, సకలాధికారము' మున్నగు గ్రంథములనుగూడ వ్రాసియున్నాడు. నాకు జూడ వింధ్య గర్వాపహరణార్థమై ఉత్తరమునుండి దక్షిణా పథమున కేతెంచిన అగస్త్యుడు దక్షిణోత్తర సంస్కృతుల సంగమమునకు ఒక బృహత్తర సేతువును నిర్మించినాడని తోచుచున్నది. ఈ విధముగా దాక్షిణాత్య భాషా శిల్ప శైవ సంస్కృతులమీద నీతడు చెరుగని ముద్రలువేసి మన కారాధ్యుడైనాడు. ఇట్టి మహాక్షేత్రమున దయామయుడగు శంకరుని ఆరాధించియు కార్యసిద్ధి పడయక పోవుట మన దురదృష్టము కాక మతేమి!

వీరణ్ణ : ఇది నాకును వింతగానే యున్నదన్నయ్యా! ఇప్పటికి మీరు తిరిగిన మహాక్షేత్రములకు, సేవించిన దేవతలకు లెక్కలేదే. ఏ దేవుడుగాని అనుగ్రహించి కార్యసిద్ధి యొనర్పగూడదా? నాకొక ఆలోచన తట్టుచున్నది. మీరెన్ని చెప్పినను మీకు శివ పక్షపాతము మెండు. కేశవు డనునప్పటికి ఒక లఘుభావము మీకు కలుగుచున్నది. అసలు శివకేశవులకు పరస్పరము అట్టి భేద భావము లున్నట్లు లేదు. "శివాయ విష్ణురూపాయ శివ రూపాయ విష్ణవే" అని యున్నదికదా. కనుక యిరువురిని సమానముగా చూచుకొను సమదృష్టికూడ మీకవసర మని నా యభిప్రాయము. మన కవిబ్రహ్మ తిక్కనామాత్యుడు హరిహరమూర్తి నారాధించి యైహికాముష్మిక సిద్ధులను పడసియుండ లేదా? మీ క్షేత్రము

నందలి స్వామియెడ భక్తి కుదురుట మంచిదే. ఈ స్వామి చెంగటనే విష్ణుదేవునిగూడ ప్రతిష్ఠ చేసినచో శివ కేశవుల విషయమున మీకుగల భక్తిప్రపత్తులు తేజరిల్లి కార్యసిద్ధి చేకూర్చునేమోయని నాకు తోచుచున్నది.

విరుపణ్ణ: తమ్ముడా! నాకట్టి భేదదృష్టిగాని, విష్ణునెడ లఘుభావముగాని లేదయ్యా! అట్టి దృష్టియే యున్నచో గొరవనహళ్ళి వద్ద లక్ష్మీదేవాలయము నేల కట్టింతును? శ్రీరంగములో రంగనాథుని, తిరుపతి వేంకటేశ్వరుని సింహాద్రి వరాహ నారసింహుని, వేలాపురము నందలి చెన్నకేశవుని తక్కుంగల నారాయణమూర్తులను ఏల ఆరాధింతును? ఇంతే కాదు. జైన బౌద్ధముల యెడ కూడ భేదము చూపక "సర్వం శివమయం జగత్" అని తలంచి శ్రమణ బెళగొళము లోని గోమటేశ్వరుని, ఆయా తావులనున్న బుద్ధమూర్తులనుగూడ ఆరాధించి తిని గదయ్యా! అయినను ఎవ్వరి దయయును రాలేదే. నీవన్నట్లు కేశవప్రతిష్ఠకూడ ఈ కూర్మాద్రిపై చేయుటకు నాకభ్యంతరము లేదు. అందుకు పూనుకొందము గాక.

## 2

లేపాక్షి ఆంధ్ర కర్ణాటదేశముల సరిహద్దులలో నున్నది. సుప్రసిద్ధాంధ్ర నగరము హిందూపుర మచ్చటికి యోజనమాత్ర దూరముండును. హిందూపురమునకు ఉత్తర దిక్కున పెనుగొండ, అనంతపురము, గుంతకల్లు, ఆదవాని,

కందనవోలు మొదలగు పట్టణము లుండును. పెనుగొండకు పశ్చిమోత్తర దిశను ఆనాటి ఆంధ్ర రాజధానియైన విద్యా నగరము తుంగభద్రా తీరమున భాసిల్లు చున్నది. దానిని 'విజయనగర' మనియు అనుచుందురు. అది పెక్కురు మహారాజు లేలిన వీడు. దాని వైభవ మిట్టిదట్టి దని చెప్పనలవి కాదు. తుళువ వంశీయుడగు శ్రీకృష్ణ దేవరాయ లిచ్చటనుండియే మహాంధ్ర సామ్రాజ్యమును నేల నాలుగు చెరగులకు విస్తరింప జేసెను. విద్యారణ్యస్వామి తపఃఫలముగాను అనేక మహాశిల్పాచార్యుల మహనీయ శిల్పోపాసనల ఫలముగాను రూపొందిన విద్యాపట్టణ వైభవము అసదృశము. శ్రీకృష్ణరాయల వారికి పెనుగొండ వేసగి విడిదిపట్టుగా నొప్పుచుండెడిది. పెనుగొండలోని గగన మహలు, యోగరామస్వామి దేవళము, కాశీశ్వరాలయము శిల్పకళౌన్నత్యమునకు పేరుమోసినట్టివి. పెనుగొండ దుర్గము నకు చుట్టునున్న కొండలు పెట్టని కోటగోడలై యొప్పుచుండ ఆ నగరము శత్రువులకు చెనక రానిదై యుండెడిది. కృష్ణ రాయ లేకాక, పిమ్మటి వారైన అచ్యుత దేవరాయ సదాశివ రాయాదులుగూడ ఈ పెనుగొండను కొంత కాలము విడిదిపట్టు గానే యుంచుకొన్నారు.

విద్యానగరమున దాక్షిణాత్యములైన ఆంధ్ర కర్ణాట తమిళ మలయాళ భాషలు మాటాడు జనులందఱు అన్న దమ్ములవలె మెలగెడివారు. ఒకరి సంస్కృతినొకరు గౌరవించు కొనుచు బ్రదుకుట ఆ నాటి ప్రజల యౌన్నత్యములోని ముఖ్య లక్షణము. ఈ సంస్కృతుల కన్నింటికి మాతృ మూర్తిగా సంస్కృతము సముచిత స్థానమునంది యుండెడిది. రాయలవారి

ఆస్థానము నా నా భాషలకు, దేశములకు చెందినకవీశ్వరులకు, శిల్పీశ్వరులకు, పండితులకు, కళాకారులకు ఆటపట్టు. రాయల సామ్రాజ్యము నందలి పట్టణములలోని ప్రజలు తెలుగువారు కన్నడ పేరులను, కన్నడులు ఆంధ్ర నామములనుగూడ పెట్టు కొనుటకు వెనుకాడెడివారు కారు. ఆదవాని, బళ్ళారి, అనంత పురము, పెనుగొండ, హిందూపురము, బెంగుళూరు ప్రాంతము లందు ఆంధ్ర కర్ణాటకుల అనుబంధము ఎంతో కొనియాడదగి నదై యుండెడిది. ఈ పట్టణములయందలి ప్రజలకు ఆంధ్ర కర్ణాటకములు రెండును తెలిసియేయుండెడివి. ఇతడు కన్నడీడా, తెలుగువాడా అని గ్రహించుట కష్టమను నంతగా వారి తీరు తీయను లుండెడివి. అసలు వస్తుతః తెలుగు కన్నడ బాసలకే యెంతో దగ్గఱి సంబంధమున్నది. తమిళము వీనికి కొంచెము దూరముగా నుండును.

విరుపణ్ణ వీరణ్ణ లిద్దరూ పెనుగొండ వాస్తవ్యులు. వైశ్య కులాలంకారులు. నంది లక్కిసెట్టి కుమారులు. విరుపణ్ణకు తలిదండ్రులు పెట్టినపేరు విరూపాక్ష శ్రేష్ఠి. అన్న పదము కన్నడమున అణ్ణయని యుండును. అన్న, అయ్య, అప్ప, అన్న పదములను తెలుగులు కన్నడులు నామముల చివర వాడుకొనుచుందురు. విరూపాక్ష శ్రేష్ఠి విరూపాక్షణ్ణయై లోక వ్యవహారమున విరుపణ్ణ అయినాడు. వీరశబ్దము శైవమత మూలపురుషులలో ఒక్కరిది. ఆ పేరు వీరణ్ణది.

లక్కిసెట్టిగారి కుటుంబము చిరకాలము నుండియు శైవ మతపరాయణము. అసలు కన్నడదేశమే వీరశైవ మతమునకు పట్టుగొమ్మకదా. అందుకు కారణము ఆమతమును ఎక్కువగా

ప్రచారము చేసిన బసవేశ్వరుడు కర్ణాటకుడగుట యొకటి. అతి ప్రాచీనకాలము నుండియు శైవములో ఎందఱో సిద్ధ పురుషులు బయల్వెడలి లోకాతీత మహిమలను చూపియు, శైవ విజ్ఞానమును ప్రచారము చేసియు దానికి బలుపు కూర్చినారు.

ఈ శైవములో పలు భేదము లున్నవి. సామాన్య, మిశ్ర, శుద్ధ, వీర భేదములతో శైవము నాలుగు రకములని సూత్రాగమము పలుకుచున్నది. ఇక కారణాగమము - సామాన్య, పూర్వ,మిశ్ర, శుద్ధ, శ్రౌత, మార్గ, వీర, సామాన్యవీర, విశేష వీర, నిరాభారములని శైవమును దశవిధముల విభజించినది. ఇంకను లకులీశ పాశుపతము, కాలాముఖము అను శైవములును గలవు. ఇవి శుద్ధశైవములోనే అంతర్భాగములని కొందఱ తలంపు. ఈదశవిధ శైవములలో వీరశైవమే ఆకాలమున ఎక్కుడుగా ప్రచారములో నున్నది. ఇందు వి శబ్దమునకు శివ జీవైక్య బోధకమగు వేదాంతవిద్యయర్థము. ర శబ్దమునకు ఆవిద్యయందు రమించువాడనియు అర్థము. కనుక శివునకు తనకు (జీవునకు) ఐక్యమును సాధింపబూను భక్తుడు వీరశైవుడని ఫలితార్థము. అంతియే కాదు. వీరశైవములో పూజా కలాపము గూడ సులభము. అల్పక్రియతో బహుఫలమును సంపాదింపవచ్చును. ఇతర శైవములు మూడు జన్మలకుగాని ముక్తి నీయజాలవు. వీరశైవమట్లుకాక ఒక్క జన్మములోనే మోక్షమును ప్రసాదింప కలుగుచున్నది. అందుచేత అన్ని శైవముల కంటెను వీరశైవము ఉత్తమోత్తమమని కారణాగమాదు లనుచున్నవి. ఈవిధముగా సర్వజీవులకు శాంత్యానందముల నొసంగి భగవత్ప్రాప్తిని చేకూర్చునది ఈ వీరశైవము.

బసవన్న బహుళ ప్రచారముచేసిన వీరశైవము కన్నడ దేశపు సరిహద్దులనుగూడదాటి ఆంధ్ర తమిళాది దేశములందును నెలకొన్నది. త్రిలింగదేశమని ప్రసిద్ధిగన్న ఆంధ్రమున శైవము మొదటి నుండి యున్నదికదా! పండితారాధ్య పాల్కురికి సోమనాథాదులు ఆంధ్రదేశమున ఈ మతమునకు సాహిత్య స్వరూపము నిచ్చి విపుల ప్రచార మొనర్చినారు. కాకతీయ ప్రభువుల అండదండలు దీనిని తెలుగునేల నాలుగు చెరగుల వ్యాపింపజేసినవి. కృష్ణరాయల కాలమున వైష్ణవము రాజాదరము పొందినను శైవమునకును తగిన స్థానము లేక పోలేదు. రాయలఆస్థానము నలంకరించిన కందుకూరి రుద్రియ ధూర్జటి కవిప్రభృతులు శైవులుగానే యున్నారు. రామాయణ కవయిత్రి ఆతుకూరి మొల్ల శివమతస్థురాలే. పెక్కు శైవ మఠములు, పీఠములు దీనికి పట్టుగొమ్మలు. ఇక ప్రజలలో శైవమునకు ఆదర ప్రోత్సాహము లుండుటలో వింత యేమున్నది!

విరుపణ్ణకు వీరశైవమునందు ఎనలేని ఆదరము. ఆతడు ప్రతిదినము శివ తత్త్వ సారమును, బసవ పురాణమును, పండితారాధ్య చరిత్రమును, చదువుచుండును. సూక్ష్మ, కారణ, సుప్రబోధాది శైవాగమములను శైవాచార్యులవద్ద పఠించినాడు. వీలున్నపుడెల్ల షట్కాల శివపూజను నెఱవేర్చుచుండును. వీలని చెప్పుటకు కారణము, ఆతడు ప్రభుత్వోగియై తీఱిక లేనివాడగుట.

విరుపణ్ణ విద్యానగర సామ్రాజ్యమున ధనాగారాధ్యక్ష పదవిలో నున్నాడు. ఆ పదవిని స్వీకరించినప్పటి నుండియు

ఆతడు విద్యానగరములోనే యెక్కువకాలము గడుపవలసి వచ్చినది. అయినను ధనాగారశాఖ యొకటి పెనుగొండలో గూడ నుండుట వలనను, జన్మస్థానము పెనుగొండ యైనందు వలనను అక్కడగూడ తఱుచు నివసించుచుండువాడే. ఈ కోశాధ్యక్షుపదవీ నిర్వహణ బాధ్యతలలో చిక్కుకొన్నందున ఆతని కప్పుడప్పుడు తీఱిక దొరకక నియమానుసారము షట్కాల శివపూజ యొనర్చుటకు వీలు చిక్కునది కాదు.

విరుపణ్ణకు వీరభద్రుడను నొకకుమారుడు కలడు. ఆతనికి ఎంతకాలమునకును మాటలు రాలేదు. మూగవాడగునేమో యని భయపడి విరుపణ్ణ జ్యోతిశ్శాస్త్రజ్ఞులను విచారించెను. వారు వీరభద్రప్ప జాతకమును పరిశీలించి దైవానుగ్రహమున కొంత కాలమునకు వీరభద్రుని మూకత్వము పోవచ్చుననియు, ఇందుకు మంత్రములు, ఔషధములు, పూజలు పని చేయవచ్చుననియు నుడివిరి. ఆ దైవ మాట ఆ శివభక్తునికి నచ్చినది.

" మూకం కరోతి వాచాలం
పఙ్గుం లఙ్ఘయతే గిరిం
యత్కృపా త మహం వన్దే
పరమానన్ద శంకరమ్.. "

భగవదనుగ్రహము మూగవానిని వాచాలునిగ జేయ గలదు. కుంటివానిని కొండలు దాటించగలదు. అను సూక్తి మీద విరుపణ్ణకు గాఢవిశ్వాసము. అందుచే ఆతడు ఎన్నో రీతుల ఈశ్వరారాధన మొనర్చినాడు. యోగులను సేవించి నాడు. వైద్యములను జేయించినాడు. పెక్కు శైవ వైష్ణవ

క్షేత్రములకేగి ఆ యా దేవతలను చిర మారాధించినాడు. శ్రీశైలములోను కాళహస్తిలోను ఆతడొనర్చిన శివారాధనలకు దాన ధర్మములకు లెక్కలేదు.

కాళహస్తీశ్వరాలయములో ఒక బావి యున్నది. దానిని సారస్వతతీర్థ మందురు. అందలి నీటిని నలుబదిరోజులు సేవించినయెడల మూగవానికి గూడ మాటలు వచ్చునని చెప్పుదురు. ఆ వృత్తాంతము నెఱింగి మండలము దినములు శివదీక్షతోనుండి కుమారునిచేత సమంత్రకముగా త త్తీర్థమును పానము చేయించినాడు. ఫలము కలుగలేదు.

దక్షిణకాశియని ప్రసిద్ధిగన్న అలంపురమునకేగి ఉత్తర వాహినియగు తుంగభద్రానదీ జలముల తానమాడి ఆ క్షేత్ర మున నున్న వీరబ్రహ్మేశ్వర, విశ్వబ్రహ్మేశ్వరాది నవ బ్రహ్మేశ్వర లింగములను పరమభక్తి తాత్పర్యములతో పెద్ద కాలము కొలిచినాడు. ఈ తీర్థ సేవలతో విరుపణ్ణ ధర్మపత్ని కామాక్షిగూడ విసిగి పోయినది. లేక లేక కలిగిన అల్లారు ముద్దులపట్టియీవి అనురాగాతిశయము ఆతని ముద్దుమాటల విని ముచ్చటపడుటకు, ఆతని సర్వవిద్యాశాలి నొనర్చి మురియుటకు ప్రేరేచుచున్నది.

వెంకణాచార్యుని ప్రేరణముచే చివరికా దంపతులీ నిర్ణయము చేసికొన్నారు. లేపాక్షి దగ్గఱ నున్న కూర్మాద్రి మహిమగల క్షేత్రము; అగస్త్యుడు తప మొనర్చిన ప్రదేశము. అగస్త్య ప్రతిష్ఠితుడగు శ్రీ పాపనాశేశుడు తమ పాపములను తుడిచివేసి కుమారుని అనుగ్రహింప గలడని ఆ అల్మగలు

మితిలేని భక్తి ప్రపత్తులతో ఏక భుక్తము భూశయనము నొనర్చుచు పంచాక్షరీమంత్రోపాసనతో పాశుపతవ్రత దీక్షకు కడంగినారు. సంపన్నులు కానిచో ధనాభావమున ప్రయత్న లోపము జరుగ వచ్చును. పుట్టినదా, శ్రీమన్తమగు వైశ్య కుటుంబమున, ఆధిపత్యమా, ఒక సామ్రాజ్యమునకు చెందిన విపుల ధనాగారమునకు. హృదయమునందా, గాఢమగు దైవ భక్తి విశ్వాసములున్నవి. ఇక వారెట్లూరకుండగలరు? కార్తిక మాసము శివప్రీతి పాత్రమైనది. ఆమాసమున పెక్కురు శివ భక్తులు నక్తవ్రతములు చేయుదురు. కొందఱు ఏకాదశ రుద్రాభిషేక మొనర్తురు. ఇంక కొంద ఱా యా శివదీక్షలను పూని ఈశ్వరారాధన మొనర్చుచుందురు. విరుపణ్ణ కార్తిక శుక్ల ప్రతిపద్దినమున నారంభించి పాపనాశేశ్వరోపాసనమును నలుబదిదినముల గాఢదీక్షతో చేయ మొదలిడినాడు. మార్గశిర శుద్ధ పంచమి వచ్చినది. ఇంతవఱకెట్టి ఫలితమును గలుగ లేదు. శివారాధన దీక్షాదినములు పూర్తి కావచ్చుచున్న కొలది వారి హృదయములలో నిరాశా సంతాపములు అలముకొన జొచ్చినవి. "సృష్టిలో నెప్పుడైనను మూకుడు వాచాలుడైన ఘట్టము లున్నవా? అది కవి కల్పితవాక్యమే కాని సత్యము కాదా యేమి? లేక పరమేశ్వరుడు మమ్ము పరీక్షించుట ఇంకను పూర్తికాలేదా? ఏమో! ఏమైననగు గాక, కర్తవ్య నిర్వహణమే మానవులు చేయవలసినది. ఫల ప్రాప్తి దైవాధీనము" అనుకొని ఆ దంపతులు వ్రతపరి సమాప్తివఱకు ఈశ్వరారాధనము సల్పుచునే యుండిరి. విరుపణ్ణకు తమ్ముడు సూచించిన రీతిగ ఈ క్షేత్రమున విష్ణుస్థాపనము చేయుటయు అవశ్య కర్తవ్యమే యని తోచినది.

వీరభద్రప్ప మూగతనము విచిత్రమైనది. కొందఱికి మూగతనముతో బాటు చెవిటి తనము నుండును. ఇతనికా బధిరత్వము లేదు. నాలుక మొద్దువాఱి లావై యున్నం దున నోటిలో తిరుగ వీలుకాక మూగతన మేర్పడును. కాని వీరభద్రప్ప నాలుక వెదురాకువలె పలచగనే యున్నది. జిహ్వా కంఠ తాల్వాది ప్రదేశములలో ఎట్టి దోషములును లేవు. మఱి మాటాడజాలమి కేమి కారణము? ఇది వింతలలో వింతగా నున్నది. వైద్యులీరీతిని పరిశీలించి తెల్లమొగములు వేసి నారు. వీరభద్రప్పకు తెలివి తేటలలో వెలితి లేదు. మనము చెప్పెడి మాటలను అర్థము చేసికొనగలడు. చెప్పిన పనులను చేయగలడు. కాని మాటాడలేడు. మాఱుపలుక లేడు. అందు కాతడు ప్రయత్నము చేయును. మాటాడ నోరు తెఱచును. మాట రాదు. ఏదో బాధ ఆ సమయమున ఆతని మోమున వ్యక్తమగును. తన్నెవ్వరో మాటలాడనీయక తనకంఠమును నొక్కినట్లు, తన దవడలనదిమి పట్టినట్లు, తన పెదవులను విప్ప నీయనట్లు, ఆతడు ఒకానొక బాధను నటించును.

ఈ దుస్థితికి వగచియు వాని తెలివి తేటలకు మెచ్చు కొనుచు తలిదండ్రులాతని కక్షరాభ్యాసము చేయించి చది వించినారు. ఆత డక్షరము లన్నిటిని వ్రాయ నేర్చినాడు. క్రమముగా గురువులు చెప్పినదెల్ల వ్రాయుటకు, వ్రాతతోనే జవాబు లిచ్చుటకు ఆ బాలు డలవాటు పడినాడు. వరుసగా గద్యపద్య గ్రంథముల నర్థము చేసికొనుటకును, రామాయణ భారతములను సైతమవగాహన పఱచుకొనుటకును ఆతనికి శక్తి చేకూరినది. తండ్రి చెంగట గూర్చుండి శివలీలలను,

తదితర కథలను ఆతడు వినెడివాడు. తన సందేహములను పలకపై వ్రాసి చూపెడివాడు. తనకు కావలసిన వానిని గూడ వ్రాసి చూపియే తెప్పించుకొనెడివాడు సైగలతో తెలుప వీలులేని వానినెల్ల పలకమీద వ్రాసి చూపవలసి వచ్చెడిది. వీరభద్రున కిప్పటికి పదియేనేండ్లు దాటినవి. బాల్యమును దిగద్రొక్కి యౌవన రేఖ యాతని శరీరము నలంకరింప బూనుకొన్నది. ఆతడిప్పుడు షోడశకళా పరిపూర్ణచంద్రుని భాతి షోడశవర్ష దేశీయుడు. కాని నోటితో మాటలాడలేక పోవుట ఒక్కటియే ఆతనికి కొఱత. అందచందములకుగాని, హావభావములకుగాని వానిలో నెట్టి కొఱతయు లేదు. ఇన్ని యోగ్యతల నిచ్చిన దేవుడు నోటికి మాటనేల యీయలేదో తెలియకున్నది.

## 3

అది నలుబదవరోజు. వీరుపణ్ణ తన నిత్యోపాసనాకార్యములో నిమగ్నుడయి యున్నాడు. ప్రగాఢమగు భక్తితో ఏకాగ్ర చిత్తముతో ఆత డీశ్వరధ్యాన మొనర్చుచున్నాడు. అప్పుడాతని యింద్రియములు తమతమ విషయములను గ్రహింపలేని స్థితిలో నున్నవి. ఆ ప్రాంతముననగు నేధ్వనియు వాని వీనుల బడుటలేదు. ఆతడు తన హృదయారవిందమున పరమశివ స్వరూపమును ప్రతిష్ఠించుకొని మనోనేత్రముతో ఆ దివ్యమూర్తినే సందర్శించుచున్నాడు. ఆతడు భగవత్సందర్శనచే గలిగిన దివ్యానందముతో తన్మయుడై యున్నాడు.

ఆనాడు తండ్రి శివపూజకు కూర్చుండగానే ఎవరో చెప్పినట్లు వీరభద్రుడుకూడ వచ్చి ఆయన సరసనే పద్మాసనము

వైచుకొని ఆసీనుడైనాడు. తానిదివఱకు నేర్చిన "వందే శంభు ముమాపతిం" అను శివస్తోత్ర శ్లోకము నా కుఱ్ఱడు మన సార జపింప మొదలుపెట్టెను. తండ్రి జపముచేసినంతసేపును ఆతడును కన్నులు మూసికొని ఆ పాపనాశేశ్వరుని ధ్యానించుచునే యున్నాడు. ఇంతలో తల్లి కామాక్షి నారికేళాది పూజాద్రవ్యములను తెచ్చి యటనుంచి భర్తృదేవుని ఆజ్ఞకై వేచియున్నది. ఆమెకూడ ఒకప్రక్కను కూర్చుండి పంచాక్షర మును జపింప నారంభించినది. కొంతసేపిట్లు గడుచునప్పటికి ఆ పిల్లవాని నోటినుండి ఓం నమశ్శివాయ, ఓం నమశ్శివాయ అనుమాటలు ఆకస్మికముగా ఉచ్చైర్నాదముతో వెలువడెను. ఆ ధ్వనితో కామాక్షి యులికిపడి కనులు విప్పిచూడ కుమారుడట్లే నమశ్శివాయ మంత్రము నుచ్చరించుచున్నాడు. ఆతని కన్నులు మూసికొనియే యున్నవి. ఇక ఆ తల్లి సంతోషమున కంతు లేదు. ఆమె ఆనందమును పట్టజాలక పతిని ప్రబోధింత మని తలచినదికాని, ఆయన సమాధిస్థితి భంగము కలిగింప నిష్టములేక తానుగూడ వినబడునట్లు నమశ్శివాయ మంత్రము నుచ్చరింప మొదలిడినది. వీరిద్దఱిట్లు కొంతవడి శివ ప్రార్థన మొనర్చుచున్నంతలో విరుపణ్ణకు స్మృతి వచ్చినది. ఆతడు నమశ్శివాయ అని పలుకునది కామాక్షియనిమాత్రమే మొట్టమొదట తలంచెను. కాని విన్నకొలది రెండుగళము లట్లుచ్చరించుచున్నవని భావించి కుమారునివైపు చూచెను. ఆతని పెదవులు కదలుచున్నవి. ఆతడు నమశ్శివాయ అను మాటలను స్పష్టముగానే ఉచ్చరించుచున్నాడు. ఇక విరుపణ్ణ ఎన్ని కొండలనెక్కినాడో చెప్పలేము. ఆతడు కుమారుని బిగ్గ కవుగలించుకొని "నాయనా! నేటికి మాతపస్సులు పండినవా?

నీకీనాటికి మాటలు వచ్చినవా తండ్రీ !" అని చిరమానంద బాష్పములతో నాతని తలను మూంచియెత్తినాడు.

వీరభద్రప్ప: నాయనా! నాకీనాడెందుకనియో మీ శివపూజలో పాల్గొనవలయునని బుద్ధిపుట్టినది. అంతట వచ్చి మీ ప్రక్కను గూర్చుండి "వందే శంభు ముమాపతిం" అను శ్లోకమును మనస్సులో అనుకొనుచుంటిని. కొంతసేప టికి నాకు నిద్రవచ్చినది. కాని పండుకొందమని బుద్ధి పుట్టలేదు. ఆ నిద్రలో ఒక కలగంటిని బాబూ! ఒక మహానుభావుడు నా కగపడినాడు. ఆతడు వీరభద్ర స్వామి యట. మొన్న పెనుగొండలో "వీరభద్ర పళ్ళెము" పట్టినప్పుడు మీరాస్వామిని కొలిచినారు గదా ! నాకలలో కనబడిన దేవుడు అన్నివిధముల అట్లే యున్నాడు. ఆయన అగపడగనే నేను భక్తితో వాని కాళ్ళపై బడితిని. ఆతడు నన్ను లేవనెత్తి "నీ వీనాటి నుండి మాటలాడగలవు. అన్ని చదువులు చదువగలవు. మీ తలిదండ్రుల తపస్సులు ఈనాటికి పండినవి. కాని నన్ను మాత్రము ఇచ్చటనే నిలుపుకొన వలయును. నే నెవరి ననుకొనుచున్నావో! మీ యిలువేల్పును వీర భద్రస్వామిని" అని నా చెవులో ఓం నమశ్శివాయ అని చెప్పి దానిని నోటితో పలుకుమని ఆజ్ఞాపించినాడు నాన్నా ! నేను దాని నుచ్చరింప ప్రయత్నించితిని. కాని పలుకలేక మునుపటివలెనే బాధపడుచుంటిని. నా బాధను కాంచిన ఆ స్వామి తనకుడిచేతితో నాశిరస్సును ముఖమును గట్టిగా తుడిచి యిప్పు డుచ్చరింపుమని

సెలవిచ్చినారు. అంతట ఏబాధయు లేకుండగనే నేను ఓంనమశ్శివాయ అని ఉచ్చరింపజాలితిని. కొంతసేపట్లు పలుకుచుండ మీరువచ్చి నన్ను కౌగలించుకొన్నారు. నాకప్పుడు మెలకువ వచ్చినది. వీరభద్రస్వామి నాపాలిటి దేవుడు. నేనాయనను చూడకుండ ఉండలేను. నన్నా దేవునివద్దకు తీసికొని పొండు.

కుమారుని మాటలు వినుచున్నంత సేపును కామాక్షీ విరూపాక్షులు ఏ స్వర్గ వీథులలో సంచారము చేసినారో చెప్ప జాలము. వారికీ సంఘటనమువల్ల దైవముమీద భక్తి విశ్వాసములు స్థిరపడి పోయినవి. భగవంతుడు భక్తుని పరీక్షించు నప్పుడు భక్తుడనేకావస్థల ననుభవించు చుండును. కార్య సిద్ధి దూరమగుచున్న కొలది భగవంతు డున్నాడను విషయ మును గూడ భక్తుడు సందేహించుచుండుట పరిపాటి. గజేం ద్రుని చూడలేదా ? తన్ను రక్షించుటకు దేవుడు రాలేదని యాతడు "కలడు కలండనెడువాడు కలడో లేడో !" అని శంకించినాడు గదా. భక్తుడు తన మనోభీష్టము సిద్ధించు నప్ప టికి ఆ భగవానుని యెడ నిరతిశయ భక్తి తాత్పర్యములు ప్రకటించుటయు అనుభవసిద్ధమే. విరుపణ్ణకిప్పుడట్టి విచిత్రాను భూతియే కలిగినది. ఆతనికి సర్వేశ్వరుని నానావిధ నామ రూపముల యెడ అచంచల విశ్వాస మేర్పడినది. "తా మారాధించినది పరమశివుని. తమ నను్గ్రహించి కార్యసిద్ధి యొనర్చినది వీరభద్రస్వామి. అనగా ఆ పరమేశ్వరుని పుత్ర రత్నము. ఈ వింత యేమి? తండ్రిని కోరిన పనిని ఆ తండ్రి తన కుమారునిచే నిర్వర్తింప జేసినాడా యేమి ? లేక వారిరు

వురు తం|డ్రీ కొడుకులే కనుక వారిలో భేదములేదా? ఏమో! ఇది యంతయు అనూహ్యముగా నున్నది. అజ్ఞానముచే దోచు భేదమువలె నున్నది. సర్వేశ్వరుడగు భగవంతునికి తాను, భార్య, బిడ్డలు, పరివారము, వాహనములు ఇవి యన్నియు లీలలు. అసలు ఆతడొక్కడే ఇన్ని రీతుల దోచు చున్నాడు. ఆ తోచుట భక్తుల మన స్తృప్తి కొఱకు. "ఏకం సత్" అని కదా వేదఘోష. దానిని భక్తులు అనేక నామ రూపములతో భావించు చున్నారు. అసలా తత్త్వము నామ రూప క్రియా విరహితము కదా "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అని శంకరాచార్యు డెన్ని సారులో చెప్పుచుండెడివాడు. ఒకే సత్పదార్థము సృష్టి స్థితి లయాది కార్యములకు బూనినపుడు బ్రహ్మ విష్ణు శివాది నానా నామము లతోను బహురూపములతోను భాసిల్లుచున్నట్లు వాఙ్మయము వర్ణించుచున్నది. ఒకే దైవశక్తి ఒకొక్క కార్యమును నెఱ వేర్చునప్పుడు ఒకొక్క నామముతోను రూపముతోను వ్యవహ రింపబడుననుట సత్యము. సంపూర్ణ జ్ఞానము లేమిచేతనే ఈ నామరూపములకు ప్రాధాన్యమిచ్చి కలహించుచుందురు. స్వర్ణము విభిన్నాభరణములయినట్లు, మట్టి ఘటశరావాదులగు నట్లు పరమేశ్వరతత్త్వమొక్కటే పలురీతుల ప్రకాశించుచున్న దనుట పరమార్థము. ఈ నామరూపములు ఆమూలతత్త్వమును దర్శించుటకు సాధనములు కావలయును. తమ్ముడు వీరణ్ణ కీ రహస్యము లిదివఱకే తెలియునా యేమి? ఆతడు చెప్పినట్లు శివకేశవులకు భేదము లేనట్లే, శివునకును వీరభద్ర వినాయ కాదులకును పార్వత్యాదులకును భేద మేల యుండవలయును? లేదు. ముమ్మాటికిని లేదు. నదులు సాగరమును జేరునట్లు

సర్వ దేవతార్చనలును ఆ సర్వేశ్వరునే పొందగలవు. "సర్వ దేవ నమస్కార శ్శంకరం ప్రతిగచ్ఛతి." పరమార్థ మిట్టిదైనను వ్యవహారమున భేదము పాటించుట తప్పుగాదు. ఆ పాటించు టనునది రాగ ద్వేషరహితముగా జరుగవలయును. అది కేవలము ప్రవృత్తికొఱకు మాత్రమే." ఇట్టి తలపులతో విరుపణ్ణ మన స్సులో నాడు పెద్ద కలత బయలుదేరినది. కడకాత డిది యంతయు భగవల్లీలగా భావించి ఆకూర్మాద్రిమీద విష్ణువుతో బాటు వీరభద్రస్వామినిగూడ ప్రతిష్ఠించుటకు నిశ్చయించు కొన్నాడు. స్వామియైన వీరభద్రుడును కుమార వీరభద్రు డును కోరుకొన్న దదియే కదా. శైవములో పదునొకండు సంఖ్య కొక ప్రాధాన్యమున్నది. శివాత్మకజ్యోతి పదునొకండు రూపములు కలిగినట్టిది. అందుకే ఏకాదశరుద్రు లేర్పడినారు. అనేకులు శివలింగ ప్రతిష్ఠలు చేయునపు డేకాదశ రుద్రరూప లింగములను ప్రతిష్ఠించు నాచారము సైత మున్నది. విరుపణ్ణ యింతవఱకొనర్చిన శివోపాసనములో ప్రతిదినమును పదు నొకండు నారికేళములను పాపనాశేశ్వరునికి సమర్పించుటలోని రహస్యముసైత మిదియే. ఆవిధముగానే వీరభద్రునికి మాట వచ్చిన పిమ్మట విరుపణ్ణ పదునొకండు రోజులు మహా సమా రాధనము తలపెట్టి సర్వ వర్ణములవారికి అన్నదానము చేయ మొదలిడినాడు.

విజయనగరాధిపులగు అచ్యుతదేవరాయలకు మిక్కిలి ప్రేమాస్పదుడును రాజకార్య ధురంధరుడును ప్రజాశ్రేయ స్కామియు అయిన విరుపణ్ణ మూకకుమారునికి దైవానుగ్రహము వలన-లేపాక్షిలోని పాపనాశేశ్వరస్వామి దయవలన మాటలు

వచ్చినవను వార్త రాజ్యము నలుమూలల వ్యాపించినది. ప్రజలకు విరుపణ్ణమీద గౌరవము, స్వామిమీద అచంచల భక్తి విశ్వాసములు ప్రబలినవి. తెలుగు కన్నడ దేశముల యందలి మారుమూల గ్రామములనుండి కూడ జనులు తండోపతండములుగా వచ్చి స్వామి సందర్శనము చేసికొని సమారాధనోత్సవములలో పాల్గొని పోవుచున్నారు. ఈ సంఘటనము మహావీరశైవులగు విరుపణ్ణ సోదరుల దైవభక్తిని లోకమునకు మిక్కిలిగా చాటినది. విరుపణ్ణను సాక్షాదీశ్వరాంశ సంభూతునిగా ప్రజలు భావింపజొచ్చినారు. ప్రజలలో విరుపణ్ణకు వలసినంత పలుకుబడి హెచ్చినది. వారు విరుపణ్ణ విష్ణు వీరభద్రమూర్తులనీ కచ్ఛపాద్రిపై ప్రతిష్ఠింప సంకల్పించినాడని యెఱింగి అందుకువలసిన సర్వసాహాయ్యములును చేయుటకు నడుము కట్టియున్నారు.

## 4

దక్షిణాపథమున పూర్వకాలమునుండియు పెక్కు శిల్పవిద్యా గురుకులము లుండెడివి. ద్రవిడదేశములో రామేశ్వరము, తంజాపురము, చిదంబరము, కంచి, మహాబలిపురము మున్నగు పట్టణములయందును— మలయాళమున తిరువనంతపురాదులయందును— కన్నడదేశమున మహీశూరము, నాగమంగళము, హాసన్, వేలాపురి, హాలేబీడు, శ్రావణబెళగుళము, శ్రీరంగపట్టణము మున్నగు తావులయందును గల శిల్పవిద్యా గురుకులములు సుప్రసిద్ధములు. ఆంధ్రదేశమున సింహాచలము, రాజమహేంద్రవరము, బెజవాడ, పెందోట, మాచర్ల,

పాంచాలవరము, తిరుపతి, గుంపరమానుదిన్నె, పాటూరు, తాడిపత్రి, ఆనెగొంది, బళ్లారి, విజయనగరము మున్నగు తావులయందున్న శిల్పవిద్యాగురుకులములు పేరు మోసినవి. ఈ గురుకులములయందు యుక్తకాలమున ఉపనీతులైన విశ్వబ్రాహ్మణ బాలురకు శిల్పవిద్య ప్రధానముగాను దాని కంగములుగా వేదాగమ జ్యోతిషాది విద్యలను బోధించెడి వారు. ఒక్కొక్క గురుకులమునకు ప్రధానాచార్యుడు—కులపతి యుండును. ఈయన సర్వతంత్ర స్వతంత్రుడుగాను సర్వశిల్ప విద్యాప్రవీణుడుగాను నుండును. ఆయనకు సహాయులై ఆ యా శిల్పములందును, శాస్త్రములందును నిపుణులగువా రుండెడి వారు.

ఒక్కొక్క విద్యాలయమున నూర్గురువఱకు విద్యార్థులు శిక్షణ పొందుచుందురు. వీరికి విశ్వకర్మ విరచితశిల్ప వాస్తు శాస్త్రములతోబాటు మయుడు, కశ్యపుడు, సమరాంగణుడు, భువనదేవాచార్యుడు మున్నగు ప్రాచీ నార్వాచీన శిల్ప సూత్రకారులు వ్రాసిన శిల్పగ్రంథములలోని ముఖ్యభాగములు బోధింపబడుచుండెడివి. శిల్పవిద్య హస్తకౌశల ప్రధానమైన దయినందువలన ఆ యా పనులు విద్యార్థులచే చేయించుట ఇందు ప్రధానము. వీనితోబాటు దిక్సాధన, భూపరీక్ష, శిలా పరీక్ష, రత్నపరీక్ష, లోహాదుల గుణాగుణ విజ్ఞానము, పంచ లోహ నిర్మాణము, వర్ణవిజ్ఞానము, చిత్రకర్మము, వర్ణమేళనము మొదలగు సర్వ కళావిషయములును బోధింపబడెడివి. దేవాలయాదులలోని మూర్తులక్రింద నుంచవలసిన నానావిధ యంత్రములు, తత్తదుపాసనా మంత్రములు, ఏరోగమున

కే యే మూర్తుల నారాధించవలసినదియు, ఏ కోరిక నెఱ వేఱుట కెట్టి దేవతను పూజింపవలసినదియు అంగోపాంగ ప్రత్యంగ సహితముగా విద్యార్థులకు చెప్పెడివారు. ఈ గురు కులములందు పదిరెండేండ్లు నియమబద్ధుడై సుశిక్షితుడైన విద్యార్థి అపర విశ్వకర్మవలె సర్వశిల్పకలా గురుడై ప్రకాశించు ననుటలో అతిశయోక్తి లేదు. విద్యార్థులు మయమతము నిరూపించిన సర్వలక్షణములుగల శిల్పాచార్యులుగా నిందు తీర్చబడెడివారు.

విజయనగరములోని శిల్పవిద్యా గురుకులము మిక్కిలి పెద్దది. ఆంధ్ర సామ్రాజ్యపు రాజధానిలో నున్నందువలన దానికట్టి పెద్దఱికము చేకూరినది. శిల్పకళాభిమానులగు విజయ నగర మహారాజుల పాలన పోషణము లా గురుకులమున కంత గొప్పదనమును గూర్చినవి. ఇందు కులపతి టెంకణాచార్యుడు. ఇతడు ఆద్య శిల్పప్రవర్తకులగు పంచర్షులలో సానగబ్రహ్మఋషి గోత్రమున బుట్టినవాడు. సర్వశిల్ప విద్యారాశి బిరుదాంచి తుడు. విజయనగరములోని విఠలాలయము, విరూపాక్షాలయా దులు ఈయన కరకౌశలముచేతనే వన్నెచిన్నెలతో నలరారి నవి. కృష్ణరాయలు దేశములో వెలయించిన సర్వ శిల్ప వాస్తుకార్యములందును టెంకణశిల్పి చేయి తగులనిది లేద న్నచో ఆ శిల్పాచార్యుని ప్రావీణ్యము, రాయలవారి కాయన యెడ గల గౌరవము తేటతెల్లములగును. రాయలవారు రత్న హారము నిచ్చి ఈ ఆచార్యుని గౌరవించినాడు. ఇట్టి టెంకణా చార్యుని ప్రధానాధిపత్యమున శతాధికాచార్యుల తోను సహస్రాధిక శిష్యగణముతోను ఆశిల్పవిద్యాలయము వెలుంగు

చుండెడిది. దాని నొక శిల్ప విశ్వవిద్యాలయమని చెప్పినను చెప్పవచ్చును. రాజ్యములో ఏ ప్రాంతమునం దే దేవాలయ, గోపుర, ప్రాకార, విగ్రహాదుల నిర్మాణము జరుగవలయు నన్నను ఇచ్చటే దానికి పూర్వరూప (ప్లాను) మేర్పడవల యును. ఒకవేళ ఇతరశిల్పుల యాధిపత్యమున నిర్మితమగున దయినను ఈ శిల్పవిద్యాలయ ముద్ర నందుకొనక తప్పదు. ఆంధ్ర దేశమున పలు శిల్పవిద్యాలయములందు పేరుగాంచిన శిల్పాచార్యులను రప్పించి తగిన భృతు లొసంగి రాయలవా రిందు నియమించెడివారు.

విరుపణ్ణకు శిల్పములన్న ప్రాణము. అతనికి వెంకణాచా ర్యునితో ఎక్కువ పొత్తు కలదు. అనేక శిల్పాగమ వేదాన్త మన్త్ర రహస్యముల నప్పుడప్పు డాతడు వెంకణశిల్పివలన విను చుండువాడు. దానికిదోడు కుమారునికోసమై పలు దేవాలయ ముల కేగినపుడు అటనటగల శిల్పచాతుర్యములు వాని నెక్కు వగా మోహపెట్టినవి. అతడు సింహాచల వరాహనృసింహాలయ శిల్పములకు కైవారము చేసినాడు. శ్రీకూర్మములోని కూర్మనాథాలయమును, అరసవల్లిలోని సూర్యనారాయణ మూర్తిని గాంచినాడు. ముఖలింగము, దాక్షారామము, రామప్పగుడి మొదలగు తావులలోని శిల్పకళకు ముగ్ధు డైనాడు. వేయేల, శాతవాహనులయు, ఇక్ష్వాకులయు బౌద్ధ శిల్పములను, పల్లవ, చోళ, చాళుక్య, కాకతీయ, హొయసలా దుల కాలములలో వెలసిన శిల్పకళాభేదములను వాని పౌన్న త్యమును జూచి విరుపణ్ణ కొన్ని ప్రత్యేకాభిప్రాయముల నేర్పఱచుకొన్నాడు.

ఆయా రాజులు అమరములగు శిల్పములను వెలయింప జేసి అమృతులైన సంగతి ఆత తెఱుంగును. తానుగూడ తన జీవితమున ఒక మహా క్షేత్రమున మహా సేయ మగు శిల్పమును వెలయింపజేసి జన్మ ధన్యము చేసికొనవలయునను సంకల్పము విరుపణ్ణ హృదయాంతరాళములో ఏ నాటి నుండియో కలదు. ఆ సంకల్ప బీజమును నాటి మొలకరింపజేసి ఫలితావస్థకు తెచ్చుట కిప్పు డదను దొరకినది. ఇందుకు తన కుమారుని మూకత్వము గూడ కొంతవఱకు దారి తీసినది. ఆ యాపదను నివారించుకొనుట కాతని సహజ శివభక్తి వేయి రెట్లుగా వికసింపవలసి వచ్చినది. వికసించినది గూడ. ఇక ఆతడు పరమేశ్వరునికి తన కృతజ్ఞతను ప్రకటించు కొనుటయే మిగిలి యున్నది.

లేపాక్షిలో విష్ణు వీరభద్రమూర్తులను ప్రతిష్ఠించి, పాపనాశేశ్వరునితో గూడ ఆ దేవతలకు శాశ్వత కళానిధానము లగు ఆలయ మండప గోపుర ప్రాకారాదులను నిర్మించి అందు అమోఘ శిల్పకళాలక్ష్మిని తాండవింప జేయుటకు ఆతడు బద్ధ దీక్షు డైనాడు. అందుకై విజయనగర శిల్పవిద్యాగురుకులమున కులపతియు తనకు గురుప్రాయుడు నగు వెంకణాచార్యునితో అన్ని విషయములు చర్చించుట కాతడు సకుటుంబముగా విద్యానగరమునకు విచ్చేసినాడు.

## 5

మన్మథదైవతోత్సవ మనోహరమైన వసంతము. వృక్ష లతా నికుంజములు నవకిసలయ రాగములతో ముద్దు లొలి

కించుచున్నవి. లతాలలనలు వృక్షరాజములను గౌగిలించుకొని మురిపెములు చూపుచున్నవి. మావిచివుళుల మెసవి మత్తిల్లిన కలకంఠములు కలకంఠములై పంచమస్వర సంగీతములను బాడుచున్నవి. మల్లికాకుసుమ మధురపరిమళ పరీతములైన నికుంజములయందు తుమ్మెదలు నూతపుష్ప మధుపానమత్తములై మంజులగానము చేయుచున్నవి. చిలుకలు, గోరువంకలు, పావురములు - మున్నగు పత్రిసంతానములు ఆనందాతిరేకమున వివశము లగుచున్నవి. ఇక మనుజులమాట చెప్ప నేల ? తుంగభద్రానదీతోయముల జలక్రీడల దేలి తత్తీరములందును విద్యానగరపరిసర వికసితోపవనవాటికలందును కామినీకాముకగణము ప్రణయయాత్రలు సలుపుచున్నారు. మధుమాసవాసరములు భాసురము లగుటకు విలాసిజనము మన్మథపూజలు కామోత్సవములు జరుపుకొనుచున్నది.

విద్యానగరమున చైత్రశుక్లప్రతిపత్తు మొదలుకొని తొమ్మిది రోజులు వసంత నవరాత్రమహోత్సవము లేర్పాటు చేయబడినవి. దేవాలయములయందు దైవపూజాపురస్కారములతోబాటు కళాప్రదర్శనాదులును సాగుచున్నవి. కవిత్వము, సాహిత్యము, సంగీతము, నాట్యము మున్నగు కళలలో కృతహస్తులైనవారు ప్రదర్శనలలో పాల్గొని ప్రజలమన్నన లందుకొనుచున్నారు. సప్తమినాడు పద్మినీదేవి నాట్యసభ.

రాయల యుగమున వికసించి వెలుగొందని కళ లేదు. అష్టదిగ్గజములవలన కవితాకళ మిన్ను ముట్టినది. మహాశిల్పాచార్యులవలన శిల్పకళాలక్ష్మి మధురలాస్య మొనర్చినది.

సంగీతము వి_స్తరించినది. చిత్రకళ కళకళలాడినది. ఇన్ని కళలు వన్నెచిన్నెలతో అలరారినప్పుడు నాట్యకళ యేల వికసింప కుండును ? ఎడతెగని దండయాత్రలతో సామ్రాజ్యవి_స్తరణకు దీక్ష పూనియున్న రాయలు ఇన్ని కళల నెట్లు పోషించి వికసింపజేసినాడో వింతగా నుండును. ఈ కళాపోషణముతో బాటు ఆమహాసేయుడు స్వయముగా సంస్కృతాంధ్రములలో కావ్యరచన మొనర్చినా డన్న ఆకళారాధకుని సాహిత్య తపస్సు ఎట్టిదో యూహింపజాలము.

రాయలవారికి నాట్యమన్నను, నాట్యశాస్త్రమన్నను అభిమానము మెండు. ఎంద ఱెందఱో నట్టువరాండ్రకు జీవనో పాధి కల్పించి ఆయన నాట్యకళ నుద్ధరించినాడు. ఆనాడు దేవదాసీలు యథార్థ దేవదాసీలై సమాజమున మన్నన లందు కొనువారు. వారికి సంగీత సాహిత్య నాట్య విద్యలు కరతలా మలకములై యుండెడివి. ఈ మూడింటిలో ఏది కొఱవడినను నాట్యము రాణింపజాలదు. నాడు కృష్ణరాయల మహా స్థానములో రాజన_ర్తకిగా గౌరవము నందిన వ్య_క్తి రంజకం శ్రీరంగరాజుకూతురు కుప్పాయమ్మ. ఈమెను ముద్దుకుప్పాయి అనియు ననెడివారు. ఈమె ఒక్క నాట్యముననే గాక, సంగీత సాహిత్యములందును పేరుమోసిన యువతి. నాడీమె దక్షిణా పథమున కంతటికి ఏకైక నాట్య సుందరిగా కీ_ర్తి గన్నది. రాయలవారీమెను తన సామ్రాజ్యముతో సమానముగా సత్కరించుచుండు వారు.

ఎన్నెన్నో కళలు చేయలేనిపనిని ఒక్క నాట్యము చేయ జాలును. అందుకే కాళిదాసు "నాట్యం భిన్నరుచే ర్జనస్య

బహుధా ప్యేకం సమారాధనం" అన్నారు. నట్టువరాలికి చక్కని శరీరసౌష్ఠవ మావశ్యకము. అందచందములు లేని వారు నాట్యమున కనర్హులు. వారిశరీరములు వ్యాయామము చేత లఘువులై అవయవాదులేమి, నేత్రాదులేమి చెప్పినట్లు చేయవలసియుండును. దానికితోడు కంఠస్వర మాధుర్యము, సంగీతసాహిత్య పరిజ్ఞానము అవసరము. ఇన్ని యున్నగాని నాట్యసుందరి తన విద్యను ప్రదర్శించి సభ్యులను మెప్పింపలేదు. ఇన్ని యోగ్యతలు ఒక్కస్త్రీవ్యక్తిలో నుండవలె నన్న సామాన్యవిషయము కాదుగదా. అట్టిస్త్రీ భగవదిచ్ఛగా సృష్టి కావలయును. వేలు లక్షల సంఖ్యలో ఒకానొకతె మాత్రమే "నాట్యకర్త్రి కాగలదు. కిగాని, గాయకునికి గాని, శిల్పికిగాని, చిత్రలేఖకునికిగాని శరీరసౌష్ఠవము అంద చందములు లేకున్నను లోటులేదు. ఆంగిక వాచిక సాత్త్వికాద్యభినయములను ప్రదర్శింపవలసిన నటుల విషయ మట్టిది కాదు. ఈ సర్వరహస్యముల నెఱింగినవాడు కావుననే రాయలు రాజన ర్తకియెడ నంత గౌరవముంచెడివాడు.

రాయలవారు నాట్య విద్య నేర్పుటకు నర్తనాభ్యసన శాలను కట్టించినాడు. ఆ శాలలో నూటయెనిమిది కరణములు, ముప్పది రెండు అంగహారములు, రేచకాదులు - నాట్య శాస్త్రానుసారముగ శిల్పించిన శిలా ప్రతిమలు, చిత్తరువులు తీర్పబడియున్నవి. శరీరావయవముల విలాసవిక్షేపము కరణము. కొన్ని కరణముల సమష్టి ప్రదర్శనము అంగహారము. భరతుడు మున్నగు నాట్యశాస్త్రాచార్యుల శాస్త్రభాగములు నట్టువ రాండ్రకు బోధింతురు; అభినయింప జేయుదురు. గురువులు

చెంగట లేనప్పుడు గూడ నృత్యకళ నభ్యసింపవలె నన్నవో నర్తనశాలలోని శిల్పములు చిత్తరువులు ఉపయోగించెడివి. నానావిధ నాట్యభంగిమలు, లాస్యతాండవాది నృత్యభేదములు ప్రదర్శింపబడుటకు శ్లోకములకన్నను పద్యములకన్నను ఈ శిల్పములే ఎక్కువగా నుపయోగించెడివి. ఒకగురువు ఒకశిష్యురాలిని తీర్చుటకు ఒక్కొక నాట్యభంగిమను ఎన్నోసారులు ప్రదర్శింపవలయును గదా. శిల్ప చిత్రములవలన గురువుల శ్రమ తగ్గుచుండెడిది. ఈ నాట్య శిల్పములను మలచు శిల్పులు వ్రాయుచిత్రకారులుగూడ నాట్యశాస్త్ర నిష్ణాతులై యుండవలయు నని వేఱ చెప్పనక్కఱ లేదు. ఈ మార్గ నృత్యములే గాక, నానావిధ దేశినృత్యములు - ప్రేంఖణము, చర్చరి, రాసకము, దండరాసకము, ( కోలాటము ) నాట్యరాసకము, శివప్రియము, చిందు, భ్రమరి, కందుకము, భాండికము, ఘంటసరి, చరణము, బహురూపము, పేరణి, గొండ్లి, కథకళి, మున్నగునవియు రాయలకాలమున ఆదరింపబడుచుండెడివి. ప్రౌఢ దేవరాయలనాటి నుండియు విజయనగర సామ్రాజ్యము నాట్యకళాపోషణమునకు పేరు చెందినట్టిదే. తమిళదేశమునకు చెందిన మడమనుపేరి యూరిలోని అగ్నీశ్వరాలయ దేవదాసి అరంవళర్త్తనాచ్చియార్ నాట్యవిద్యచేత రెండవ దేవరాయలవారిని మెప్పించి ఒక దేవాలయతనమునకు మడిమాన్యములు సంపాదించుకొన్నది.

కుప్పాయమ్మ తనలోని విద్య నశింపకుండుటకును, తన శిష్యురాలికే విజయనగర రాజనర్తకీపదము సంక్రమించుటకును పద్మినికా విద్యలను నేర్పి కళాకుశలురాలి నొనర్చినది. పద్మిని

అందాల రాశి. మేల్మిని తెగడు శరీరకాంతి యామెది. సర్వావయవ సౌందర్యమున ఆమె అచ్చరలేమల మెచ్చదన్న నింత కాదు. హజారరామాలయ మండప భాగమున నాడామె నాట్యమేర్పాటు చేయబడినది. జనము ఇసుక చల్లినను రాలక క్రిక్కిఱిసి యున్నారు. ఒక ప్రధానసింహాసనమును అచ్యుతదేవరాయలవా రధివసించిరి. మంత్రి సామంత దండనాథాదులును, నట గాయక మార్దంగికాదులును ఆయనను పరివేష్టించియుండిరి. వారి కించుక దూరముననే టెంకణ శిల్పియు విరుపణ్ణయు వీరభద్రప్పయు సముచితాసనముల నలంకరించి యుండిరి. అంతఃపురాంగనలకు తెరలోపలనుండి చూచునేర్పాట్లు చేయబడినవి.

ముందు ప్రారంభసూచకముగా సభ్యులను హెచ్చరించుచు శంఖ మొకటి పూరింపబడినది. సభ్యులు నీరవులు నిశ్చలులు నైరి. తరువాత వేణుగానము కొంతసేపు జరిగినది. ఆ గానముననే సభ్యులు తన్మయులైనారు. పిమ్మట నాట్యరంగస్థలమున ఊదారంగు తెర యొకటి తనంతట నదియే పైకి లేచినది. నట్టువరాండ్రు ఇరువదివత్సరముల లోపు వయస్సుగల లేబ్రాయపు కన్నెలు. వారందఱు అందాల రాసులే. ఒయ్యారాల కుప్పలే. లోపల చల్లడములను దాల్చి వానిపై సన్నని జిలుగుదువ్వలువలను గట్టుకొని యున్నారు. తెర లేవగానే వారును లేచి నాట్యమున కారంభించిరి. ఆ నట్టువరాండ్రమధ్య పద్మినీదేవి విచ్చీవిచ్చని పరువముతో అనాఘ్రాతకుసుమమువలె నిలిచినది. వారు నానావిధ నృత్యములు ప్రదర్శించిరి. అందు కొన్ని మార్గనృత్యములు; మఱి

కొన్ని దేశిభేదములు, కరణములు అంగహారములు ప్రదర్శించిరి. కడకు శివతాండవ నృత్యమును పరమాద్భుతముగా పద్మినీదేవి ప్రదర్శించినది. మర్దళాదులగు ప్రక్క వాద్యములు మ్రోయు చుండ ఆమెచేసిన నానావిధ నృత్యములు చూపరు నానంద సాగరములో ముంచివేసినవి.

ఇంతవఱకును విజయనగరమున ఆయా దేవాలయము లందు శిల్పింపబడిన నిశ్చలనాట్యభంగిమలను చిత్తరువులను ప్రేక్షకు లానాడు సజీవముగా దర్శింపజాలిరి. ఈ నాట్యా భ్యాసములు కళాగురుడగు వెంకణను, కళాదయితుడగు విరుపణ్ణను ఎంతగానో అలరించినవి. నాట్యము జరిగినంత సేపును వీరభద్రప్ప చూపు పద్మినీదేవిమీదనే నిలిచి యున్నది. అత డామె చక్కదనమునకును నాట్యవిద్యాకౌశలమునకును విస్తు పోయినాడు. ఇక అచ్యుతదేవరాయల ఆనందమునకు మేరయే లేదు. సభ్యుల కరతాళధ్వనులమధ్య అచ్యుతదేవరాయలవారు లేచి యిట్లన్నారు: "శ్రీమతి రంజకం కుప్పాయమ్మగారి తర్వాత అంతటిరాజనర్తకి విజయనగరసామ్రాజ్యమునకు సంప్రాప్తించి నందుకు మేమెంతో ఆనందపడుచున్నాము. అన్నగారి హయా ములో కళాదేవత నర్తించినట్లే యిప్పుడుకూడ నర్తించు చున్నందుకు సంతృప్తిగా నున్నది. ఈపద్మినీదేవికి కనకాభి షేకము చేయింపవలెనని మాకు సంకల్పముకలిగినది. మంత్రులు తగునేర్పాట్లు చేయుదు రనుకొందుము." సభ్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టగా నాటి నాట్యసభ రక్తికట్టినది. వసంతనవరాత్ర మహోత్సవములు వైభవముగా ముగిసినవి. ఒకనాడు పద్మినీదేవికి కనకాభిషేకమహోత్సవముగూడ జరుప

బడినది. ఉత్సవాగతులగు ప్రజ లెల్లరును నిజనివాసములకు పయనమగుచుండిరి.

విరుపణ్ణ ప్రభుత్వాస్థాన శిల్పాచార్యుడును, శిల్పవిద్యా గురుకుల కులపతియునగు బెంకణునితో తన యభిప్రాయము నెఱింగించినాడు. అందుకా శిల్పాచార్యుడు ఎంతగానో సంతసించినాడు. దేశము నలుమూలల శిల్పకళా తోరణములు అవ్యారిగా వ్రేలగట్టవలయునని ఆ శిల్పాచార్యుని సంకల్పము. ఆయనకాలమున కంచి, కాళహస్తి, తిరుపతి, సింహాచలము, తిరుమల, చిదంబరము, రాయవేలూరు, రామేశ్వరము, తాడిపత్రి, పెనుగొండ, అహోబిలము మున్నగుతావుల అజరామరమగు శిల్పకళను నెలకొల్పుట యైనది. నానావిధ మండప, ప్రాకార, గోపురాదులు, దేవాలయములు చిత్రవిచిత్ర రీతుల వెలయించుట యైనది. కృష్ణరాయలకు పిమ్మట అచ్యుతదేవరాయలుకూడ బెంకణను గౌరవించుచు ఆయన ప్రధానాచార్యత్వముమీదనే తాను శిల్పదేవి నారాధించుచున్నాడు. ఇట్టి స్థపతివర్యుడు విరుపణ్ణ సంకల్పమును బలపఱచుటలో వింత యేమున్నది! ఆయన లేపాక్షిలో జరుగవలసిన విష్ణు వీరభద్ర ప్రతిష్ఠల ప్రాముఖ్యమును తద్విధానములను కొంతవఱకు వివరించి దేశభేదమును పాటింపక ఎల్ల శిల్పులకు అం దవకాశము కల్పించి వారివారిలో నున్న హస్త కౌశలము నుపయోగించుకొని లేపాక్షి నొక మనోహర శిల్ప కళానిధానముగా నొనర్పుమని చెప్పినాడు.

విరుపణ్ణ బెంకణను లేపాక్షి శిల్పయజ్ఞ నిర్వహణములో ప్రధానాచార్యస్థానము నలంకరింపవలయునని ప్రార్థించెను.

అందుకుమాత్రము జెంకణాచార్యుఁడామోదము నీయజాలక పోయెను. జెంకణవయస్సు నాటికి దాదా పెనుబదియేండ్లుండును. జీవితకాలమంతయు శిల్పతపస్సులోనే గడచిపోయినది. ఆయన విశ్రాంతి తీసికొనవలయునని కృష్ణరాయలు పరమపదించినప్పటినుండియు కోరుచునే యున్నాఁడు. గాని రాజ్యములోని స్థితిగతులుగాని, రాజకుటుంబ వ్యవహారములు గాని దానిని పడనిచ్చుటలేదు. అచ్యుతదేవరాయలు ప్రభువైనప్పటినుండియు జెంకణ అనేకాంశములలో రాజుగారి కాంతరంగికుడుగాగూడ మెలగవలసివచ్చినది. అచ్యుతదేవరాయలు విశ్రాంతి తీసికొన్నట్లుగనే భావించి తమ కాయా సలహాల నిచ్చుచుండవలయు ననియు శిల్పగురుకులమును నడపుచుండవలయు ననియు కోరుటచేత ఆస్థపతికి ప్రభునాజ్ఞ జవదాటరానిదైనది. అంతేకాక తన ఆస్థానశిల్పాచార్యాది కార్యకలాపములవల్ల దేశములో శిల్పకళావిస్తరణము జరుగుటకును వీలున్నది కదా. అందు కాయన యిష్టము లేకున్నను ఆయా బాధ్యతలను నిర్వహించుచుండెను. ఇట్టిస్థితిలో లేపాక్షి శిల్పకార్యములకు ఆచార్యత్వము వహించుట కాయన యిష్టపడలేదు. శిల్పవిద్యాగురుకులమున రెండవ ఆచార్యుఁడుగ నున్న పురుషోత్తమస్థపతిని తీసికొని పొమ్మని విరుపణ్ణకు చెప్పెను. విరుపణ్ణకు ప్రభువునొద్దను చనవు లేకపోలేదు. ఆయన తలంచినచో ప్రభువులకు నచ్చజెప్పి జెంకణను ప్రధానస్థపతిగా తీసికొని వెళ్ళగలఁడు. కాని జెంకణాచార్యున కిష్టముగానిపనిని తాను చేసి ఆశిల్పాచార్యుని నొప్పించుట పాడిగాదని యోచించి అవసరమైన వాక్సాహాయ్యమును మాత్రమందింపవలయునని జెంకణను ప్రార్థించెను. నాటి విద్యానగర

రాజకీయపరిస్థితుల నుద్దేశించి మాటాడుటకు విరుపణ్ణ అచ్యుత దేవరాయలవారిని దర్శింపవలసి వచ్చినది. ప్రభువులును రెండు మూడు దినములు విరుపణ్ణను రాజధానిలో నుంచుకొని అనే కాంశములనుగూర్చి చర్చించిరి. ఆయంశములు బయటపెట్ట రానివి.

విరుపణ్ణ కోశాధిపతిమాత్రుడే కాడు. ఆయన ఒక భద్రమానవుడు (పెద్దమనిషి). దైవభక్తి మానవోద్ధరణము ధ్యేయములుగా గలవాడు. రాజకీయములయందుగూడ ఆయన ఋజుమార్గములనే అవలంబించును. కనుక ప్రభువులకును విరుపణ్ణ కును మధ్యనే యీచర్చలు ఏకాంతముగా కొనసాగినవి. మాటలమధ్యమున విరుపణ్ణ తన కుమారుని మూకత్వము లేపాక్షిలోని పాపనాశేశ్వరునారాధించుటచేత వీరభద్రకరుణా కటాక్షమున పోయినదనియు, తాను లేపాక్షిలో విష్ణు వీరభద్ర మూర్తులను ప్రతిష్ఠించి యచ్చటి సర్వదేవతలకును నూతన దేవాలయాదుల నిర్మింప దలంచితిననియు, అందుకు వెంకణా చార్యుడు పురుషోత్తమస్థపతి నంపుచున్నాడనియు నివేదించెను. అందులకు ప్రభు వానందించి తనసమ్మోదమునుగూడ ప్రక టించెను. తుదకు ప్రభువుల యాజ్ఞ గైకొని పురుషోత్తముని తోను శిల్పపరివారముతోను విరుపణ్ణ లేపాక్షికి ఆయన మాయెను.

## 6

పురుషోత్తమస్థపతి మున్మనాచార్యవంశమునకు జెందిన వాడు. మున్మన అహాభూనఋషి గోత్రమువాడు. ఆ ఋషి

భువనశిల్పియగు విశ్వకర్మ (విశ్వబ్రహ్మ) పంచవదనములనుండి ప్రభవించిన సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణ లనెడి పంచర్షి మండలములో మూడవవాడు. ఈ పంచర్షులు యజుర్వేదములోని ప్రాచీదిశాదిమంత్రములలో పేర్కొన బడినారు. ఋగ్వేద ప్రథమమండలములోని అగ్నిసూక్తము మహర్షులను పూర్వులనియు, నూతనులనియు రెండు తెఱంగుల విభజించినది. వారిలో పూర్వులీ సానగాదులే. వీరు శిల్పిబ్రాహ్మణ గోత్రకర్తలై మను, మయ, త్వష్ట్ర, దైవజ్ఞ, విశ్వజ్ఞులనెడి పంచబ్రహ్మలుగా రూపొంది, లోకమున అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయములైన పంచశిల్పములకు ప్రవర్తకు లైనట్లు స్కాంద బ్రహ్మాండాది పురాణములు వాకొనుచున్నవి. ఈపంచర్షుల వంశమున బుట్టిన శిల్పులే పంచార్షేయులు.

శిల్పాగమాదులు ఆదర్శ శిల్పాచార్యుల లక్షణములను బహుధా వక్కాణించినవి. అట్టి మహత్తరలక్షణములకు ముమ్మనాచార్యవంశము ప్రసిద్ధి గన్నది. ముమ్మనాచార్యునకు పూర్వము నాలుగవ తరమువాడైన నాగన విద్యారణ్యులతో సహకరించి విద్యానగరనిర్మాణము నొనర్చి ప్రకాశించినాడు. నాగనకు గంగన, గంగనకు కసవన, కసవనకు ముమ్మన, ముమ్మనకు అంబన, అంబనకు కొండన, కొండనకు పురుషోత్తముడును బుట్టిరి. వీరి వంశక్రమ మిది. ఈ వంశమువారు తరతరములనుండియు గాయత్రపీఠానిరతులై బ్రాహ్మ్యమును సంరక్షించుచున్నారు.

ముమ్మనాచార్యుడు ప్రౌఢదేవరాయల యాస్థానములో విద్యాధికారిగను ధర్మాధికారిగను నుండి చేసిన ప్రజాహిత

కార్యములు వేనకువేలున్నవి. ఇతడు శిల్ప వాస్తువిద్యలలో దశక్రియాపరిజ్ఞాతగా పేరందినవాడు. ప్రౌఢదేవరాయల కొలువులో ముమ్మనతోబాటు అరుణగిరినాథుడు (డిండిమభట్టు) మున్నగు విద్వాంసులు కవులు నుండెడివారు. కవిసార్వభౌముడగు శ్రీనాథుడు డిండిమభట్టు నోడింప నేగినప్పుడు ముమ్మనాచార్యుని సాయముచేతనే రాయలయాస్థానములో ప్రవేశింపగలిగెను.

సీ॥ పంపావిరూపాక్ష బహుజటాజూటికా
 రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
 గంభీర ఘుమఘుమారంభములకు
కర్ణాటకామినీ కర్ణహాటకరత్న
 తాటంకయుగ ధాళధళ్యములకు
కళసాపురప్రాంత కదళీవనాంతర
 ద్రాక్షాలతాఫల స్తబకములకు
నిర్నిబంధ నిబంధమై నెనయుకవిత
తెలుగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢదేవేంద్రరాయభూపాలనరుని
సమ్ముఖంబున దయజూడు ముమ్మసుకవి!

ఇట్లు శ్రీనాథుడు ముమ్మనను దయచూడుమని కోరినాడనగా ఆమహారాజు నాస్థానమున ముమ్మకవిస్థాన మెట్టిదో తెలియగలదు. ఆసందర్భముననే ముమ్మన శ్రీనాథులకు గాఢమైత్రి కలిగినది. ముమ్మనకోరికమీద శ్రీనాథుడు విశ్వకర్మపురాణమునుగూడ వ్రాసినా డందురు. ఈముమ్మనాచార్యునికి

పురుషోత్తమస్థపతి నాలుగవతరమువాడు - మునిమనుమడు. తాతగారిలోని మహాశిల్పాచార్యలక్షణము లన్నియు పురుషోత్తమునిలో గలవు. గ్రామ, నగర, దేవాలయ, దేవతాదులను ప్రతిష్ఠింప నర్హతగల వేదశాస్త్రవేత్తను స్థపతియందురు. అట్టి స్థపతిశబ్దమునకు సర్వవిధముల నర్హుడు పురుషోత్తముడు. ఆతడు శిల్ప వాస్తు మంత్రశాస్త్రసాగరముల నాపోశనపట్టిన అగస్త్యుడు. సదాచార పరిపూతుడు. విశేషించి తపోనిష్ఠాగరిష్ఠుడు. వెంకణాచార్యునికి పిమ్మట విద్యానగరశిల్పవిద్యా గురుకులాధిపత్యమునకు సర్వవిధముల అర్హుడైనవాడు.

పురుషోత్తముడు లేపాక్షికి శిల్పిగణముతోగూడ విచ్చేసిన యనంతర మీ ప్రధానాచార్యునకు కూర్మాద్రిమీద నే పాపనాశేశ్వరుని కనతిదూరమున చిన్న నివాసభవన మొకటి అన్ని సౌకర్యములతో నిర్మింపబడినది. అందు పురుషోత్తమశిల్పి దంపతులు, ఆయనతల్లి, పదిరెండేడుల యేకైకపుత్రిక, స్థపతి మేనల్లుడు మాచమూర్తి నివసించుచుందురు. తక్కినశిల్పులకు లేపాక్షిలోనే తగిన వసతిగృహములు చూపబడినవి. మాచమూర్తి పాటూరును పాలించుచున్న పంచారేయ ప్రభువుల బంధుకోటిలోనివాడు. ఈ పాటూరిప్రభువులగు బసవాపాత్రుడు, రామవిభుడు, బోడన, పాపాపాత్రుడు, ఎల్లన చిన్నమాచు మొదలగువారితో ముమ్మనవంశమువారి గాఢ బాంధవ్యము లున్నవి. పాటూరిప్రభువులుగూడ అహోభూన గోత్రజులే. మాచమూర్తి ఇట్టి రాజకుటుంబములోనివాడు. తల్లిలేని మాచమూర్తిని మేనమామ పురుషోత్తముడు దగ్గఱకు దీసి విద్యాకుశలుని జేయుచున్నాడు. లక్ష్మి అతనికీడైన పిల్ల.

ప్రధానశిల్పాచార్యుడు మున్ముందు ప్రధానములైన మూలవిరాణ్మూర్తులను మలచి వానికి గర్భాలయములు కట్టి అందు వానిని ప్రతిష్ఠింపనలయుననియు, తరువాతనే తక్కిన శిల్పకృతులకు పూనుకొనవలయుననియు సంకల్పించుకొన్నాడు. ఆయభిప్రాయము విరుపణ్ణకును నచ్చినది. విష్ణుప్రతిమ యెట్టిదై యుండవలయు నను ప్రశ్న బయలు దేరినది.

విష్ణు విగ్రహములను దశావతారములలో మలచ వచ్చును. కేశవుడు, నారాయణుడు మొదలగు ఇరువది నాలుగు కేశవ నామములనుబట్టియు ఒక్కొక్క మూర్తిని మలచ వచ్చును. ఈ మూర్తులకు హస్తములయం దుంచెడి శంఖచక్ర గదాద్యాయుధములను ఆయాచేతులలోనికి మార్చుటవలనను మఱికొన్ని విశేషలక్షణముల చేతనుపరస్పర భేదముసిద్ధింపగలదు. ఒక్కొక్కమూర్తి ప్రత్యేకప్రత్యేక ఫలముల నొసంగజాలును. దైవమూర్తులలో ప్రసన్న, వీర, భోగమూర్తులనియు భేదము లున్నవి. ఇంకను ఆసన, శయాన, స్థానకాది మూర్తిభేదము లుండును. ఈశతాధిక భేదములలో ఏరూపముగా నారాయణుని తీర్చి ప్రతిష్ఠించుట అనున దొక ప్రశ్నమైనది. విరుపణ్ణ ఆయంశముల నన్నింటిని సర్వజ్ఞుడైన పురుషోత్తమస్థపతికే వదలి వైచినాడు. ఏమూర్తి ప్రజాసౌభాగ్యమునకును దేశక్షేమము నకును తగినదైయుండునో అట్టి మూర్తినే నిర్మించి ప్రతిష్ఠింప జేయ వలసినదనివీరణ్ణయు సూచించెను. పురుషోత్తమస్థపతి కిప్పుడిదొక సమస్యయైనది. ఆతడు భాగినేయునితోను మాతృదేవితోను ఈసంగతి చర్చించెను. వారంతటి మహాశిల్పికేమి సలహాల నీయగలరు? ఆలోచించి యాలోచించి రఘునాథమూర్తి

మైన బాగుండునేమో యోచింపుమా యని ఆతఁడి కుమారునికి సూచించినది. పురుషోత్తమస్థపతి కది యుక్తముగానే తోఁచినది.

కేశవాదిమూర్తులన్నియు దైవశక్తి విశిష్టములు. రఘురాముడు సూర్యవంశమున బుట్టిన ఉత్తమక్షత్రియుడు. విశేషించి మానవుడు. ఉత్తమమైన మానవాదర్శముల నాతడు నిలబెట్టినాడు. ఆదర్శమగు కుటుంబజీవనమును నడపినాడు. ఆతని పితృవాక్య పరిపాలనము, ఏకపత్నీ వ్రతము, శిష్టజనపాలనము మున్నగు గుణములు సర్వమానవకోటియు అనుసరింపదగినవి. ఇట్టి మానవత్వమునకు కాణాచియైనను దైవశక్తులనుగూడ ఆతడు ప్రకటింపకపోలేదు. ఆ శ్రీరామచంద్రునిమూర్తి ధనుర్బాణోపేతమై యున్నచో తదుపాసకుల కింకను మేళ్ళు చేకూరగలవు. కనుక శ్రీ కోదండరామ విగ్రహమును ప్రతిష్ఠించుటకు ఆస్థపతి వర్యుడు నిశ్చయించుకొనెను.

శిల్పములో శిలానిర్ణయము మిక్కిలి కష్టమైనపని. మూలబేరమునకు – అది పురుషమూర్తియైనచో దానికి పుంశిలను వాడుట యావశ్యకము. విష్ణు సంబంధమూర్తులను సాత్త్వికశిలలతోనైతము తీర్పవలసియున్నది. అట్టి సర్వలక్షణ సంపన్నములగు శిలలు ఆకొండమీద నెన్నియో కలవు. ఇంకను పాదపీఠాదుల కుపయోగింపదగిన స్త్రీ నపుంసక శిలలకును ఆ కొండమీద కొఱత లేదు. ఇంత యేల, ఒకనాడు ఎందఱో మహాశిల్పులు తన ఱాలతో దివ్యశిల్పములను చెక్కగలరని తలంచి ఆగట్టు అర్హములైన నానావిధ పాషాణములను తనపై నుంచుకొన్నదా యనునట్లు అందు సలక్షణ శిలాసమృద్ధి

యున్నది. ఇందుకు పురుషోత్తమస్థపతి అచ్చెరువందినాడు. విరుపణ్ణ సంకల్పము అనాయాస సాధ్యమగుటకు ఆమహాభక్తుని ప్రగాఢ శివభక్తియే కతమని ఆత డెంచినాడు.

మూలమూర్తులకు శిలలను సంపాదించి శిలా పరీక్ష యొనర్చి చెక్కబోవునప్పటికా స్థపతివర్యున కింకొక యభిప్రాయము తట్టినది. ఈరఘునాథమూర్తిని చతుర్బాహువులతో చెక్కినచో మంచిది కదా. రాముడు రెండుచేతులవాడే యైనను శిల్ప శాస్త్రములో బహుబాహువులను చెక్కు సంప్రదాయ మున్నది. దైవమూర్తి అధికశక్తిసంపన్నము కావలయునన్న దానికి అనేకశిరస్సులు అనేకబాహువులు చెక్కవచ్చును. అట్టి మూర్తులు ద్విబాహుమూర్తులకన్న సత్ఫలితముల నెక్కువగా నీయగలవు. కనుక ఈకోదండరాముని చతుర్బాహువుగా చెక్కినచో ఆఖండదైవశక్తియు అందు సన్నివిష్టము కాగలదు. ఈయభిప్రాయము కలుగగానే ఆయన యెంతగానో యుప్పొంగిపోయినాడు. చతుర్బాహుకోదండ రామమూర్తులు అరుదుగా నుండును. ఒక్కభద్రాచలములో మాత్రమే పూర్వ మిట్టిమూర్తి ప్రతిష్ఠిత మైనది. కొన్ని నెలలు ఏకభుక్తము, భూశయనము చేసి తపోనిష్ఠా గరిష్ఠుడై ఆ యా మంత్రముల నుపాసించుచు పురుషోత్తమస్థపతి సీతారామలక్ష్మణ మూర్తులను వీరభద్ర భద్రకాళీమూర్తులను జగన్మోహనముగా తీర్చినాడు. ఆయన రఘునాథమూర్తిని రూపొందించుటకు చేసినంత తపమును వీరభద్రమూర్తిసృష్టికి చేయవలసిరాలేదు. కారణము వీరభద్రమూర్తి తుణ్ణమైన సంప్రదాయములో తీర్పబడినది. రఘునాథమూర్తి యట్లు కాదాయెను. విశిష్ట

భావముల నందు కేంద్రీకరింపవలసివచ్చి నందున అది కష్టసాధ్యమైనది. ఈ విధముగా అయోధ్యాధీశుడగు శ్రీరామచంద్రుని ఆమహాతపస్వి తీర్చి ప్రతిష్ఠకు సిద్ధమొనర్చినాడన్న సంగతి విని శిల్పిలోక మాశ్చర్యములో మునిగినది.

ఒక నాటి శుభముహూర్తమున ఈదేవతామూర్తులకు ప్రతిష్ఠాతంత్రము నిర్వహింప నిశ్చితమైనది. పురుషోత్తమ స్థపతియే ప్రధానాచార్యత్వము వహించినాడు. రఘునాథమూర్తి ప్రతిష్ఠా కార్యమునకు విరుపణ్ణదంపతులును, వీరభద్రమూర్తిప్రతిష్ఠకు వీరణ్ణదంపతులును పీటలపై గూర్చుండుటకు నిర్ణయమైనది. ఈప్రతిష్ఠాకార్యములందు ఆచార్లేయులగు శిల్పిబ్రాహ్మణులును, సప్తర్షేయులగు వైదికబ్రాహ్మణులును గార్గేయాగమోక్తప్రకారముగా వైదికతంత్రము నిర్వహించినారు. విరుపణ్ణబంధువులు పెక్కురు వేదాధ్యయనము చేసినట్టివారు. వారు క్షుణ్ణముగా ఉదాత్తానుదాత్త స్వరిత దీర్ఘస్వరితములు పొల్లుపోకుండ స్వస్తి చెప్పగలరు. అట్టివారు శ్రీసూక్త పురుషసూక్త భూసూక్తాదులను, నమక, చమక, శతరుద్రీయ మహాన్యాసములను, పంచోపనిషత్తులను స్వస్తి చెప్ప నియుక్తులైరి. ప్రతిష్ఠాకార్యము పంచాహ్నికముగా నిర్వహింపబడినది. మాచమూర్తి ఆ యా దేవతలక్రింద నుంచవలసిన బీజాక్షర సహితములగు యంత్రములను తామ్రఫలకములపై చెక్కినాడు. యంత్ర దేవతాప్రతిష్ఠలు తగినలగ్నమున నెఱవేఱినవి.

కోదండరామమూర్తిని పానవట్టముమీద ప్రతిష్ఠించినారు. ఇది సంప్రదాయమునకు భిన్నము. అయినను ఈప్రతిష్ఠ శివకేశవాభేద ప్రతిపాదకముగానున్నట్లు విశిష్టమార్గ మవలంబింప

బడినది. ఇది పురుషోత్తమోపజ్ఞమైన నూతనకల్పన. పాపనాశేశునికి ధర్మపత్నిగా గౌరీమహాదేవిని, వీరభద్రుని సహధర్మచారిణి భద్రకాళీదేవినిగూడ ప్రత్యేకాలయములలో ప్రతిష్ఠించినారు. రఘునాథమూర్తితోబాటు సీతా లక్ష్మణ మూర్తులను గూడ నెలకొల్పినారు. ఈ కార్యములు ముగిసీ ముగియకముందే విజయనగరమునుండి యశ్వారూఢుడైన యొకభటుడేతెంచి విరుపణ్ణకొక పత్రమును సమర్పించినాడు. అందిట్లున్నది:

శ్రీవిరూపాక్ష శ్రేష్ఠిగారికి,

"మీరు నేటినుండియు విజయనగర కోశాధిపతి పదవితోబాటు పెనుగొండ మండలాధిపత్యమును గూడ చేపట్టి ఆ ప్రాంతపు ప్రజల యోగక్షేమములలో పాల్గొనవలసినదిగా కోరబడుచున్నారు. వెంటనే పెనుగొండ కేగి అభిషేక కార్యమును నిర్వహించుకొందురుగాక. మీ సత్పరిపాలనములో ప్రజలు దైవభక్తిపరాయణులై మానవ ధర్మములను తు. చ. తప్పక నిర్వర్తింతురని మా విశ్వాసము."

ఇట్లు

అచ్యుతదేవరాయలు.

ఈ ఆజ్ఞాపత్రమును గాంచిన సర్వులును ఆనందవివశులైపోయిరి. విరుపణ్ణ పరమేశ్వర భక్తుడు. ఆ పరమేశ్వరానుగ్రహమువల్లనే కుమారునికి మాటలాడుశక్తి కలిగినది. దానిచేతనే ఈమండలేశ పదమును చేకూరినది. ఆయన ప్రభుత్వములో

ప్రజలు సుఖపడగలరు. దేశము అభ్యుదయము నందగలదు. అని పలువిధముల తలపోయనాగిరి. కామాక్షీ వీరణ్ణ వీరభద్రుల యానందమునకు మేరయే లేదు. కాని విరుపణ్ణ మాత్ర మిందు కంతగా సంతసించుటలేదు. భగవదారాధనతో కాలక్షేపము చేయదలచిన తనకీ రాజకీయబాధ్యత లేల యని ఆతని తలంపు. ప్రజాపరిపాలనము పువ్వుపాన్పు గాదు. అది యనేక కష్టనిష్ఠురతలతో గూడినట్టిది. ఏపాటిగా కాలు జారినను పాలకుడు పాతాళమున కేగిగాని యాగడు. అందుకే శాస్త్రము "రాజ్యాంతే నరకం ధ్రువమ్" అన్నది. అయినను తప్పెడి దేమి? ఇది రాజాజ్ఞ. అందును తన మనోభావములను, సంస్కారములను ఎఱింగిన అచ్యుతదేవరాయల యానతి. ఆయన ఏ సంకల్పముతో ఈభారమును తనపై మోపినాడో! దానిని శిరసావహించి నిర్వహింపక తప్పదు. ఇది రాజాజ్ఞ యనియే కాక, పరమేశ్వరాజ్ఞయనియు విరుపణ్ణ భావించినాడు.

వెనువెంటనే వీరణ్ణ పెనుగొండకేగి తనపుత్రుడగు చెన్న బసవప్ప- వీరభద్రప్పల తోడ్పాటుతో అభిషేకప్రయత్నములు చేసినాడు. లగ్న దినము రాయల కెఱిగింపబడినది. విజయ నగరమునుండికూడ కవి నట గాయక వైణికాదులు విచ్చేసి నారు. అభిషేక కార్యము వైభవోపేతముగా సాగినది. పురోహితులు,

"యేభి శ్శిల్పైః ప్రప్రథానా మదృంహాత్.
యేభి ర్ద్యా మభ్యపిగ్ంశ త్ప్రజాపతిః.
యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్.
తేనేమ మిహా వర్చసా సమన్థి."

అను మంత్రముచేత విరుపణ్ణను పెనుగొండ మండలేశపదవికి అభిషిక్తు నొనర్చినారు. ఇది తైత్తిరీయబ్రాహ్మణములోని మంత్రము. రాజ్యాభిషేకసమయమున దీనిని పఠింతురు. దీని యర్థము: ప్రజాపతి యేశిల్పములచేత – అనగా కర్మకౌశలముల చేత భూమిని నదీనద పర్వతారణ్యములతో సస్యములతో సుందర మొనర్చినాడో, ఆకాశమును నక్షత్రతారాగ్రహ ములచే మనోహర మొనర్చినాడో, వాక్కును వాచ్య లక్ష్య వ్యంగ్యార్థములచేతను గుణాలంకార రసాదులచేతను రమణీయ మొనర్చినాడో అట్టి కర్మకౌశలములచేత నీరాజును తేజస్వి నొనర్పుమని.

హిందువుల సర్వసంస్కారములు వైదికమంత్రపూత ములు కావలయును. ఒక్కొక్క సంస్కారము, వైదికకర్మము ఆకార్యమునందు కర్తకు శక్తిసామర్థ్యముల నాపాదించునట్టిదిగా నుండును. శిల్పాభిమానియగు విరుపణ్ణకు ఈమంత్రము ఒక విశిష్టార్థమును బోధించినది. తాను ప్రజాపాలనమున సమర్థము లగు సుందరమార్గముల నవలంబింపవలయుననియు, ప్రజాశ్రేయ స్సంపాదకములగు విధుల నే ప్రచార మొనర్పవలయుననియు ఆతని కానాటి యభిషేకమహోత్సవ ముద్బోధించినది.

నాటి సాయంకాలము పద్మినీదేవినాట్య మేర్పాటు చేయబడినది. ఈ వినోదకార్యములమీద విరుపణ్ణకు మక్కువ లేకున్నను అది అచ్యుతదేవరాయల సంకల్పము కావున ఆతడు కాదనలేక పోయినాడు. దానికితోడుగా వీరభద్రప్పకీ నాట్య సభను పెట్టించుకోరిక గాఢముగానున్నందున కొడుకు సంకల్పము నాతడు త్రోసిపుచ్చలేకపోయినాడు. వీరభద్రప్ప

తనకు మాటలు వచ్చినవిమ్మట తలిదండ్రులతో గూడ విజయనగరమున కేగినాడు గదా. ఆతడప్పుడే తొలిసారిగా పద్మినీదేవి నృత్యమును జూచుట తటస్థించినది. ఆమె ప్రదర్శించిన కరణములు, అంగహారములు, ఆ యా దేశ్య మార్గ నృత్యభేదములు ఆతనికి విస్మయము గొలిపినవి. ఆమె నృత్య ప్రదర్శనము లామె ఒక నాట్యసుందరి యనియు— అంతియే కాదు, నాట్యదేవత యనియు ఆతనికి తోచునట్లు చేసినవి. ఆమెలో ఎంత సౌందర్యము కుప్పలు పడినది. భూలోకములో తా నింతవఱ కట్టి యువతి నెచ్చటను చూడలేదు. రంభాదుల సౌందర్యలావణ్యములను సారస్వతమున చదివియున్నాడే కాని కన్నులార చూచియుండలేదు. ఆ అప్సరస్సౌందర్యమున కెంత మాత్రమును తీసిపోనిదే పద్మినీదేవి సౌందర్యము. ఆ రూపమునకు దగినట్లా యా విద్యలు కూడ ఆమెను వరించినవే. ఆమె సాహిత్యములో నిధి యట. పెద్దనాదుల కావ్యరహస్యములను ఆమె చక్కగా వ్యాఖ్యానించు నట. సంగీతములో ఆమెకు తెలియని మర్మములే లేవట. ఆ సంగీతమును సావధానముగా వినునవకాశము తనకు చిక్కలేదు. ఇక నాట్యవిద్యకు ఆమె క్రొత్తమెఱుగులు దిద్దగల దనుటలో సందేహమే లేదు. పద్మినినిగూర్చి ఇన్ని యభిప్రాయములతో నున్న వీరభద్రుడు ఆనాటి నాట్యప్రదర్శన నిర్వహణములో ప్రధానపాత్ర వహించినాడు.

పద్మినీ దేవి ముందు కొన్ని మార్గదేశ్య నృత్యములను ప్రదర్శించినది. పిదప దశావతారనృత్యములను చూపినది. కృష్ణలీలలు నటించినది. నవవిధతాండవములలో తొలుత

సంధ్యాతాండవము చేసినది. ఉమాతాండవము చేయునప్పుడు పద్మిని ఒక నెచ్చెలిని గౌరీదేవిగా ఎడమప్రక్క నుంచుకొన్నది. గౌరీతాండవ మొనర్చునప్పుడు ఎడమప్రక్క పార్వతి యుండుటయేకాక కుడిప్రక్క నందీశ్వరుడుగూడ నిలబడి యుండవలసి యున్నది. ఇంకొక స్త్రీని నందీశ్వరుడుగా కుడిప్రక్క నుండు నట్లేర్పాటు చేసి ఆమె నటించినప్పటి విశేషము లద్భుతములు. అప్పుడామె గౌరిని ప్రణయదృక్కులతోను, నందిని అనుగ్రహ వీక్షణములతోను చూచినరీతి పరమమనోజ్ఞము. కాళికాతాండవములో నటరాజు అష్టబాహువులతో నుండును. ఆ చేతులలో కపాలము, అగ్ని, గంట, త్రిశూలము మున్నగు నాయుధము లుండవలయును. రెండుచేతులు వరదాభయ ముద్రా విశిష్టములు కావలయును. రెండుచేతులుమాత్రమే యున్న పద్మిని పర్యాయముగా ఆయా యాయుధవిశేషములను దాల్చియు వరదాభయముద్రలు పట్టియు నటించినది. ఈ కాళీ తాండవము సభ్యుల కించుక భయమనిపించినది. దానికంటెను భయంకరమైనది త్రిపురతాండవము. ఇందు శివుడు పదునాఱు చేతులతో నాయా యాయుధములను దాల్చియుండును. ఇరువైపులను గౌరీ కుమారస్వాము లుందురు. దీనికన్నను మహా భయంకర మైనది సంహారతాండవము. ఇందు శివుడు కపాల మాలా భీషణుడై యెనిమిది చేతులలోను సంహారచిహ్నము లగు అగ్న్యాదులను దాల్చి నర్తించును. పద్మిని దీనినిగూడ ప్రదర్శించినది. ఇక ఊర్ధ్వతాండవములో ఒకకాలిని శిరః పర్యంతము వచ్చువఱకు పైకెత్తవలయును. రెండవపాదమును అపస్మారదనుజునిపై నుంచవలయును. దీనిని పద్మిని ప్రదర్శింప లేదు. తరువాత ఆమె లలితతాండవమును నటించినది.

పేరునకు దగినట్లే ఈ తాండవము పరమసుకుమార సుందరముగా నున్నది. కుడి కాలిని అపస్మారునిపై నుంచి కొంచెము వంపు చూపవలయును. ఎడమకాలిని కుడి కాలి మోకాలువరకు వచ్చునట్లొయ్యారముగా నెత్తవలయును. ఎడమ చేతిని నాభి మీదుగా కుడివైపునకు చాపి పెట్టవలయును. కుడిచేత అభయ ముద్ర పట్టవలయును. పద్మిని ఈలలిత తాండవమును ప్రదర్శించు నప్పుడు చూచువా రానందమున మునిగిరి. ఒక లలితభావము వారి నావేశించినది. తుదకామె ద్రష్టలను బ్రహ్మానందమున నోలలాడించు ఆనందతాండవముతో ప్రదర్శనమును సమాప్తము చేసినది. ఎనిమిది గడియలసేపు ఎడతెరపి లేకుండ జరిగిన పద్మినీదేవినాట్యము సభను మంత్రముగ్ధము చేసి వేచినది.

ఈపద్మినీదేవి నాట్యసభ జనుల నెంతగానో మురిపింప జేసినది. పద్మినీదేవి ఒక అచ్చర అనియే వారుతలంచినారు. హస్తపాదాదులను ఆమె ఎంత లాఘవముగా త్రిప్పినది. అవి మగినముతో చేసినవా అన్నట్లు ఆమెకు వశపడిపోయినవి. "యతో హస్త స్తతో దృష్టిః, యతో దృష్టి స్తతో మనః" అన్న నాట్యశాస్త్రవాక్యమును అక్షరాలా పాటించి ఆకన్య అభినయించినదే. కృష్ణలీలలను అభినయించునప్పుడు ఎన్ని రసముల నామె యొప్పించినది? శివతాండవము సలుపునప్పుడు ఆ పరమశివుడే స్వయముగా ఈ తాండవనృత్యము చేయు చున్నట్లు తలంచినాముగదా. ఏమి ఆ తన్మయత్వము! ఏమి ఆ అంగభంగీవిశేషములు! ఏమి ఆ అవయవ విన్యాసములు! అని ప్రశంసించు జనుల పొగడ్తలకు మితి లేకుండెను.

వీరభద్రప్ప నాట్యసభా నిర్వహణమున ప్రధానపాత్ర యని పద్మిని గ్రహించినది. ఆతనిపై తన కేదో మమకారము కలిగినట్లు ఆమె అనుభూతి పొందినది. ఆ కుఱ్ఱవాని చక్కదనము, కార్యనిర్వహణ చాతుర్యము అన్నియు ఆమెకు అక్కజముగా తోచినవి. ఇట్టి మమకారమాతనిపై తన కేల కలుగవలయును? ఇది తన జన్మవ్రతమునకు విరుద్ధమే. తాను స్త్రీగనుక ఒకపురుషునిపై ప్రేమ కలుగుట ప్రకృతిధర్మమా? ఈప్రకృతిధర్మమును నిరోధింప వీలులేదా? పద్మినీదేవిమనస్సు పరిపరివిధముల నాలోచింప మొదలిడినది.

పద్మిని వేశ్యవద్ద పెరిగినను ఆమె యుద్దేశ్యము లన్నియు వింతలైనవి. వేశ్యాంగనలు ఒడలమ్ముకొని జీవించుట ఆమె కెంతమాత్రము గిట్టదు. సమాజములోని ఆ యా కులముల వారు వివాహవ్యవస్థకు కట్టుబడి ధార్మిక నైతిక జీవనము చేయుచుండగా, ఒకజాతి పడుపువృత్తికై ప్రత్యేకింపబడి సంఘములోని విలాసుల సంతృప్తికై జీవించుట ఆమెకు సహింప రానిదిగా తోచినది. కాకతి ప్రతాపరుద్రదేవునికి మాచల్దేవి యను నుంపుడుకత్తె యున్నదట. కర్పూరవసంతరాయ బిరుదాంకితుడు కుమారగిరిరెడ్డి లకుమాదేవిని వలపుకత్తెగా చేసికొన్నాడట. అంతగా సౌందర్య మోహితులైన ఆరాజులు ఆ అంగనలను పెండ్లాడకపోయినారా? ఆ తెలివితక్కువ వారాంగనలైనను ఉంపుడుకత్తెలుగా నుండుట కేల యంగీకరించినారో! వివాహ మాడు డని కోరిన బాగుండెడిది కదా! పాపము! వారి ననవలసినపని లేదు. సంఘమును శాసించు నాచారపిశాచరాజు మహిమ యట్టిది.

ఈ యనాచార మేనాడు పుట్టినదో తెలియదు. సంఘ శాసకు లిదియొక సనాతన సంప్రదాయమని సమర్థించు చున్నారు. "కులపెద్ద" లనుకొనువారి వినోదమునకీ వేశ్య వాటిక యొక విహారదేశము. క్రీడారంగము. ఇది కారణముగా ఎన్నో కుటుంబములు కూలుట. ఎందఱో కులసతుల కుటుంబ ములు నిష్ఫలపాలగుట. అబ్బా! ఎన్ని యనర్థములు. ఇన్ని యనర్థముల కాకరమైన ఈ వ్యవస్థ నాశనము కాకూడదా! అసలు మొదట పుట్టిన దేవదాసీవ్యవస్థ మంచిదే. దేవదాసీలు దేవాలయములందు భగవంతునియెదుట నృత్య గీత వాద్యాది గోష్ఠులతో సేవ సలిపి ఆయన అనుగ్రహమునకు పాత్రులై తరింపవలయును. ఈ నృత్యగానాది కళలు భగవత్పర తంత్రములు కానియెడల - మానవుల సంతోషమునకు మాత్రమే వినియోగింపబడునెడల ఆమానవులను అధోలోకము నకు లాగుటకు వెలవు లేర్పడగలవు. అందుకే వీనిని ఆనాడు దేవాలయములయందు దేవదాసీలచే ప్రదర్శింపజేయుచు వచ్చిరి. భగవత్పరములైన ఆకళలు మనుజుల మనస్సులందు ఎట్టి దుష్టసంస్కారములనుగాని నాటుటకు వీలుండదు. కుల స్త్రీలచేమాత్ర మీ నృత్యగానముల నేల ప్రదర్శింప జేయ రాదు ? పతివ్రత లీ పనికి పూనుకొన్నచో భగవంతుడును సమాజమునుగూడ సంతసింపవచ్చునే.

ఇట్టి ప్రత్యేకాభిప్రాయములు గలిగినవ్యక్తి గనుకనే పన్నిని రాజనర్తకీపదమునందున్నను రాజాస్థానములో నెన్న డును గజ్జెకట్టి నాట్యము సలిపిన పాపమున బోలేదు. పూర్వము వసంతనవరాత్ర మహోత్సవములవేళ విజయనగర

ములో హజారరామాలయములోనే ఆమె నాట్య మేర్పాటు చేయబడినది. తరువాత ఆమెకు జరిగిన కనకాభిషేకమహోత్సవము ఆమెకోరికపై అచ్యుతరామాలయమున జరిగినది. ఇప్పుడు పెనుగొండలో సైతము ఈనాట్య ప్రదర్శనము కాశీశ్వరాలయ ప్రాంగణమున జరుపబడినది. విష్ణుభక్తుడగు నచ్యుత దేవరాయలవారుగూడ ఆమె సంకల్పమును ముద్దు చేసెడివాడు. ఆత డెన్నడుగాని తన ఆస్థానములో నృత్యము సల్పు మని పద్మినీదేవిని బలవంత పెట్టలేదు. అది ఆమె అదృష్టమే. ఇట్టి సంకల్పములుగల పద్మిని భోగపుకులములో పశుప్రవృత్తిని నిర్మూలింప జేయవలయు ననియు, వివాహ వ్యవస్థను నెలకొల్పవలయుననియు, అందుకు తన జీవితమును ధారపోయవలయు ననియు దృఢసంకల్పము చేసికొన్నది. జీవితాంతము దేవదాసీలుగా నుండి భగవత్సేవ చేయదలంచిన స్త్రీలు ఆజన్మబ్రహ్మచారిణులుగా నుండుట మంచిదనియు ఆమె సిద్ధాంతము.

పద్మిని ఈడేటునప్పటికి ఆమెకు కన్నెటికము పెట్ట వలయునని విద్యానగరములోని పలువురు ధనవంతులు, రాజ పురుషులు ప్రయత్నించినారు. వారు రంజకం కుప్పాయమ్మ గారితో ఈసంగతినిగూర్చి సంప్రదించిరి.

కుప్పాయమ్మకూడ కులవృత్తిగదా యని పద్మినితో ఈవిషయమునుగూర్చి ప్రస్తావించినది. పద్మిని తన యభిప్రాయ ములను, ఆదర్శములను, జీవితోద్దేశ్యమును కుప్పాయమ్మకు తేటపఱచినది. అందులకు కుప్పాయమ్మ వింతపడి "ఇది యేటి కెదురీత యనియు, ఈ ఆశయములు నెఱవేఱుట కష్టమనియు,

ఎన్నో కష్టములీ కార్యసాధనలో నెదురుపడగలవనియు మంద లించినది. కాని పద్మినీ దేవి తనదృఢసంకల్పమును మార్చుకొన లేదు. చేయునది లేక కుప్పాయమ్మ కన్నెతికపు ప్రయత్నమును విరమించుకొన్నది. కాని పద్మినిని తమ దాసినిగా జేసికొన దలంచిన కొందఱు యువకులుమాత్రము తమ యత్నమును విరమింపలేదు. వారిలో కటికము కృష్ణప్పనాయకుడనువా డొకడు. పద్మినీదేవిపైగల వలపుతో నాత డెన్నో ప్రయత్న ములు చేయుచునేయున్నాడు. కాని అవి కొనసాగుట లేదు. కారణము ఆమెకు అచ్యుతరాయల అండదండ లున్నవి. కృష్ణప్ప పెనుగొండలో జరుగు విరుపణ్ణ పట్టాభిషేకోత్సవము లకుగూడ విచ్చేసినాడు. ఆ విచ్చేయుట విరుపణ్ణపై గల నెనరు చేత కాదు. పద్మినీదేవిపైగల మోహముచేత. ఇట్లు వచ్చిన కృష్ణప్ప కార్యక్రమములో పిలువని పేరంటముగా జోక్యము చేసికొనుట, పద్మినీదేవి నృత్యమధ్యమున ఆనాట్యము ప్రద ర్శింపుము– ఈనాట్యము ప్రదర్శింపుము అని తన రసికత తెల్లమగునట్లు లిఖితపత్రముల నంపుట మొదలగు పిచ్చి పనులు చేయుచున్నాడు.

తండ్రివలెనే వీరభద్రుడును కళాప్రియుడే. తండ్రికి స్థిరకళలైన శిల్ప చిత్రలేఖనములపై మక్కువ యెక్కువకాగా, వీరభద్రునికి చరకళలైన సంగీత నృత్య నాట్యాదులయం దభిమానము మెండు. ఆనాటి పద్మినీదేవినాట్యసభ ప్రజల మన్ననలను చూఱగొన్నసంగతిని గుర్తించిన వీరభద్రుడు మఱునాడు రామస్వామి దేవాలయములో పద్మినీదేవి గానసభ నేర్పాటు చేయించినాడు.

పెనుగొండలో కాశీశ్వర, యోగరామస్వామి దేవాలయములు రెండును ఒక్కచోటనే యున్నవి. ఈ రెంటికి ప్రక్కనే గగనమహలున్నది. శివకేశవుల కిద్దఱకు భేదము లేదని చాటుటకు ఆ రెండు దేవళములును జంటగా నున్నట్లు లోకులు భావింతురు. ఇంతవఱకు ఆశిల్పము నంతగా చూచినవారు లేరు. ఉపాధ్యాయులుమాత్ర మప్పుడప్పుడు బడిలోనిపిల్లలతో బాటు వచ్చి వారి కా శిల్పములను చూపించుచు ఆ పురాణ కథలను బోధించుచుండువారు. నేను గానసభ ప్రారంభమగుట కింకను వేళ కానందున ప్రజలు గుంపులు గుంపులుగా ఆ దివ్యశిల్పములను చూచుచున్నారు.

యోగరామస్వామి దేవళములోని ఏకశిలాధ్వజస్తంభము చూడ ముచ్చటైనది. ఆలయకుడ్యములమీద మొదటి వరుసలో శ్రీకృష్ణలీలలు గండరింపబడినవి. భూదేవి పాపభారము మోయజాలనని శ్రీమహావిష్ణువును ప్రార్థించుట మొదలుకొని ఆతడు కృష్ణుడుగా అవతరించి కంసవధ మొనర్చువఱకునుగల సమస్త శ్రీకృష్ణలీలలు ఇచ్చట శిల్పింపబడినవి. భాగవత కృష్ణుని లీలావిశేషాల నన్నిటిని ఇక్కడ ద్రష్టలు శిలలమీదనే చదువ వచ్చును. రెండవ వరుసలో రామాయణ కథాశిల్పాలున్నవి. ఇవిగూడ శ్రీరామజననము మొదలుకొని రావణవధవఱకు నున్నవి. ఈకథలేకాక, సప్తర్షులు, శివబ్రహ్మలు, అష్టదిక్పాలురు, దశావతారములు, కామధేను కల్పవృక్షాదులు, క్షీరసాగరమథనకథ – ఇత్యాది పౌరాణిక శిల్పములు చదువు రాని పామరులకుగూడ పౌరాణిక కథావిజ్ఞానమును కలిగించుటకా యన్నట్లు శిల్పింపబడినవి.

కాశీశ్వరాలయము శివాలయముగనుక దీనిమీద శివ లీలాశిల్పము లెక్కువ. పాండవకథా శిల్పాలనుగూడ వీరరసో ద్దీప్తికై యిచ్చట చెక్కినారు. కిన్నరమూర్తులు కోలాటపు శిల్పాలు వినోదదాయకములు. ఆలయ ముఖద్వారమున కిరు వైపుల నాట్యశిల్పము లున్నవి. శివుడు నటరాజు కనుక ఈ నాట్యశిల్పాలుండుట సమంజసమే. ఇందున్న నృత్యగణపతి శిల్పము మనకు నవ్వు పుట్టించును. ఎన్నో మహోన్నత లక్ష్యములను సాధించుటకై దేవళములమీద ఈదివ్యశిల్పకళ చెక్కబడినది.

నాట్యము శివప్రీతికరము గావున పద్మినీదేవి నృత్యము కాశీశ్వరాలయమున జరిగినది. ఇక గానసభకు రామస్వామి దేవాలయము నెన్నుకొన్నారు. విష్ణువు సామగానలోలుడు. సంగీతవిద్యా గురువు. తుంబుర నారదాదు లీ సంగీతముతోనే శ్రీమన్నారాయణు నారాధించుచున్నారు. కృష్ణావతారములో ఆయన అష్టభార్యలగు సత్యా రుక్మిణీ జాంబవత్యాదులు సంగీతకళా నిధులు. నటరాజు నాట్యమునకు కరగినట్లు, నారసాక్షుడు సంగీతమునకు కరగును. సంగీతవిద్యోపాసనచే ఆదేవుని పొందుట సులభము.

నాటిసభలో. పద్మినీదేవి ప్రధాన గాయకురాలు. నట్టువ నాగయ్య మార్దంగికుడు. కుపమా దేవి వైణికురాలు. నిన్న జరిగిన నృత్యప్రదర్శనము పద్మినీదేవి ప్రతిభావిశేషమును పెనుగొండ వాస్తవ్యులకు చాటి చెప్పినది. దానితో ఈనాడు విచ్చేసిన శ్రోతల కంతు లేదు. స్త్రీ బాల వృద్ధులనెడిభేదము లేకుండ వచ్చినారు. స్త్రీలు శిశువులను చంకల నిడుకొని

వచ్చిరి. పాముల, బుడబుక్కల, దొమ్మర మొదలగు సంచార జాతులవారుగూడ ఆపద్మినిని చూచుటకు, ఆమెపాట వినుటకు వచ్చినారన్న ఆగాయనీమణి జనాకర్షణశక్తి యెట్టిదో చూడుడు.

పద్మినీదేవి సంగీతము నారంభింపగనే సభ వింజమాకిడి నట్లు నిశ్శబ్ద మయినది. పసిపిల్లలు కొంద అదివరకే ఏడుపులు మొదలుపెట్టిరి. ఒకటిరెండు పాటలు పాడునప్పటికి పిల్లలు రోదనములు మాని కేరింతలు కొట్టసాగిరి. ఆసంగీతధ్వని విన బడినంతమేర పశువులుగూడ మేతలు మేయుట మాని చెవులు ఱిక్కించుకొని సంతోషపరవశములై ఆ మధురగానము నాలింప మొదలిడినవి. పాములవాండ్ర బుట్టలలోని పాములు మూతలు త్రోసికొని బయటికి వచ్చి పడగలు విప్పి ఆడ నారంభించినవి. వీనిని గాంచి జనులు తబ్బిబ్బు కాజొచ్చిరి గాని, ఇది సంగీత మహిమ యని తెలిసినపిమ్మట భయపడరైరి. "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గాన రసం ఫణీ" అనుమాట సార్థకమైనది. ఆమె శంకరాభరణము నాలాపించినప్పుడు సర్పములుతలలూపి యూలకించినవి. మేఘరంజని పాడినప్పుడు ఆకసమున అకాల మేఘములు తారాడినవి. దీపకమునకు దీపములు వెలిగినవి. కల్యాణి, కేదారగౌళ మున్నగు వివిధరాగముల నామె పాడి నది. రాగము, పల్లవి, తానము - పాడునప్పుడును, రాగములో కళలు వేయునప్పుడును, ఒడుపులు చూపునప్పుడును, స్వర గ్రామ మూర్ఛనల నందుకొనునప్పుడును ఆమె ప్రదర్శించిన నేర్పు శాస్త్రవేత్తలను గాయకులను ఆశ్చర్యసముద్రమున ముంచి యెత్తినది. ఆమె చాలసేపు భక్తిబంధురములైన కీర్తనలనే గానము చేసినది. అందు పెక్కులు శివస్తోత్రములు.

సభ్యుల కోరికపై జయదేవుని అష్టకములనుగూడ కొన్నింటిని ఆమె పాడినది. ఎవ్వరును పరీక్షింపలేదు కాని, శిలలు కరగిన వేమో! మోడులు చిగిర్చినవేమో! తెలియదు. రహిపుట్ట జంత్రగాత్రముల తొల్గరగించు విమలగాంధర్వ మాపద్మినీ దేవిది. గానముంగూర్చి మనవా రొక కథ చెప్పుచుందురు.

ఇద్దఱు సంగీతవిద్వాంసు లొక రాజువద్దకు వచ్చి గానములో తమలో నెవరు గొప్పవారో నిర్ణయింపుడని కోరినారట. అంత నారాజు ఒక నల్లఱాతిని దెప్పించి ఆవిద్వాంసులయెదుట నుంచి సంగీత మారంభింపు మన్నాడు. అం దొకడు పాడగా కొంతసేపటి కా నల్లఱాయి కరగినదట. అప్పుడా భూపతి సంగీతము నాపి యాతని చేతివీణను కరగినఱాతిపై బెట్టు మన్నాడు. ఆగాయకు డట్లు చేయగా, కొంతసేపటి కాఱాయి గట్టిపడి పోయినది. ఆవీణగూడ యందే బిగిసిపోయెను. అప్పుడు తేడు రెండవవానిని సంగీతము పాడి ఱాతిని కరగించి యందలి వీణెను పైకి దీయుమని చెప్పెను. ఆతడు కొంతసేపు పాడు నప్పటి కాశిల పూర్వమువలెనే ద్రవించినది. గాయకు డప్పుడు తన పాట నాపి ఆవీణియను పైకి దీసి రాజునకు సమర్పించెను. అంతట ప్రభువు ఇద్దఱును పుంభావ సంగీతసరస్వతులే యని కొనియాడి బహుమానించినాడట. నేటి గాన మిట్టిది.

పద్మిని గానమునకు సభ్యులు తన్మయులైనారు. అందఱు తలలూపువారే. తొడలమీద చేతులతో తాళములువైచు వారే. కొందఱు తాముగూడ నోళ్ళు తెఱచి పాడబోయి ప్రక్క నున్నవా రడ్డగింపగా మానుకొన్నారు. మంత్రము వేసినట్లు, గారడి కట్టుకట్టినట్లు ఆసభ సమ్ముగ్ధమై పోయినది.

విరుపణ్ణ ఈశివస్తోత్రములకు కరగినాడు. ఆతనికన్ను లానందబాష్పస్విన్నము లైనవి. మేను గగుర్పాటు చెంద ఒకానొక బ్రహ్మానందసహోదరమగు సంతోషమున నాతడు మునుకలుపెట్టినాడు. ఆ సభలో ఆనందింపని ప్రాణి లేదన్న అతిశయోక్తి కాదు. వీరభద్రప్ప కీ పద్మిని మానవస్త్రీయన్న స్మృహాయే లేదు. సత్యలోకమునుండి సరస్వతీదేవి భూమికి దిగివచ్చి గానము చేయుచున్నట్లే ఆత డనుభూతి పొందినాడు. ఒక్కొక్క రాగమాలాపించునప్పుడు - ఒక్కొక్క గేయము పాడునప్పుడు ఆతడు తనమనస్సులో పద్మిని కెన్నిమాఱులు నమస్కరించినాడో చెప్పలేము. నలుగురు నవ్వెపోదురనికాని లేకున్న అంతటి నిండుసభలో ఆతడు రెండుచేతులెత్తి ఆమెకు నమస్కరించెడువాడే.

కృష్ణప్పనాయకుడు అళియరామరాయలకు ఆత్మీయుడు. "నేనుగూడ రాజపురుషుడనే" యన్న గర్వ మాతనికి గలదు. ఏనాటికైనను తా నొక మండలాధిపతి కావచ్చు ననియు ఆతనిఆశ. ఆత డేనాడో పద్మినిపై కన్ను వేసినాడు. అట్టి ఉద్ధతస్వభావముతో నాతడు మధ్యమధ్య శృంగారజావళీలు కొన్ని పాడవలసినదని తాళపత్రముపై వ్రాసి పద్మినీదేవికి పంపుచుండువాడు. ఆమె పుట్టి బుద్ధియెఱిగినతరువాత కామోద్రేకమును గలిగించునట్టి జావళీలను పాడియే యెఱుగదు. పైపెచ్చు తన సహచరులనుగూడ పాడనిచ్చెడిది కాదు. ఇట్టి యామె కృష్ణప్ప కాదు. సాక్షాదీశ్వరుడు వచ్చి ఆదేశించినను పాడునా ? ఆమె యాతనివ్రాతను గీటున బుచ్చినది. వీరభద్రప్ప కృష్ణప్పను మందలించి కూర్చుండబెట్టెడివాడు. పాట

పాటకు మధ్య విశ్రాంతివేళ పద్మినికన్నులు వీరభద్రప్ప సౌందర్యమును నిర్నిమేషదృష్టితో త్రాగుచుండెడివి. నాటి గానసభలో పానకములోని పుడకలవలె కృష్ణప్పనాయకుని దుడుకుచెయ్వులు ఒండురెండు తప్ప ఇంకేలోపములును జరుగలేదు.

# 7

గానసభ ముగించివెళ్ళిన పిమ్మట పద్మిని మనోనేత్రమునకు వీరభద్రప్పయే గోచరించుచున్నాడు. ఆమెకు మనస్సు స్వాధీనములో లేదు. ఆమె సరిగా అన్నము తినలేదు. ఆలవోకగా నాలుగు మెతుకులు నంజినది. తలనొప్పి వచ్చినదని పోయి ప్రక్కపై పరుండినది. కుప్పాయమ్మ పిల్లకు దృష్టితగిలినదని యెంచి ఉప్పుగల్లు తీసి నీట వేసినది. మిరపకాయలు దిగదుడిచి నిప్పులలోబోసినది. దీపముదిగదుడిచి చేయవలసిన సేవలు చేసినది. పద్మినీదేవి మంచముపైబడి పొరలుచున్నది. ఆమె హృదయము వీరభద్రప్పమీదికే పోవుచున్నది. తొలినాడాతని మీద ఏదో చెప్పరాని మమకారము కలిగినది. ఈనాడాతడు పూర్తిగా తన మనస్సును దొంగిలించినట్లైనది. ఆతని యందమెంత అనుపమానము. ఆ చంద్రబింబమువంటి మొగము. ఆజానుబాహువులు. వెడదయైన రొమ్ము. ఆ నూనూగుమీసాల లోని మురిపపు చిఱునవ్వులు. మాటలాడునప్పటి ఆ మాటల పొందిక. ఆ కంఠమాధుర్యము— ఇవియవి యననేల వీరభద్రుని సర్వశరీర చేష్టాగత సౌందర్య విలాసములు ఆమెకు అబ్బురములనిపించినవి.

ఇట్టి అందగానిని తా నిదివఱకు చూడలేదు. కామశాస్త్రము పాంచాలుడను నొకజాతి పురుషుని వర్ణించి చెప్పెను. ఆతని సర్వలక్షణములు లక్షణాంతర సాంకర్యము లేక యీతనిలో రాశీభూతములై యున్నట్లున్నవి. "నా మనస్సీతనిమీఁది కేల పోవుచున్నది? నేను ఆజన్మబ్రహ్మచర్యము పూని దేవదాసిగా నుండవలయు ననుకొంటినే. ఇప్పుడీ వికార మేల కలుగవలె? దీనిని మరల్చుకొనలేనా? సాధ్యము కాదు. ఎంత చిక్కబట్టినను మది మది నుండుట లేదు. ఆతనివైపునకే పరుగిడుచున్నది. ఒకవేళ నేను వివాహమాడ దలంచినను ఆతడు నన్నెట్లు పెండ్లి చేసికొనును? నేను వేశ్యను గదా. ఆతడొక కులవ్యవస్థకు బద్ధుడైనవాడే. ఆతడు నాకు కన్నెరికము పెట్టి నన్ను దన యుంపుడుకత్తెగా జేసికొన జూచునేమో! అది నాకిష్టము కాదు గదా. ఒకవేళ ఆతడుగూడ నా సౌందర్య విద్యాకౌశలమునకు ముగ్ధుడై నన్ను పెండ్లాడ నిశ్చయించుకొనగూడదా? అప్పుడు సమాజ మేమనును? వానిని నిందింపదా? ఏమో!" ఇట్టి తలంపులతో పద్మిని రాత్రి మూడు జాములవఱకు నిద్ర పోనేలేదు. ఎట్టకేల కామెకు కూరుకు పట్టినది. విచిత్రమగు నొక స్వప్నానుభూతి యామెకు కలిగినది.

కృష్ణప్ప నాయకుడు తన్ను తన దానినిగా జేసికొన యత్నించుచున్నాడు. అందు కనేకరీతుల తన్ను నిర్బంధించుచున్నాడు. బలాత్కరించుచున్నాడు. ఈబలాత్కారమును వీరభద్రప్ప సాగనీయుటలేదు. ఆతడు తన్ను కృష్ణప్పబారి బడకుండ తప్పించుట తనమీఁది ప్రేమముచేతనే యని పద్మిని

తలంపజొచ్చినది. వీరభద్రప్ప తనకు తాళి గట్టునను ఆశకూడ ఆమెకు బలము కాజొచ్చినది. ఒకరోజున తమ వివాహము వైభవముగా జరుగుచున్నది. బంధుమిత్రులతో కల్యాణ మండపము కళకళలాడుచున్నది. మంగళవాద్యములు మ్రోగు చున్నవి. పురోహితులు మంత్రములు చదువుచున్నారు. వీరభద్రప్ప మంగళసూత్రమును తన మెడలో కట్టబోవు చున్నాడు. ఒక ముడి వేసినాడు. ఇంక రెండుముడులు వేయ వలె. ఈలోపల ఎటనుండియో చుక్క తెగిపడినట్లు కృష్ణప్ప వచ్చి ముడివేయబోవు సూత్రమునులాగి త్రెంపివేయ యత్నము చేయుచున్నాడు. బంధుమిత్రులు వానిని నివారించుచున్నారు. ఆతడు వినుటలేదు. తాను పెద్దపెట్టున ఏడ్చుచున్నది. ఈఏడుపు విని పిల్ల కలవరించుచున్నదని కుప్పాయమ్మ వచ్చి తట్టి లేపినది.

ఈ కల పద్మినికి వింతగాతోచినది. తనకును వీరభద్రప్ప కును వివాహము జరుగదా? దానిని కృష్ణప్ప నాయకుడు చెడగొట్టునా? ఇప్పుడు తన కర్తవ్యమేమి? వీరభద్రప్పమీదికి పరువెత్తు హృదయమును నిగ్రహించుకొన వలయునా యేమి? వలదు. కలలకేమి? ఎట్టెట్లో వచ్చుచుండును. తాను వీరభద్ర ప్పను పెండ్లాడి తీరవలసినదే. అప్పుడు తాను కులసతి కాగలదు. ఇక తన్నెవ్వరును కోరుటకు వీలుండదు.

గానసభానంతర మింటికి వచ్చిన కామాక్షీ విరుపణ్ణలకు పద్మినీదేవిని గూర్చిన ప్రసంగములే చాలసేపటివఱకును సాగినవి.

కామాక్షి : ఆనాటి దిక్కులేనిపిల్ల పద్మిని ఎంత యున్నతికి వచ్చినవండీ ! అసలు బ్రతుకునో లేదో యని భావించినారు గదా.

విరుపణ్ణ : భగవంతుని దయ అట్లే యుండును. ఆతడు అనుగ్రహించినచో "అడవి రక్ష లేని అబలుండు వర్ధిల్లు - రక్షితుండు మందిరమున జచ్చు." ఇందుకు మన వీరభద్రునికి మాటలు వచ్చుటయే సాక్ష్యము. ఏ మందులుగాని, ఏ వైద్యులుగాని చేయలేనిపనిని పరమేశ్వరుడు చేయ లేదా ?

కామాక్షి : నిజమే యనుకొందు. ఆనాటి అర్భకురాలు కుప్పాయమ్మగారి ఇంటిలో పెరుగుట. ఇంతగా సంగీత సాహితీ నాట్యవిద్యాలయం దండె వేసిన చేయి యగుట. అచ్యుత రాయలవారిచే ఘనసమ్మానము లందుకొనుట. ఎంత ఆశ్చర్యము! ఇవి యన్నియు పదునాఱేడులు నిండీ నిండక మునుపే!

విరు : ఔను. దేవతానుగ్రహమున బుట్టినవారి శక్తులిట్లే పెంపొందును. ఆమె మహాశివభక్తుని కూతురు గదా! అందుకే వేశ్యవద్ద పెరిగినను ఆమెశీలము చెడ లేదు.

కామాక్షి : నిజమేనండీ! ఎంత మంది కన్నెఱికము పెట్ట దలంచినను ఆమె అంగీకరింప లేదనుచున్నారు. జీవితాంతము బ్రహ్మచర్యము పూని దేవదాసిగా నుండుటకుగాని, లేకున్న తగిన వరుని పెండ్లాడి కులసతి

యాటకుగాని సన్మానించుకొన్నారని లోకులు చెప్పుకొనుచున్నారు.

విరుపణ్ణ : పద్మిని అట్లు చేసిన యెడల ధన్యజీవనయే కాగలదు, కాని, ఈస్వార్థపరమానవసమాజమామె సాహసములను సాగనీయవలయును గదా! సభలో చూచితివి గదా, కృష్ణప్పనాయకుని ధార్ష్ట్యము. ఆతడు పద్మినిపై కన్ను వేసినట్లు ఆతని చేష్టలు చెప్పుచున్నవి.

ఇంతలో వీరభద్రప్ప వచ్చుటచే వారా సంభాషణమును మానివేసిరి. ఆతడు పొంచియుండి వారి మాటలను విననే విన్నాడు. పద్మినీదేవి శీలవతి యనియు, వేశ్యాజాతిది కాదనియు ఆతనికి స్పష్టాస్పష్టముగా తెలిసినది.

పద్మిని జన్మస్థానము అనంతపురము. కుప్పాయమ్మది గూడ అనంతపురమే. కుప్పాయమ్మ యింటిప్రక్కనే నంజుండప్ప యను నొక మహావీరశైవభక్తుడుండెడివాడు. ఆతడు నిరుపేద. వారి పూర్వులు ద్విజులు. ఉపనయనాధికారముగల బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను ద్విజులందురు. ద్విజశబ్దమునకు రెండు జన్మములు కలవాడని యర్థము. తలిదండ్రులు ప్రసాదించు భౌతికశరీరరూప జన్మ మొకటి. ఆచార్యుడు ఉపనీతు నొనర్చి జ్ఞానదేహము నిచ్చు జన్మ మొకటి. ఈ రెండును గలవారయినందున మొదటి మూడువర్ణముల వారిని ద్విజులన్నారు. నంజుండప్ప పూర్వులు బసవేశ్వరుని వీరశైవము పుచ్చుకొన్న పిమ్మట వర్ణభేదమును మఱచిపోయినారు. తమ దీ కులమని చెప్పుకొనుటయే వారి కిష్టమయ్యెడిది కాదు. ఉన్నదెల్ల ఒక్క

మానవజాతియే. ఏమైన భేదములున్న చో శైవులు, శైవేతరులు అని రెండే రెండు భేదములు. శైవులు లింగాయతులు. వారు కులభేదమును పాటింపరాదు. నంజుండప్ప కుటుంబమువారిని లింగాయతు లనుకొనుట తప్ప, బ్రాహ్మణాది వర్ణములలో నేవర్ణమువారో పౌరులకుగూడ దెలియదు. నంజుండప్ప షట్కాలశివపూజా ధురంధరుడు. వీరశైవపు ముద్ద. ఆతడు ముసలివాడైన పిమ్మట పద్మిని కడుపున బడ్డది. పద్మినితల్లి ఆఱు నెలల గర్భవతిగా నుండగా నాతడు శివసాయుజ్యమును జెందినాడు. నాటినుండియు నంజుండప్ప భార్యకు కుప్పాయమ్మయే దిక్కైనది. ఆ వీరశైవ పరాయణయు ఆడపిల్లను ప్రసవించుట తోడనే గతించినది. ఆ పిల్లగూడ బ్రతుకునని యెవ్వరు ననుకొన లేదు. కాని కుప్పాయమ్మ అదృష్టమో యన్నట్లా శిశువు బ్రతికి బట్ట కట్టినది. ఆ పిల్ల అందచందములకు గుణశీల ములకు మురిసి పోయిన కుప్పాయమ్మ ఆపిల్ల నింతదానిని జేసి తన నాట్యపీఠము నామె కప్పగించినది. ఆమెయే పద్మినీదేవి. కామాక్షి పుట్టినిల్లు అనంతపుర మగుటచే ఆమెకు విరు గూడ ఈసంగతి తెలియును. కుప్పాయమ్మ విజయనగరమునకు వచ్చినపిమ్మట అనంతపురవాసు లీ పద్మినిసంగతినే మఱచినారు. విజయనగరపౌరు లీ పద్మిని కుప్పాయమ్మ కూతురే యని తలంచువారు.

మఱునాడు పద్మినీదేవి నభినందించుటకు వీరభద్రప్ప ఆమె విడిదిపట్టునకు వచ్చినాడు. మండలాధీశుని తనయుడగుట చేత కుప్పాయమ్మ ఆయనకు సముచిత సత్కారములు జరిపినది. పద్మినీదేవి వచ్చి వీరభద్రప్పనుగాంచి సంతోషముతో నన్నది.

పద్మిని : యువ ప్రభువులకు సమస్కారము. రాకుమారుల రాకచే మేము ధన్యులమైనాము.

వీరభద్ర : ఈ పదవులు శాశ్వతములుగావు పద్మినీ! నన్ను రాకుమారునిగా గాక రసజ్ఞునిగా మాత్రమే చూడవలసినదని కోరుచున్నాను. మొన్నటి మీ నాట్యము, నిన్నటి మీ గానము నన్నానందాబ్ధి నోలలాడించినవి. మీకు మా కృతజ్ఞతాభినందన లందజేయుటకే యిచ్చటకు వచ్చినాను. ఆలనాడు వసంతనవరాత్ర మహోత్సవములలో విజయనగరమున హజార రామాలయమునందు జరిగిన నృత్యమునకన్న మొన్నటి మీ నృత్య మెన్నో రెట్లు మిన్నగా నున్నది. మీ చేతిలో కళ దినదిన ప్రవర్ధమానమగుట ఆకళచేసికొన్న భాగ్యమని నా యభిప్రాయము.

పద్మిని : మీరు రసిక శేఖరులు గనుక పొగడుచున్నారు. నేను చేసిన కళాభ్యాసము సామాన్యమైనదే. మీవంటి వారి ప్రశంసలకు తగినది కాదు.

వీరభద్ర : అట్లు కాదు. మన దక్షిణదేశమున మిమ్ము మించిన వారు లేరని అచ్యుతరాయప్రభువులే అన్నప్పుడు, మీ కళాప్రతిభ సామాన్యమైన దేల యగు?

ఇంతలో కుప్పాయమ్మ లోపలినుండి బంగారుపళ్ళెమున ఫలములను ద్రాక్షపానీయమును పాలను తీసికొని వచ్చి వీరభద్రున కిచ్చినది. పద్మిని మనస్సు మనస్సులో లేదు. ఆమె

నిర్నిమేష దృష్టులతో వీరభద్రుని సౌందర్యమును త్రాగుచు స్వర్గవీథులలో సంచరించుచున్నది. తెల్లవాఱుజామున తన కా రీతిగా స్వప్నము వచ్చుట, తెల్లవాఱిన పిమ్మట ఆ స్వప్నదృష్ట భాగధేయ మిల్లు తన్ను వెదకికొని వచ్చుట ఆమె కేదో శుభ సూచకముగా తోచినది. ఇంతలో కృష్ణప్పనాయకుని మిత్రు డొక డచ్చటికి వచ్చి పద్మినీదేవి యింకెంతకాలము పెను గొండలో నుండునో తెలిసికొని రమ్మన్నారని కుప్పాయమ్మ నడిగి సమాధాన మందుకొని పోయెను. వీరభద్రప్పయు నట నుండి మఱలెను.

పద్మినియింట వీరభద్రప్ప యున్నాడన్న విషయమును మిత్రునివలన విన్న కృష్ణప్ప వీరభద్రప్ప పద్మినిని వైవసము చేసికొని జూచుచున్నాడని యనుమానపడెను. ఆతనికి పద్మినిపై యమితాగ్రహము కలిగినది. "కన్నెఱికము వల దన్నపద్మిని, వ్రతము చెడకుండ జీవితము గడపెదనని చెప్పిన యిచ్చకాలమారి యిప్పుడు వీరభద్రునితో రహస్యముగా ప్రణయకలాపములు జరుపుచున్నదా? నీచురాలు. జాతిసిద్ధ గుణము లెచ్చటికి పోవును. అయినను భోగపుముండకు శీల మేమి? నీతి యేమి? నన్ను వంచించుట కది పన్నిన పన్ను గడయే యిది. అయినను నిన్న మొన్నటివఱకు నోరు తెరచి మాటాడనేరని మూగమొద్దువానికి ఒక త్రిలోకసుందరితోడి పొత్తేమి? ఇది యంతయు ధనగర్వము, అధికారగర్వము. ఈ గర్వము నణంచి తీరవలయును. ఈఅధికారమును కూకటి వ్రేళ్ళతో పెల్లగింపవలయును. అప్పుడుగాని పద్మిని నాకు వశము కాదు. ఈ భోడికుప్పాయమ్మ కెంత పొగరు. దేవదాసీ

వ్యవస్థ యట. ఆ దేవదాసీలు పురుషసంపర్కదూరలు కావలె నట. ఇది యేనాటి ధర్మమో, ఎప్పుడో శిలమై పోయినది. నేడు మఱల దాని పునరుద్ధరణమా? దానికి అచ్యుతరాయల తోడ్పాటా? కానిమ్ము. ఇది సాగినన్నాళ్లు చూతము. ఆ విరుప డేమో శిల్పములని కవళములని బొక్కసములోని రొక్కము నంతయు వెచ్చించి పాడుచేయుచున్నాడు. దివారాత్రము లాతని కదే శిల్పపుపిచ్చి. ఒక బొమ్మ మలచినవానికి వేనవే వేలు ధారపోయును. ఒక చిత్రము గీచినవానికి సమ్మానము లొనరును. ఒక "నాట్యకర్త" కు కనకాభిషేకము లొనరును. కొంచెము సంగీతము పాడిన చాలును. మెడలోని ముత్యాల పేరులైన ముట్టజెప్పును. పద్మిని సానిచేతిలోని పడవలసినదే. ఆమెను కైవసము చేసికొనని కృష్ణప్పనాయకుని బ్రతుకు బ్రతుకే కాదు." అని యూతడు పట్టు పట్టి కూర్చుండెను.

పద్మినియింటినుండి తిరిగివచ్చిన పిమ్మట వీరభద్రప్ప ఆమెవృత్తాంత మే మని తల్లి నడిగినాడు. ఆమె పద్మినిజన్మ ప్రకారమును, గుణశీలములనుగూర్చి కుమారునికి మూల మట్టుగా చెప్పినది.

## 8

విరుపణ్ణ మండలేశు డైనప్పటినుండియు ఆతనికి దైవ ముపై భక్తి ప్రజలపై యనురక్తి యినుమడించుచున్నవి. "తనయం దేదో విశేషమున్నదనిగదా ప్రభువు తన్ను మండ లాధిపతిని జేసినది. కనుక ఆయనకునచ్చిన పనులు తాను

చేయవలయును." ఇట్టితలంపుతో ఆతడు ప్రజల కెన్నో సౌకర్యములు చేకూర్ప యత్నించుచుండెను. చెఱువులు మొదలైన జలాధారములను విరివిగా నిర్మింపజేసెను. వేలకొలది యెకరముల పొలము సేద్యమై ప్రజలయిండ్ల శాలిధాన్యము రాసులు పడుచుండెను. ఇంతవఱకును దున్నక విడిచిన గొడ్డు నేలలు గూడ సస్యశ్యామలములై ప్రజలకు కనువిందొనర్చుచుండెను. కర్షకులకు విరుపణ్ణ చేకూర్చు కృషిసౌకర్యములు మెచ్చుగూర్చుచున్నవి. అట్లే వాణిజ్యము విస్తరించు మార్గముల నేర్పఱచి వణిజుల సంపత్తి పెంపొందునట్లు చేసినాడు.

ఆనాటి పెనుగొండనుండి చుట్టుప్రక్కల నున్న పట్టణములకును, పరిసర దేశములగు తమిళ కర్ణాట మహారాష్ట్రములకును వాణిజ్యవస్తువులను ఎగుమతి దిగుమతులు చేసికొనుటకు వలసిన సమస్తసౌకర్యములను ఆతడు చేకూర్చి పెట్టెను. ప్రజలు నిర్భయముగా ప్రయాణము చేయుటకు వీలైనన్ని బాటలను అమర్చినాడు. పర్వతమయమగు ఆదేశములో బాటల నమర్చుట మిక్కిలి కష్టము. ఒక్కొక్క కొండను చుట్టివచ్చిన గాని బాట గమ్యస్థానమునకు చేరుకొనదు. అట్టితఱి మార్గనిర్మాణ చణులగు శిల్పులచేత పరిశీలనలు జరిపించి ఉత్తమ మార్గనిర్మాణములను విరుపణ్ణ చేయించినాడన్న సామాన్య విషయము కాదు. కొండలు ఎక్కువ యెత్తైనవి కానిచో వానిమీదుగానే త్రోవ లేర్పాటు చేయబడినవి.

ఆనాడు సంతలు జరుగుచుండెడివి. ప్రజల కవసరములైన తినుబండము లేమి, తదితర వస్తుసామగ్రి యేమి, వస్త్రము లేమి సంతలలో కొనుట నాటివారికి పరిపాటి. ఈ సంతలు

సాధారణముగా వారమున కొకతూరి సాగుచుండెడివి. సంతలలో అమ్మబడు వస్తువులమీద పట్టణపాలన కవసరమగు సొమ్ము సుంకము రూపమున లభించుచుండెడిది. వారమున కొక్కతూరియే సంతలు జరుగుచుండుటచేత పేదవారు కూలివారు చేత చాలినంత డబ్బు లేక వారమునకు సరిపడు వస్తువులను సేకరించుకొనలేక పోయెడివారు. వారములో కడపటి రెండు మూడు దినములకు వలసిన గ్రాసమును పేదలు ధనికుల నుండి బదులుగా తీసికొని కుటుంబములను దిద్దుకొనవలసి వచ్చెడిది. జనుల కున్న ఈ యిబ్బంది గమనించిన విరుపణ్ణ ఒక్క ఆదివారముమాత్రమే జరుగుచున్న సంతలను శుక్రవారమునాడుగూడ నేర్పఱచి వారమునకు రెండుసంతలు జరుగునట్లు ఆజ్ఞాపించెను. ఇట్లు చేయుటవలన ప్రజల యిబ్బందులు తీఱుటయే గాక వర్తకసంఘములకును లాభములు పెరిగినవి. ఈవిధముగా జనసామాన్యములో రైతులకును, వణిక్కులకును విరుపణ్ణ యెంతో మేలు చేసి వారి యనురాగమునకు పాత్రమైనాడు. విరుపణ్ణ చేయు ప్రతిపనికిని ప్రజల అండదండలు అధికముగా చిక్కుచున్నవి. లేపాక్షిలో రఘునాథ వీరభద్రమూర్తుల ప్రతిష్ఠలు జరిగినపిమ్మట ప్రజలకు భక్తులకు విరుపణ్ణ పరమాప్తుడుకూడ నైనాడు. వారు లేపాక్షి దేవాలయమును శిల్పసుందరము చేయించవలసిన దని ప్రభువును తొందరపెట్ట సాగినారు.

దేవతలను ప్రతిష్ఠించుట ఒకయెత్తు. ఆ దేవతలకు నిత్యనైవేద్య ధూపదీపాది పూజాపురస్కారములు జరుపు నేర్పాట్లు చేయుటొకయెత్తు. ధనవంతుడగు విరుపణ్ణ ఇందుకుగూడ తన

సర్వస్వమును వెచ్చింపక పోలేదు. మున్నె నాఁడో ప్రౌఢ దేవరా యలవారు నల్వురు బ్రాహ్మణులకు దాన మిచ్చిన దేవరాయ పురమును కాలాంతరములచేత విరుపణ్ణ విక్రయించుకొనుట సంభవించినది. ఆ దేవరాయపురము నిప్పుడు వీరభద్రస్వామి కైంకర్యమునకై దాన మొసంగినాడు. విరుపణ్ణ ధర్మబుద్ధికి ప్రజాపరిపాలనలో అతఁడు చూపిన త్యాగమునకు మెచ్చిన కృష్ణరాయ పుర ప్రజలు అతనికిచ్చిన పొలములను గూడ తన సొంత పొలములతో కలిపి వీరేశ్వరస్వామికే దానమిచ్చినాడు. తనది రాజకుటుంబము. తన్నిర్వహణమునకు అధిక ధనము కావలసియుండును. ఈనాడీసొమ్మును నిలువ చేయవలయును-అన్న దృష్టియే అతనికి లేదు. ముందుచూపనునది లేకుండ ధనరాసులను స్వామి కైంకర్యమునకే వెచ్చింపదొడగినాడు.

ఆలయ శిల్పములను నిర్మించుటకు కావలసిన శిల్పులను ఎన్నిక చేయు నధికారము ప్రధానాచార్యుఁడగు పురుషోత్తమ స్థపతికే యీయబడినది. ఈ సందర్భమున విరుపణ్ణ సంకల్ప మొక్కటే. లేపాక్షి శిల్పములలో ఆంధ్ర ద్రావిడ కర్ణాటక శిల్పముల లేరుతీయములు పొందుపడవలయునని. విరుపణ్ణకు మున్ముందుగా నచ్చినవి వేలాపురి చెన్నకేశవాలయములో జక్కణాచార్యుఁడు చెక్కిన శిల్ప ప్రతిమలు. అందలి మదనికా మూర్తులు, నానావిధ దేవతల ప్రతిమలు ఆయన చిత్తమును లోబఱచుకొన్నవి. ఈ సంగతి పురుషోత్తమునికి దెలిసియే యున్నది.

ఆయన పెందోటనుండి కొందఱు శిల్పులను రప్పించినాడు. ఆ శిల్పివర్గమునకు పెందోట పాలకులలో నొక్కఁడగు బత్తెనా

చార్యుడు నాయకుడు. ఆయన విశ్వజ్ఞ ఋషి గోత్రమువాడు. పెందోట మహాశిల్పాచార్యుల కనికిపట్టు. అచ్చటి శిల్పులే అమరావతిలోను, నాగార్జున కొండయందును, అజంతాగుహల లోను, సాంచీ - సార్నాథాదుల యందును, ఎల్ఫెంటాలోను లోకోత్తరములగు బౌద్ధ శిల్పములను వెలయించినారు. అట్టి మహాశిల్పి బ్రాహ్మణవంశమునకు చెందినవాడే బత్తైన. ఈ వంశమువారు పెందోట పురవరాధీశ్వరులు. బెజవాడనుగూడ వీరు పాలించియున్నారు. రాజోచితమైన దర్పరాజసములు, బ్రాహ్మణోచితమైన సాత్త్విక తేజము బత్తైన శిల్పములలో నాట్యము సేయుచుండును.

కన్నడమునుండి జక్క శిల్పసంప్రదాయమున కృతహస్తులైన జక్కణ్ణ, హంపణ్ణ, నంజుండాచార్య, బసవణ - మున్నగు నుత్తమశిల్పాచార్యులు కల్పింపబడిరి. తంజాపుర ప్రాంతమునకు చెందిన మహాశిల్పాచార్యుడు శివప్రియన్ నాయకత్వమున పొన్నంబలశిల్పిప్రభృతులు విచ్చేసిరి. వీరంద ఱును బహువిధ రూపనిర్మాణ దక్షులు.

మైలవరము, పాంచాలవరములు నాడు లోహశిల్ప నిర్మాణమునకు పేరు మోసిన గ్రామములు. ఈగ్రామములయం దించుమించు వేయేసి శిల్పికుటుంబములైన నుండెడివి. ఈ కుటుంబములవారికి తెలియని లోహముల కూడికలు లేవు. వారు సర్వలోహతంత్రములయందును ప్రవీణులు. ఒక్కొక్క లోహమును ఒక్కొక పరిమాణములో కలిపి మిశ్రలోహము లను చేసినచో అవి భిన్నభిన్న ప్రయోజనములను సంపాదించి పెట్టును. నానాదేవతామూర్తులనుగూడ ఆయా లోహములను

ఆ యూ పాళ్ళవంతున గలిపి నిర్మించినచో అవి వివిధ ఫలముల నొసంగ గలవు. ఇట్టి మహారహస్యములు లోహతంత్రాది గ్రంథములలో వేనకు వేలున్నవి. మైలవరము బెజవాడకు సమీపము. అందు విగ్రహములను పోతపోయుటలో పే రందినశిల్పి దొడ్డనాచార్యుడు. ఇతనిని విగ్రహాలదొడ్డన యని కూడ నందురు. విగ్రహనిర్మాణ మాతని ప్రధానవిద్య మైనను తక్కిన స్వర్ణ రజత తామ్ర శిలా శిల్పాదులయందును ఈయన నిపుణుడే. విశేషించి లోహతంత్రములో చేసిన కృషి ప్రాధాన్యమునుబట్టి ఆయన కా పేరు వచ్చినది.

పాంచాలవరమున కాపేరు శిల్పులనుబట్టియే వచ్చినది. అయోదారు తామ్ర శిలా స్వర్ణమయములగు పంచశిల్పముల చేత లోకము నలంకరించువారు గాన శిల్పులకు పాంచాలురని పేరు వచ్చినది. అనగా పంచసంఖ్యల శిల్పములచేత అలంక రించువారని యర్థము. ఇట్టి పాంచాలుర కునికిపట్టైన గ్రామ మగుటచేతనే యది పాంచాలవరమైనది. పాంచాలవర గణమున కానాడు నాయకుడు లోహతంత్రవిద్యారాశి పండిత బిరుదాంకితుడు విద్యానిధి. ఆయన నానావిధ లోహములను సమ్మిశ్రము చేసి భూషణములు నిర్మించి యిచ్చి ప్రజల రోగములను బాపుచుండువాడు. ఆయాలోహముల స్పర్శ శరీరమునకు తగులగానే వారి రోగములు మటుమాయ మయ్యెడివి. ఆయన అఖండముగా ప్రజానురాగమును చూఱ గొన్నాడు. ఆ విద్యానిధిశిల్పి కూడ పురుషోత్తమస్థపతి కోరినదే తడవు విచ్చేసినాడు. ఇంకను మూర్తి, స్తంభ, మండప, ప్రాకార, గోపురాలయ నిర్మాణములయందు ప్రత్యేక

పరిశ్రమ చేసి యారితేరిన శిల్పిశానులు లేపాక్షి దేవాలయ నిర్మాణమునకు నడుములు కట్టుకొన్నారు.

ఈశిల్పులు మూడు దేశములకు, మూడు భాషలకు చెందినవారైనను వీరి నందఱిని ఒక్కటిగా కలిపెడి మాతృభాష సంస్కృతము. ఆనాటిశిల్పులలో సంస్కృతము రానివారరుదు. శిల్పగ్రంథము లన్నియు నా భాషలో నుండుటంబట్టి యది నేర్వక తప్పెడిది కాదు. శిల్పులే కాదు. సామాన్య సంస్కారము గల మనుష్యు లందఱును గీర్వాణవాణిని నేర్చెడివారే. ఈ శిల్పు లందఱికి విశ్వకర్మశిల్పము, మయమతము, కాశ్యపీయము పరమప్రమాణములు. ఈముప్వురి శిల్పమత సిద్ధాంతముల ననుసరించెడు తక్కిన ఆర్షగ్రంథములుగూడ వీరికి ప్రమాణములే. వందలసంఖ్యలో కర్మకరులుగూడ చేర్చుకొనబడినారు.

శిల్పనిర్మాణమునకు మిక్కిలి ఉపయుక్తములగు కచ్ఛపాద్రి శిలలు భేదింపబడుచున్నవి. సామాన్యకర్మకరులు బరువులు చెక్కుచున్నారు. శిల్పవిద్యార్థులు తమ గురువులు చెప్పినరీతిగా స్థూలాకృతులను నిర్మించుచున్నారు. చిట్టచివరకు గడిదేరిన మహాశిల్పులు తుదితీర్పు నిచ్చి సౌందర్య లావణ్యముల సంతరించుచున్నారు. రేలుబవళ్ళు లేపాక్షిలో మహాశిల్పయజ్ఞము నిర్వహింపబడుచున్నది. విరుపప్రభువు సంపాదించిన ధనరాశులు కర్పూరమువలె కరగి పోవుచున్నవి. ప్రభువు శిల్పములో నిగ్గు చూపుమనుచే కాని, ఇది యింతవఱకు చాలును అనడు. శిల్పులు తాము నేర్చిన చేతివిన్నాణమునే కాక, తాము ఊహించి చేయగలిగిన వింత శిల్పచాతురిని గూడ

జాలమీద విన్యసింప వలసినదని విరూపాక్షుని కోరిక. అన్న గారి సంకల్పమునకు తమ్ముడు వీరణ్ణ ప్రక్క తాళము వేయునే గాని అడ్డు చెప్పడు. ఒకరిని మించిన కళాతృష్ణ ఇంకొకరిది.

లేపాక్షిలో శిల్పము నారంభించినప్పటినుండియు కన్నప్ప తన రెండుకన్నులను వేయికన్నులు చేసికొని కాంచు చున్నాడు. కన్నప్ప యాదవపురుషు. లేపాక్షినివాసి. ఆతనికి జీవనమునకుగాను ఏబది గొఱ్ఱెలు కలవు. ఆగొఱ్ఱెలను కూర్మాద్రి మీద మేపుకొనుచు వానిమీద వచ్చు నాదాయముతో కుటుంబపోషణము చేసికొనుచున్న సాధుశీలుడు కన్నప్ప. ప్రతి దినమును గొఱ్ఱెలను కొండమీదికి త్రోలి సాయంకాలము వఱకును శిల్పులు చేయుచున్న శిల్పములను కోరికతో తిలకించుటయే ఆతని దినచర్య. ఆచూచుటలో ఆతని కేమి ఆనందము చిక్కుచున్నదో తెలియదు. గడ్డముక్రింద చేతికఱ్ఱ నూది తెప్ప వేయక శిల్పనిర్మాణముల నట్టె తిలకించుచుండును. ఆతనిమనస్సులో నేమి యూహ లున్నవో యెవ్వరికిని దెలి యదు. ఒక్కొక్కసారి మధ్యాహ్నభోజనము తెచ్చిన యిల్లాలిని గూడ ఆతడు గమనింపడు.

పరస్పరాభిముఖముగా నున్న పాపనాశేశ్వర కోదండ రాముల గర్భాలయములకును వానికి మధ్య ఒకప్రక్కగానున్న వీరభద్రుని గర్భాలయమునకును, కలిపి ఒకే ముఖమండపము నేర్పాటు చేసినారు. ఈ దేవత లందఱు ఒక కుటుంబములోని వారే యను విశిష్టాభిప్రాయమును వ్యక్తీకరించుట కా శిల్పా చార్యు లీ మార్గము నవలంబించినారు. రఘునాథమూర్తిని

పానవట్టముమీద ప్రతిష్ఠించుటలో గూడ నిట్టి విశేషాభి ప్రాయమే యున్నది కదా.

వీరభద్రాలయ ద్వారశాఖలమీద మనోజ్ఞ శిల్ప సమంచిత లతాబంధములు, ద్వారపాలురు గంపరింపబడినారు. ముఖమండపములోని స్తంభము లన్నియు లోకోత్తర శిల్ప కళా భరితములు. ఏకశిలా నిర్మితములైన ఆ బృహత్ స్తంభములమీద తీర్చిన ప్రతిమ లన్నియు సౌందర్యరాసులే. ఒక స్తంభముమీద నిలబడియున్న గణపతిమూర్తి పార్వతీ పరమేశ్వరులకే కాక మనకుగూడ ముద్దు వచ్చుచుండును. అట్లే అన్నపూర్ణాదేవి సాక్షాత్కరించిన అన్నపూర్ణ భవానియే. చేతధరించిన గరిటెతోను లోకపుటాకలి దీర్ప జూచు ముఖవర్చస్సుతోను ఆతల్లి మనల నన్నమునకు పిలుచుచున్నట్లే యుండును. ఆమెను అన్న మర్థింప వచ్చినాడో యన్నట్లున్న పరమశివుని భిక్షాటనమూర్తి మరొక స్తంభము మీద చూతుము. పెక్కు మూల స్తంభములందు ఒయ్యారము లొలుకబోయుచున్న ముద్దులూరు మోహినీమూర్తులను చెక్కి పెట్టినారు. ఇట్టి మూర్తులలో సరస్వతీమూర్తి యొక ప్రత్యేకత గలది.

## 9

అచ్యుతదేవరాయ లా నాడు ధర్మపత్నియగు వరదాదేవితోడను, చిట్టికుమారుడగు వేంకటపతిదేవరాయలతోడను గలసి హజారరామాలయమున సహస్రనామపూజను నిర్వ

ర్తించెను. పిమ్మట పాండురంగ విఠ్ఠలరాయాలయమునను, శ్రీకృష్ణాలయమునను, అచ్యుతరాయాలయమునను గూడ పూజా పురస్కారములు జరిపి చివరకు విరూపాక్షస్వామిని సాష్టాంగ సేవించి రాజప్రాసాదమునకు చేరుకొనెను. ఆనాడాయన మనస్సంతయు వ్యాకులముగా నున్నది. ఏవో రాజకీయ కార్యము లాయనను చికాకు పెట్టుచున్న ట్లూహింప వచ్చును.

నిజముగా అచ్యుత దేవరాయలు ప్రభుత్వమునకు వచ్చి నప్పటినుండియు అంతఃపుర పరిస్థితులేమి రాజ్యాంగవ్యవహారము లేమి నిర్వ్యాక్రమముగా సాగిపోవుట లేదు. ఇందు కాతడు కారణము కాడు. కాకున్నను ప్రభువుగా తన ధర్మములను తాను నిర్వహింపవలసిన బాధ్యత ఆయనపై నున్నందున ఆయన మనస్సు బహుకాలమునుండియు ఖేదపడుచునే యున్నది.

ఇరువదియొక్క సంవత్సరములు విజయనగర వజ్ర సింహాసనము నధిష్ఠించి ఏకచ్ఛత్రముగా దక్షిణా పథము నేలిన శ్రీకృష్ణదేవరాయభాను డస్తమించినాడు. ఆయన చివర దశలోనే రాజ్య స్థితిగతులు సరిగా లేవు. రాయలవారికి తిరుమలాంబ యను నొక కూతురును, తిరుమల దేవరాయ లను నొక కుమారుడును గలరు. తిరుమలాంబను ఆరేవీటి బుక్కరాజు మునిమనుమడగు రామరాజున కిచ్చి పెండ్లిచేసినారు. అల్లుడగు నా రామరాజు నాటినుండియు అళియరామ రాజను పేర ప్రసిద్ధుడైనాడు. ఈ రామరాయలు రాజకీయ వ్యవహారములందు చొరవ, ప్రజ్ఞాపాటవములు గలవాడయి నందున కృష్ణదేవరాయల వా రాతనికి సమున్నత రాజోద్యో

గము లిచ్చి మన్నించుచుండెను. రాయలవారు తాను జీవించి యుండగనే కుమారుడగు తిరుమలరాయని యువరాజుగా నభిషేకించి రాజ్యకార్యములు రామరాజాదుల తోడ్పాటుతో నిర్వహింప బూనెను. ఇట్లుండ కొంతకాలమునకు తిరుమల దేవరాయలు మరణించినాడు. అతనిని సాళువతిమ్మరుసయ్య విషప్రయోగము చేసి చంపినాడని రాయలు తిమ్మరుసుని సకుటుంబముగా కారాగారబద్ధుని నొనర్చి యాతని కన్నుల నూడబెరికించెను. పిమ్మట తిమ్మరుసు కుమారుడైన తిమ్మదండ నాయకుడు చెఱసాలనుండి తప్పించుకొని పర్వతప్రాంతములకు పోయి అల్లరిని లేపి రాయలవారిని ప్రతిఘటించినాడు. ఈ సంఘటనకు రాయలు క్రుద్ధుడై అల్లుడగు రామరాయలచే తిమ్మదండనాయకుని పట్టి తెప్పించి పర్వతప్రాంతముల ప్రజల శాంతిని స్థాపించెను. తిరుమలదేవరాయల మరణముచేత రాయ కుటుంబమున కలిగిన విషాదమునకు మేర లేదు. ఇట్టి విషమ ఘట్టమున రాయలవారిమనస్సునకు శాంతి యెట్లుండును? క్రమ క్రమముగా నీ మనోవ్యాధి రాయలను మృత్యువాటికకు దగ్గఱ జేయజొచ్చినది. సామ్రాజ్యమున కుత్తరాధికారి యెవరా యను ప్రశ్నముగూడ నప్పుడు రాయల మనస్సున పొడ సూపెను.

ఆనాటికి సామ్రాజ్యమునకు వారసులుగా నెన్నదగిన వారు నల్వురున్నారు. ఒకడు పదునెనిమిది నెల లైనను నిండీ నిండని కృష్ణరాయల రెండవ పుత్రుడు. రెండవవాడు రాయల వారి యన్నయగు వీరనరసింహరాయల కుమారుడు. తృతీయు డాయనసవతితల్లి కుమారుడగు అచ్యుత దేవరాయలు. చతుర్థుడు

అచ్యుతరాయల యన్నయగు శ్రీరంగదేవరాయల పుత్రుడు సదాశివరాయలు. శ్రీరంగ దేవరాయ లిదివఱకే స్వర్గస్థుడై నాడు. ఈ నల్వురిలో గుణశీలములను శక్తిసామర్థ్యములను బట్టి అచ్యుత దేవరాయలే సామ్రాజ్యమునకు సర్వవిధముల నర్హుడని కృష్ణదేవరాయలవారు నిశ్చయించిరి. కాని నాడు చంద్రగిరిలోనున్న అచ్యుతరాయలను పిలిపించి తన చేతి మీదుగా పట్టాభిషేకము జరుపుటకు మృత్యుదేవత ఆయన కవకాశము నీయలేదు. ఆ తుది క్షణములలో సాళువనరసింగ రాయ బిరుదాంచితుడగు చెల్లప్పను సర్వశిరఃప్రధానిగా నేర్పాటు చేసి జరుగవలసిన విధాన మంతయు నాతని కాదేశించి అచ్యుతదేవరాయలు వచ్చువఱకు సామ్రాజ్య మన్యవశము కాకుండ కాపాడి యాతని కప్పగింపవలసినదని కట్టడి చేసి రాయలు మృతి నందెను.

అల్లుడైన రామరాయలు సర్వసమర్థుడనియు, ఆతనికి తనసామ్రాజ్యము నేలునిచ్ఛ పూర్తిగా కలదనియు రాయల కెఱుకయే. అయినను ఆయన ధర్మపక్షపాతము బంధుపక్షపాతమును ద్రోసిపుచ్చినది. కాని యీ నిర్ణయము రాయల దేవేరులకుగాని, కూతురగు తిరుమలాంబకుగాని యెట్లిష్టమగును? రామరాజు తన మామగారు తన చిన్నారి కుమారుని సామ్రాజ్యాధిపతిని జేసి ఆతనికి రక్షకుడుగా తన్ను నియమించునని తలంచి యుండెను. కాని దానికిప్పుడు విరుద్ధము జరిగినది. అందుచేత అచ్యుత దేవరాయలు రాజు కాకుండు మార్గములను అళియరామరాయ లాలోచించుచునే యుండెను.

చెల్లప్పద్వారా అచ్యుత దేవరాయలకు వర్తమానము పోయినది. అతనికిగూడ అంతఃపురము తనకు న్యతిరేకమనియు, అళియరామరాయలు సామ్రాజ్య కాంక్షతో నున్నాడనియు తెలిసియే యున్నది. విజయనగరములో తన పట్టాభిషేకము నిర్విఘ్నముగా కొనసాగనేరదని యెంచిన అచ్యుత దేవరాయలు చంద్రగిరినుండి తిరుపతికి విచ్చేసి తన యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధానముననే పట్టాభిషేకమును నిర్వర్తించుకొనెను. అభిషేకోదకము తడియారి యారకముందే కళింగము నుండి ప్రతాపరుద్ర గజపతియు, గోల్కొండనుండి కులీకుతుబ్ షాహియు తన సామ్రాజ్యముపై దండెత్తి కొండవీటి గడి ప్రాంతమునకు వచ్చినారని యతనికి దెలిసినది. అచ్యుత దేవరాయలు విజయనగరమునకు బయలుదేరిన సైన్యముతోనే ఆ శత్రువుల నెదుర్కొని పాఱద్రోలి విజయలక్ష్మిని చెట్టపట్టినాడు.

ప్రభువు విజయనగరము వచ్చునప్పటికి తాననుకొన్న ట్లే స్థితిగతులన్నియు అస్తవ్యస్తముగా నున్నవి. అళియరామరాయలు తనకొక ప్రతిస్పర్థిగా సిద్ధపడినాడు. రాజ్యములోని రాజకీయోద్యోగులు గూడ కొందఱొక పక్షమును మఱికొందఱింకొక పక్షమును వహించిరి. రామరాజు కృష్ణరాయల పుత్రుడే రాజ్యార్హుడని పట్టుపట్టెను. ఎట్టకేలకు అచ్యుత దేవరాయలతోబాటు కృష్ణరాయల పుత్రుడును సామ్రాజ్యమునందు భాగస్వామి కావలయుననియు, ఆ కుమారునికి సంరక్షకుడుగ రామరాజు రాజ్యకార్యములను నిర్వహింపవలయుననియు తీర్మానము జరిగినది. శాంతికాముకుడగు నచ్యుత దేవరాయలు

రాజబంధువులలో పరస్పర వైరము ప్రజాక్షేమ సంధాయకము కాదని యందు కొడంబడెను.

కాని ఈసంధివలన ఇంతవఱకును కృష్ణరాయల యాజ్ఞచే సామ్రాజ్యమును కాపాడుచున్న చెల్లప్పయోటు పడినట్లయినది. కృష్ణరాయలవారికి ఆశయమును కొనసాగదాయెను. చెల్లప్పను పరాభవాగ్ని దహింపజొచ్చినది. అచ్యుతదేవరాయలు చేసిన యీపని కాతఁడు క్రుద్ధుఁడయినాడు. చెల్లప్ప సామాన్యుఁడు గాఁడు. అతఁడు తాఱువకొశైన్దన్ అను కాంచీపుర బ్రాహ్మణుని కుమారుఁడు. అతఁడాయుధోపజీవియై విజయనగర రాజులసైన్యములోచేరి యుద్దండుఁడై వీరనరసింహరాయల కాలమునుండియు దండనాయకుఁడై ప్రకాశించు చున్నాఁడు. ద్రావిడ దేశము నాక్రమించుటలోను తత్పాలనాదులలోను శ్రీకృష్ణరాయల వారికీతఁడు కుడిభుజమై యున్నాఁడు. ద్రావిడుల కీతఁడు చెప్పినది వేదము. ఇక్కడ అచ్యుత దేవరాయలు తాను చెప్పినమాట వినక కృష్ణరాయల యభిప్రాయమునకు గూడ వ్యతిరేకముగా రామరాయలతో సంధి చేసికొన్నాడన్న యీసున చెల్లప్ప ద్రవిడదేశమున కేగి అక్కడి సామంతులను రెచ్చగొట్టి కప్పములు కట్టవలదని తిరుగుబాటు చేయించెను. అచ్యుతదేవ రాయల కిప్పుడు ముల్లుపుచ్చి కొఱ్ఱడచికొన్నట్లయినది.

ఆతఁడు తన బావమఱదియైన సలకము చినతిరుమలరాజు సైన్యాధిపత్యమున దక్షిణదేశ దండయాత్రకు బయలుదేరి చెల్లప్పనుబట్టితేర యత్నించెను. చెల్లప్ప కేరళమునకు బాఱి పోయి తన పరాక్రమమును వెలయింప జొచ్చినాడు. రాయలీ యవసరమున చినతిరుమలరాజును ససైన్యముగా చెల్లప్పపైకి

బంపి తాను కంచి, శ్రీరంగము, చిదంబరము, తిరువణ్ణామలై మున్నగు దైవక్షేత్రములలో ఈశ్వరారాధనతో కాలక్షేపము చేయ మొదలుపెట్టెను. చినతిరుమలరాజు తామ్రపర్ణితటమున చెన్నప్పనుబట్టి బంధించి యచ్చటనే జయస్తంభమును నాటివచ్చెను. ఇట్లు దక్షిణదేశము మరల నచ్యుతదేవరాయలకు వశపడినది. తద్విజయ సందర్భమున అతడు పాండ్యరాజు కూతురును బెండ్లియాడి వారి రాజ్యాలతో సంబంధ బాంధవ్యములను త మేర్పాటు చేసికొనెను.

అచ్యుత దేవరాయలు ద్రావిడ దేశమున చెలరేగిన యల్లరుల నణచివేసి విజయనగరము చేరునప్పటికి కృష్ణదేవరాయల రెండవ పుత్రుడును మరణించుట సంభవించినది. ఈ యంశము రాయకుటుంబమునవారికి తీరని ఖేదమును గూర్చినది. అంతఃపురమంతయు శోకమగ్నమైనది. ఏ చిన్నారి నిసుంగుపై తన ఆశలన్నియు బెట్టుకొని రామరాజు కర్ణాట సామ్రాజ్య తంత్రములను నడుపుచున్నాడో, ఆ కృష్ణరాయ వంశాంకురమే నేడు నిర్మూలమైనది. ఇప్పుడు రామరాజున కాధారమేది? తన బాహుబలమును, బుద్ధి వైభవమును మాత్రమే.

రామరాజు దైవమునకన్న పురుషకారమునకే ప్రాధాన్యమిచ్చు స్వభావము కలవాడు. దైవము నాతడు త్రోసిరాజనకపోయినను బుద్ధి బలమునకు బాహుగర్వమునకే ఆతని దృష్టిలో ప్రాధాన్యము. "దైవతంత్రులైనవారు శాంతికాముకత చేతను, మంచితనము చేతను సామ్రాజ్యమును శాసింప నర్హులుకారు. రాజ్యలక్ష్మి పౌరుష ప్రతాపములకే

శూరత్వమునకే, కూటకార్యాలోచనములకే దాస్యము చేయ గలదు. ఆలోచించి చూచినచో ఆంధ్ర సామ్రాజ్యమునకు సర్వార్హతలు గలవాడు కృష్ణదేవరాయల తనూజుడే. దైవ దుర్విపాకముచే ఆతడు కాలగతి నందినాడు. ఇక రెండవ వారసుడు అచ్యుతరాయల యన్నయగు శ్రీరంగదేవరాయల పుత్రుడైన సదాశివదేవరాయలు. అంతియేకాని యీ అచ్యుత దేవరాయలకు రాజ్యార్హత యెక్కడిది? ఏనాటికైనను సదాశివ రాయలనే రాజునొనర్పవలయును. అచ్యుతరాయల దైవభక్తి చేతను కళాసాహితీ తృష్ణచేతను ఇప్పటికే సామ్రాజ్యము నిర్వీర్యమై పోయినది.'' ఇట్టి భావములతో రామరాజు సదా శివరాయలను చక్రవర్తి నొనర్ప జూచుచున్నాడు. సదాశివ రాయలు అంతగా బుద్ధి తీక్ష్ణతగాని, శక్తి సామర్థ్యములు గాని కలవాడుగాడు; ఆత డెత్తువారిచేత బిడ్డడు. అందుకనియే కృష్ణరాయ లాత డగ్రజుని కుమారుడైనను సామ్రాజ్యస్వీకార మున కర్హుడుగాడని యుపేక్షించినాడు. రామరాజున కిప్పు డిట్టి సదాశివుడు చేతిలోని పాచిక కావలసివచ్చినది.

అచ్యుత దేవరాయలకు సామ్రాజ్యదాహమే యున్న యెడల కృష్ణదేవరాయల కుమారుడు మరణించినందు కెంత గానో ఆతడు మురిసి పోవలసినది. అట్లు జరుగలేదు. ఆతడు తన కుమారుడు మరణించిన దానికన్న మిన్నగానే తన్మరణ మునకు వాపోయినాడు. ఆతనితోబాటు వరదాదేవియు ఎంతగానో చింతిల్లినది. అచ్యుతరాయలు కృష్ణదేవరాయల కుమారుడు యౌవనవంతుడైన పిమ్మట సామ్రాజ్యమున కాతనినే పట్టాభిషిక్తు నొనర్చి తాను దైవచింతనతో వాన

ద్రష్టుడై కాలక్షేపము చేయవలయునని సంకల్పించుకొని యున్నాడు. నేడావాంఛకు విరుద్ధము జరిగినది. ఈశ్వరేచ్ఛ వేఱు. అందుకు తానేమి చేయగల్గును ?

కృష్ణరాయలవారిపై తనకున్న భక్తి గౌరవములు సాటి లేనివి. "ఆతడసాధారణ రాజమార్తాండుడు. కత్తిని గంటమును చేబూని సామ్రాజ్యముతోబాటు సారస్వతమును గూడ వన్నెచిన్నెలతో విస్తరింప జేసిన సాహితీసమరాంగణ సార్వభౌముడాతడు. అతని కళాపోషణ మనన్యసామాన్యము. ఈ నానా దేవతానీకము అనల్ప శిల్పవైభవముతో శిలసిల్లి గుడులు గోపురములు మంటప ప్రాకారాదులు కట్టుకొని కూర్చుండి భక్తుల మనోరథములు తీర్చుటకు అవిశ్రాంతిగా పాటు పడినాడో! ఆయన చేసిన దంతయు అమూల్యమగు దేశసేవ; ప్రజాసేవ. ఈ ఆంధ్ర సామ్రాజ్యరమ, ఈ దక్షిణదేశ సామ్రాజ్యలక్ష్మి, ఈ విద్యానగర మంగళదేవత ఆయనచేతులలో ఎన్నెన్ని వన్నెచిన్నెలతో ఎసలారలేదు!"

## 10

ప్రభుని దృష్టిలో ఒక్కసారి విద్యానగర నిర్మాణము తళుక్కున మెఱసినది. మహమ్మదీయదండయాత్రలలో కాకతి రాజ్యము పతనమైనది. యదువంశ క్షత్రియులగు హరిహర రాయ, బుక్కరాయ సోదరులు విజయనగరాంధ్ర సామ్రాజ్యమును సంస్థాపించినారు. విద్యారణ్యస్వామి ఆదేశముచేత ఆయన తపఃఫలముగా, గాయత్రీపీఠాధిపతి పదము నందియున్న

నాగస్థపతి వాస్తుశిల్ప విద్యానైపుణ్యమున విద్యానగరము నిర్మితమైనది. శ్రీచక్రాకారములో అలనాడీనగరము నిర్మితము. నగరమునందే భాగమున నే యే దేవత లుండవలయునో యాలోచించి తత్తద్దేవతల స్థాపనమును జరిగినది. విరూపాక్షస్వామి, పాండురంగవిఠ్ఠలుడు, హజారరామస్వామి, ఉగ్రనరసింహస్వామి, సాసువగణేశుడు, శ్రీకృష్ణుడు, శక్తి, లక్ష్మి-మున్నగు దేవతలను నాగనాచార్య విద్యారణ్యస్వాములు చిరమాలోచించి యంత్రమంత్రముల బలముతో ప్రతిష్ఠించినారు. ఆ నగరమునకు శంకుస్థాపన మొనర్చిన ముహూర్త బలము, ఆ మహా దేవతల బలము కలసి ఆవిటిని శత్రుదుర్భేద్యము చేసినవి.

హరిహరునకు కంపరాయలు, బుక్కరాయలు, మారప, ముద్దప అని నల్వురు సోదరు లున్నారు. వీరి సాయముతో నాతడు రాజ్యమును నలుగడలకు విస్తరింప జేసినాడు. ఆతడు నాలుగైదేండ్లలోనే తుంగభద్రను దాటి బాదామివఱకు తన రాజ్యమును విస్తరింప జేసి ఆయంశమును శాసనబద్ధ మొనర్చినాడు. బాదామిలో హరిహరరాయలు మహామండలేశ్వరుడనియు, భాషెగెతప్పువరాయర గండడనియు, పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వరు డనియు బిరుదములనందినాడు. ఈయనసోదరుడైన మారప కుంతల దేశ వతంసమగు వనవాసిని పన్నెండు వేల రాజ్యమును జయించి గోమంతశైలమని ప్రసిద్ధిగన్న చంద్రగుప్తి (చంద్రగుత్తి) ని రాజధానిగా జేసికొన్నాడు. అంతే కాదు. పడమటి సముద్రతీరమువఱకుగల రాజ్యమును గెలుచుచుబోయి అచ్చటనున్న గోకర్ణక్షేత్రములో మహాబల

స్వామిని పూజించి ధన్యుడైనాడు. మారపరాయలు కాళీ విలాసక్రియాశక్తి యను శివాచార్యుని శిష్యుడై శైవమత సంప్రదాయమును వృద్ధిపఱచినాడు.

ఆనాటి గిరిదుర్గములలో బలిష్ఠమైన ఉదయగిరి దుర్గమును కంపరాయలు ఆక్రమించుకొని తూర్పుసముద్రతీరమున తమ ప్రభుత్వమును నెలకొల్ప నాందిపలికెను. బుక్కరాయల కుమారుడైన విరూపాక్షరాయలీ దుర్గమునేలిన మొదటిరాజు. ఈ విరూపణ్ణ ప్రతాపము ఉదయగిరిలో శాసనబద్ధమైనది.

బుక్కరాయలు హొయసలరాజ్యము నాక్రమించుకొనుటకు సలిపిన పోరాటములు లెక్కలేనివి. అనేకశ్రమలకోర్చి పట్టువిడువక అతడు [illegible]సముద్రమువఱకున్న కర్ణాటకరాజ్యమును స్వాధీనము చేసికొన్నాడు ఇట్లు విజయనగర రాజ్యమచిరకాలముననే హరిహరసోదరుల కృషిఫలితముగా పూర్వపశ్చిమసముద్రముల నవధిగా జేసికొని ఉత్తరమున బాదామి నుండి దక్షిణమున ద్వారసముద్రమువఱకును వ్యాపించి మహాసామ్రాజ్యమైనది. ఆరాజులుగూడ విజయనగరాంధ్రరాజులు కర్ణాటాధీశ్వరులు అని ప్రసిద్ధిపొందినారు. నాడు వైదిక ధర్మము - ఇస్లాము ధర్మము అనునవి రెండే ప్రధానములు. ఇస్లామునుండి హిందూమతమును రక్షించుటయే నాటి వారి కర్తవ్యము. ఈ యత్నమున హరిహరబుక్కరాయాదులు కృతకృత్యులైనారు. విద్యారణ్యులచేతి గంటము వేదములకు భాష్యములు వ్రాసినది. నాగనాచార్యుని కేలియులి నానా దేవతలకు రూపురేకలు దిద్దినది. కంపభూపతి ఉదయగిరిరాజ్యమునకును, బుక్కప్రభువు హొయసలరాజ్యమునకును, మారప్ప

ఆరగ - మలెనాడు ప్రాంతమునకును, ముద్దప్ప ముళువాయి రాజ్యమునకును నేలికలైనారు. ఇక హరిహరరాయలు విద్యానగరాధీశుడై సామ్రాజ్యమును సుభిక్షముగా పాలించుచున్నాడు.

తరువాత ప్రభునిమనస్సు కుమారకంపరాయల మీదికి పోయినది. ఇతడు బుక్కభూపతి కుమారుడు. ఇతని దక్షిణ దిగ్విజయము అద్భుతమైనది. తుండీర రాజ్యాధిపతియగున రాజనారాయణ సంబువరాయలు విజయనగరసామ్రాజ్యమునకు సామంతుడైనను మధురసుల్తానుతో గలసి విజయనగరమును కూలద్రోయ కుట్రలు పన్నుచుండెను. కుమారకంపరాయలు చంద్రగిరివాడైన సాళువమంగు సైన్యాధిపత్యమున తేజో దుర్నిరీక్షుడై మహాసంగ్రామరంగమున నాతని పీచమణచెను. అంతటితో వదలక మధురసుల్తానునుగూడ నోడించెను. అంతటితో నూరకుండక ఆ దండయాత్రను రామేశ్వరము వఱకును సాగించి విజయనగరసామ్రాజ్యమును సేతువువఱకును విస్తరింపజేసెను. ఆతడు మహావీరుడే కాడు. మహాసాహితీవేత్త. ఆయన భార్య గంగాదేవి యొక సరస్వతీమూర్తి, మహాకవయిత్రి. ఆమె గీర్వాణభాషలో సుమధురశైలితో మధురావిజయమును వ్రాసి తన భర్తృదేవుని యశస్సున కలంకారము కైసేసినది.

అచ్యుతరాయ ప్రభునిమనస్సు ఉబ్బి తబ్బిబ్బైనది. ఈ విజయనగరసామ్రాజ్య మిట్లేర్పడినది. ఇది ఎందఱెందఱు మహానుభావుల తపస్సో! విజయనగరమున జైనదేవాలయములుగూడ నిర్మితములగుటకు అభ్యంతరపెట్టని హరిహరుని

సర్వమతసమదృష్టి ప్రశంసనీయము. తనకు వేసవి విడిదిపట్టైన పెనుగొండదుర్గమును నిర్మించినది బుక్కభూపాలుని మహామంత్రియైన అనంతరాయలు.

తరువాత ప్రభుని హృదయమును మొదటి దేవరాయలు మెఱసినాడు. ఇతని కాలమున ఆంధ్రసామ్రాజ్యమింకను [విస్త]రించినది. తురుష్క పంచపాదుషాల పన్నెండింటితో మాఱు ద్రొక్కి నిలిచి గెలిచిన సాహసము ఈతని కాలముననే. ఇటలీ దేశమునుండి 'నికోలో కోంటి' అను యాత్రికుడు వచ్చి విద్యానగర వైభవమునకు దిగ్భ్రాంతుడైనాడు.

పిమ్మట ఇమ్మడి ప్రౌఢ దేవరాయలు రాజ సింహా-పీఠమున నధివసించెను. ఈతడు సంగమరాజులలో అగ్రగణ్యుడు. ఇతని కాలముననే పారసీకుల రాయబారి 'అబ్దుల్ రజాక్' విజయనగరమును జూడవచ్చి తత్పట్టణ మహోన్నతిని రాయల వారి ప్రాభవమునుజూచి ముగ్ధుడైనాడు. ఈ ప్రభువు సాస్థానమున ధర్మాధికార విద్యాధికారములను నెఱపిన ముమ్మన సాయమునను చంద్రభూషక్రియాశక్తి రాయల మాధ్యస్థ్యమునను శ్రీనాథకవి సార్వభౌముడు గౌడడిండిమభట్టు కంచుఢక్కను బదాబదలుచేయించినదీ ప్రౌఢ దేవ రాయలవారి కొలువుకూటమున నేగదా !

ఆలోచించినకొలది ఆనాటి మహోన్నత దివ్యవృత్త్యములు ప్రభువును విస్మయావిష్టుని జేయుచున్నవి. ఆనాడు రాజమహేంద్రవరము, కొండవీడు, కందుకూరు రాజ్యము లీ రాయల సామ్రాజ్యములో గలసిపోయినవి. ఈతని గజసైన్యమంతు లేనిది. దానిచే నీయనకు గజబేంట (ఏనుగు వేట) రాజు

లనియు, ప్రతాపదేవరాయలనియు బిరుదములు కలిగినవి. ఇతని మహారాజాధిరాజరాజపరమేశ్వర బిరుదము నేతిబీరకాయ కాదు. గజపతులను తురుష్కులను జయించి సామ్రాజ్యవిస్తరణము గెలుపులచేత వాసికెక్కెను. ఇతని భాండాగారమున ఎల్లప్పుడు కుంపలుగోట్లకు పైబడిన సువర్ణముండెడిది. క్విలన్, సింహళము, పులికాటు, పెగు, తెనాసిరమ్ - మొదలగు దేశముల రాజులీతనికి కప్పములు కట్టెడివారు. ఆ మహావైభవమును తిలకించునప్పటికి ప్రభువు కన్నులు తిరిగిపోయినవి. మనస్సులోనే ఒక్క జోహారు పెట్టినాడా చక్రవర్తికి.

పిమ్మట ప్రభుని మనస్సులో సాళువ నరసింహరాయలు మెదలినారు. సామాన్య సామంతునుగా నుండి, ప్రభువై ఉత్సన్నమయి పోవుచున్న విజయనగర సామ్రాజ్యమును పునరుద్ధరించిన వారిలో ఇతడగ్రేసరుడు. జీవితకాలమంతయు యుద్ధములతో నిద్దురలేక గడపవలసి వచ్చిన యీతడు ప్రజలలో స్వధర్మపరాయణత్వమును, దేశసంరక్షణాభిలాషను రేకెత్తించినాడు. శత్రువీరుల నోర్వగల మహావీరు లగుటకు గాను ప్రజలకు సైనికశిక్షణ మిప్పించిన దేశభక్తుడీతడు.

# 11

తరువాత అచ్యుతదేవరాయల మనఃఫలకము మీద శ్రీకృష్ణదేవరాయల ముద్రపడినది. పట్టాభిషిక్తుడైన వెను వెంటనే రాయలు కత్తిదూసి మహమ్మదీయ దండయాత్రల నెదుర్కొనవలసి వచ్చెను. ఆతడు బహ్మనీసుల్తానగు మహ

మ్మదుశాహును ససామంతముగా నోడించినాడు. సామ్రాజ్య మును కలుబరిగె (గుల్బర్గ) బీదరులవఱకు వ్యాపింప జేసినాడు. ఇది యిట్లు జరుగుచుండగనే ఉమ్మత్తూరు పాళియ గాండ్ర తిరుగుబాటు నణచవలసి వచ్చె. ఆతడు తిమ్మరుసు బుద్ధి బలముచే అందును కృతకృత్యుడాయెను. ఇట్లు దక్షిణ కర్ణాటకము సంకెకు తెచ్చుకొన్న పిమ్మట గజపతుల యౌద్ధత్యము నడపరాయలు యత్నించవలసి వచ్చెను. ఉదయగిరి సమాక్రమణముతో నారంభమైన రాయల కళింగ జైత్ర యాత్ర, కందుకూరు, అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునుని కొండ, తంగెడ, కేతవరము — మొదలగు క్షుద్రదుర్గములను స్వాధీనపఱచుకొనుచు కొండవీటికి చేరు కొన్నది. అతికష్టము మీద ఆదుర్గము నాక్రమించుకొనుటయే కాక, వీరభద్ర గజపతిని సకుటుంబముగను జీవగ్రాహముగను పట్టుకొనుట యైనది. తరువాత కృష్ణను దాటి బెజవాడ, కొండపల్లి, కంబముమెట్టు, ఓరుగల్లు, కందికొండ, నలగొండ, దేవరకొండ, రాచకొండ, శంకరగిరి, కనకగిరి, మున్నగు దుర్గములను సాధించినాడా మహావీరుడు. పిమ్మట జమ్మిలోయను తగులబెట్టి సింహాద్రి చేరుకొన్నాడా ప్రభువు. అచ్చట వరాహ నరసింహస్వామి నారాధించుచు ఆఱునెలలవఱకు గజపతి యుద్ధమునకు వచ్చునేమోయని వేచియున్నాడు. అతడు రానందున పొట్నూరువద్ద జయస్తంభమును నాటి విజయ నగరమునకు తరలివచ్చినాడు.

రెండవసారి మఱల కటకముపై వండెత్తిపోగా ప్రతాప రుద్ర గజపతి పాఱిపోయెను. రాయ సైన్యములు కటకమును

గాల్చివేసినవి. తుదకు చేయునది లేక గజపతి తన కూతును రాయలవారికిచ్చి పెండ్లిచేసి సంధి చేసికొన్నాడు. అయిదు సంవత్సరముల కాలము జరిగిన ఈ కళింగ దండయాత్రా సందర్భమున నే శ్రీకాకుళము నందలి ఆంధ్ర మధుమథనుని ఆజ్ఞ చేత రాయలవారు ఆముక్త మాల్యద కావ్యమును రచించినారు. ఈ విధముగా రాయచూరును, తిరునల్వేలి ప్రాంతపు కాటూరును, సింహళమునుగూడ ప్రభువు జయించి వారిచేత కప్పములు గొన్నాడు. రాయల సామంతుడు నాంతరంగికుడు నగు పొన్నంబలనాథతొండమానారు ఆనాడు సింహళప్రభువు నుండి కప్పము తెచ్చుచుండువాడు. అహో! అమేయ ప్రతాపశాలిగదా! రాజాధిరాజ రాజపరమేశ్వర మూరు రాయరగండ బిరుద విభ్రాజితుడు కృష్ణదేవరాయలు!

అచ్యుతదేవరాయల దృష్టిలో భువన విజయ సభాంగణ మొక్కసారి సాక్షాత్కరించినది అష్టదిగ్గజములు దర్శన మిచ్చినారు. వారాంధ్ర తమిళ కర్ణాటక భాషల కవులు. మను చరిత్ర కర్త పెద్దన పెద్ద గద్దెపై నధివసించి.

"నిరుపహతిస్థలంబు రమ
ణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన
భోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ దెలి
యంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృ
తుల్ రచియింపు మటన్న శక్యమే."

అనుచున్నాడు. రాయలవారు మనుచరిత్ర కృతి నందుకొని పెద్దన కాలికి గండపెండెరము దొడిగి పురమేగబోవునప్పుడు బోయలు పల్లకిగొమ్ము నెత్తుకొనుచుండగా తానుగూడ చేయి వేసినాడా గొమ్ముమీద. ఓ కవితాసామ్రాజ్యలక్ష్మీ! ఎంత పూజ నీయనమ్మా!

చిన్నాదేవి యంతఃపురకవి నంది తిమ్మనార్యుడు ముక్కుతిమ్మనయై తేనెలూరు ముద్దుపలుకులతో పారిజాతాపహరణ కావ్యమును వ్రాసి రాయలవారికి వినిపించుచున్నాడు.

"జలజాతాసన వాసవాది సురపూ
జా భాజనంబై తన
ర్చు లతాంతాయుధుఁ గన్నతండ్రి శిర మ
చ్చో వామపాదంబునన్
దొలఁగం ద్రోచె లతాంగి యట్ల యగు నా
థు ల్నేరము ల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచిత
వ్యాపారముల్ నేర్తురే!"

అను పద్యమును పాడునప్పటికి రాయల మోములో ఒక వింత కాంతి తొంగిచూచినది. ఆత డింకొకసారి యాపద్యమును చదివించుకొనినాడు. నాటినుండి రాయలవారి యంతఃపుర ప్రవర్తనములో మార్పు వచ్చినది.

కాళహస్తి మాహాత్మ్యగానము వినబడుచున్నది.

"స్తుతమతియైన యాంధ్రకవి
ధూర్జటి పల్కుల కేల గల్గె నీ
యతులిత మాధురీమహిమ ?"

అని రాయలవారు ప్రశ్నించుచున్నారు.

మఱొక రెవరో అసాధారణ కవితావిలాసి లేచి –

"హా! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమార వారవని
తా జనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సు
ధారస ధారలం గ్రోలుటంజుమీ !"

అని సమాధానము చెప్పి రాయలనానందాబ్ధి నోలలాడించినాడు.

శాపానుగ్రహ సమర్థుడూ "చిద్రూపుడైన సాక్షాద్రు ద్రుడూ" అయి ఈశాన్య సింహాసనము నధివసించిన కందుకూరు రుద్రకవి కాబోలు నాతడు! సరిక్రొత్త పోకడలతో వ్యావహారిక భాషాసమ్మిశ్రముగా తాను వ్రాసిన శృంగార జనార్దనాష్టక మును రాయలవారికి వినిపించుచున్నాడు. తన కతిప్రీతిపాత్ర మగు నాయష్టకము నాసక్తితో ప్రభువు వినుచున్నాడు.

"ఆన పెట్టిన రాకపోతివి ఆయెబో అటు మొన్ననూ
పూని పిలువగ వినకపోతివి పొంచి పోవుచు మొన్ననూ
నేను జూడగ గడచిపోతివి నీటు చేసుక నిన్ననూ
కానిలేరా! కంసమర్దన ! కందుకూరి జనార్దనా !"

"నిన్నరాత్రి చవికెలోపల నీవు చెలి కూడుంటిరా!
ఉన్నమార్గము లన్నియును నే నొకతె చేతను గంటిరా!
విన్నమాత్రమె కాదురా నిను వీథిలో గనుగొంటిరా!
కానిలేరా! కంసమర్దన! కందుకూరి జనార్దనా!"

"చిత్తరంబున మొలక కెంపులు చని నెవ్వతె యుంచెరా!
గుత్తమైన మిటారిగుబ్బలగుమ్మ యెవ్వతె మెచ్చెరా!
చిత్తగించక జీరువారను చెక్కి లెవ్వతె నొక్కెరా!
కత్తిగోరుల; దనుజమర్దన! కందుకూరు జనార్దనా!"

ఈ అష్టకమన్న అచ్యుతదేవరాయలకుగూడ ఎనలేని ప్రీతి. తరువాత నిరువురు కన్నడకవులు, ఒక తమిళకవిగూడ సముచితాసనములమీద అయ్యలరాజు రామభద్రునితో పాటు సమాసీనులై యున్నారు. ఇంకెందఱో విద్వత్కవులతో భువన విజయసభా మండపము నేత్రపర్వమైనది.

పిమ్మట ఒకనాటి శిల్పసదస్సు అచ్యుతరాయల మనోవేదిక కెక్కినది. దక్షిణాపథ శిల్పిలోకమంతయు ఆ సభలో నిండియున్నది. టెంకణాచార్యుడా శిల్పిగణములో నక్షత్రమధ్యముననున్న చంద్రునివలె వెలుగుచున్నాడు. అప్పుడప్పుడే నిర్మితములైన తాడిపత్రి - నాగలాపురములందలి శిల్పౌన్నత్యమునకు ముగ్ధుడైన రాయలు ఆ సర్వశిల్ప విద్యారాశి కానాడు గజోత్సవముచేసి, రత్నహారమును బహూకరించుచున్నాడు. పలువురు శిల్పాచార్యులు టెంకణాచార్యుని శాస్త్ర పరిజ్ఞానమును, శిల్పనిర్మాణదక్షతను ప్రశంసించినారు. పెద్దనాదులు

పవ్యప్రసూన మాలలతో ఆతనిని కై సేసినారు. సభ్యుల హర్ష ధ్వానములమధ్య రాయలవారు సింహాసనమునుండి లేచి, శంక రాచార్యుల వారు పరమ విశ్వకర్మయని ప్రశంసించి ఆయనకు సర్వశిల్ప విద్యారాశి బిరుదమునిచ్చుచున్నామని ప్రకటించి వేవెలుగు వెలుగులవలె మెఱసి పడుచున్న నవరత్నహారమును శంకరాచార్యుని మెడలోవేసి ''ధన్యోస్మి'' అన్నారు.

అచ్యుతదేవరాయల పునఃపాలకమున విజయనగర సామ్రాజ్యవైభవరేఖ లొక్కటొక్కటిగా నిల్లు మధురలాస్యము చేసినవి. ఇట్టి మహాసామ్రాజ్యమునకు నేడెట్టియిక్కట్టులు సంప్రాప్తము లైనవి. రాజకుటుంబము అంతఃకలహములకు నెలవైనది. అళియరామరాయల అండదండలు చూచుకొని మండలాధి పతులు అవిధేయులై ప్రవర్తించుచున్నారు. ఏసమయమున ఎవ్వడు తిరుగుబాటు చేయునో తెలియదు. నానాభాషాకోవిదు లగు విద్వాంసులతోను, కవులతోను కళకళలాడు భువనవిజయ సభాంగణము వెలవెలపోవుచున్నది. నాలుగువేల సంఖ్యకు మిగిలియుండు శిల్పికుటుంబములు వేయి వఱకు దిగజారినవి. కళలకు ఆదరణము సన్నగిల్లుచున్నది. కళానిర్మాతలు పొట్ట పట్టుకొని పోషకులకోసమై కట్టినగడపయెల్ల తిరుగవలసివచ్చి నది. ఆహా! కాలపురుషుని ప్రభావమెంత విచిత్రము. ఇట్టి యాలోచనలతో నురియాడుచున్న ప్రభువువద్ద కప్పుడే గూఢచారియొకడు వచ్చి ''ప్రభూ! గుత్తిదుర్గాసెపతి రాయల వారిమీద తిరుగుబాటు చేసి సైన్యముతో బయలుదేరివచ్చు చున్నా''డని వార్తనందించెను. రాయలవారా మాటల కులికి పడినారు.

నిన్నగాక మొన్ననే - కృష్ణదేవరాయల మరణానంతరము ఇస్మాయిల్ ఆదిల్ శాహుచే నాక్రమించుకొనబడిన రాయచూరుదుర్గమును స్వాధీనమొనర్చుకొని వచ్చుటయైనది. మఱల వెనువెంటనే ఈతిరుగుబాటు. అబ్బా! రాజ్యనిర్వాహణ మెంతకష్టము. ఇది యంతయు వేంకటేశ్వరస్వామి తన భక్తునికి పెట్టు పరీక్షగా రాయలు భావించినాడు. చేయునది లేక సైన్యాధిపతియగు చినతిరుమలుని రప్పించి గుత్తిదుర్గాధిపతిని శిక్షించుటకువలసిన సకలసన్నాహములు చేయించినాడు.

అచ్యుతరాయల సేనలకును గుత్తిదుర్గ సేనానివహము నకును వారము దినములు తీవ్రమైన పోరాటములు సాగినవి. ఎట్టకేలకు దుర్గాధ్యక్షుడు లొంగిపోయి రాయలవారిని శరణు వేడినాడు. ఉభయులకును ఒక ఒప్పందము కుదిరినది. గుత్తి విజయనగర సామ్రాజ్యమున కెప్పుడును సామంతరాజ్యముగా నుండవలసిన దే. సామ్రాజ్యమున నెవ్వరైనను తిరుగుబాటు చేసినచో గుత్తి మండలేశ్వరుడు సమ్రాట్టు క్షమువహించి వారితో పోరాటము సలుపవలసియుండును. ప్రతిసంవత్సరము సామ్రాజ్యమునకు కట్టవలసిన కప్పమును నియమితకాలమున కట్టుచుండవలయును. ఇతర రాజులెవ్వరేని గుత్తి సామంత రాజ్యము నాక్రమింప దలపెట్టినచో సమ్రాట్టు జోక్యము కల్పించుకొని వారినోడించుటకు సిద్ధముగా నుండవలయును. దుర్గాధిపతి యీ కట్టడకు తప్పినయెడల ఆతనిని వెంటనే పద చ్యుతుని జేయు నధికారము సామ్రాజ్యమున కుండును. ఈ యొడంబడికతో రాయలమనస్సు కుదుటబడ్డది. రాజ్యమున కొంతవఱకు శాంతి నెలకొన్నట్లే యాతడు భావించినాడు.

అచ్యుతదేవరాయలు గాఢ దైవభక్తి తాత్పర్యములు గలిగిన రాజచంద్రుడు. మనుష్యుల మనస్సులు మాఱుటకును, వారికికలిగిన ఉపద్రవములుపోవుటకును మానవయత్నమునకన్న దైవానుగ్రహము బలవంతమని ఆయన యభిప్రాయము. ఇట్లనుటచే పురుషప్రయత్నమున కాయనవిముఖుడనికాదు. మానవ ప్రయత్నము క్షేత్రమువంటిదనియు, దైవానుకూల్యము బీజ మనియు నమ్మినవాడా ప్రభువు. జనులలో కొందఱట్లు కాక దైవముమీదనే సర్వభారమును వైచువారుందురు. మఱి కొందఱు దైవమును సరకుగొనక పురుషకారమునకే ప్రాధాన్య మిత్తురు. ఉద్యోగముతోబాటు దైవమునకును సమప్రాధా న్యమునిచ్చు స్వభావముగల యచ్యుతదేవరాయలు అనేక దేవతాక్షేత్రములలో మహాకైంకర్యము లొనర్చెను. కాళ హస్తిలో మండపాదులను గట్టించెను. తిరుపతిలో శ్రీ వేంక టేశ్వరస్వామికిని గోవిందరాజులకును బహాళదానములొనర్చి కైంకర్యములు సలిపినాడు. అహోబిలములోఆయన చేయించిన శిల్పములనేకములు. తాడిపత్రి దేవాలయ శిల్పనిర్మాణమున ఆయన సేవలున్నవి. కంచి మొదలగు తమిళదేశపు దేవాలయ ములందును, సింహాచలాదులందును ఈ రాజన్యుని ప్రోత్సా హమున వెలసిన గోపుర మండప విగ్రహాది శిల్పము లనంతములు.

అచ్యుతదేవరాయలు పురుషకారమునే ప్రధానము చేసికొన్నచో సామ్రాజ్య స్థితిగతు లెట్లుండెడివో చెప్పలేము. దేశములోని కొందఱు ఈయన భగవదారాధనా ధీనుడగుట చేతనే రాజ్యతంత్రము పటిష్ఠమగుట లేదని భావించువారును లేక

పోలేదు. నిక్కముగాలోచించినచో అది కారణమే కాదు. రాయకుటుంబములోని కలహమే రాజ్యము పతనము కాకుండుటకు హేతువు. రామరాజు అచ్యుతునితో సంపూర్ణముగా సహకరించినచో నిట్టిచిక్కులేవియు సామ్రాజ్యమునకు కలిగెడివి కావు.

ప్రభువు మనస్సు మరల దైవక్షేత్ర సందర్శనాయు మైనది. అయిన రాజ్యతంత్రము లెవరు నడపుదురు? రాయల వారి బావమఱుదు లిరువురున్నారు. వారు సలకరాజు కుమారులు - పెదతిరుమలయ్య చినతిరుమలయ్య అనువారు. చిన తిరుమలరాజు సైన్యాధిపత్యము క్రిందనే ఉత్తరభాగము దక్షిణదేశమున సంభవించిన తిరుగుబాట్లు నణచివేసి చెల్లప్పను బంధించి యచ్చట శాంతి నెలకొల్పబడినది. ఇటీవలజరిగిన రాయచూరు ముట్టడిలోను గుత్తిదుర్గాధిపతి పోగరణంచుటలోను సలకముసోదరులు చూపిన శౌర్య ధైర్య సాహసములు అమేయములు. చినతిరుమలుడు చండశాసనుడు ; పరాక్రమశాలి. పెదతిరుమలరాజు కొంతవరకు సౌమ్యుడని చెప్పవచ్చును. తమ్ముని యోద్ధృత్వము, అన్నగారి సౌమ్యత రెండునుకలసి సామ్రాజ్యమున సుఖశాంతులు నెలకొల్పగలవని అచ్యుత రాయ లభిప్రాయపడినాడు. అవసరమయినప్పుడు రామరాజు సాయమునుగూడ అర్థింపవచ్చునని రాయలు బావమఱదులకు చెప్పెను.

కృష్ణరాయల కుమారుని మృతివలన రామరాజు తనతో సహకరించునని ఆ మహారాజు తలంపు. ఇన్నివిధముల దూర దృష్టితో నాలోచించిన రాయలు తాను తీర్థయాత్రలు చేసి

వచ్చువఱకును రాజ్యరక్షణ భారమును కానమఱదుల కప్పగించినాడు.

అచ్యుత దేవరాయల కింకొక యభిప్రాయముగూడ తాను రాజైనప్పటినుండి కలదు. కృష్ణరాయలుగూడ శ్రీ వేంకటేశ్వరస్వామికి పరమభక్తుడే. అతడు విష్ణుచిత్తీయ కావ్యారంభమును వేంకటభర్తృస్తోత్రముతోనే చేసినాడు. అట్టి పరమభక్త శిఖామణియైన రాయలవారి మూర్తిని, తత్పత్ను లగు చిన్నాదేవి – తిరుమలదేవుల మూర్తులను పంచలోహ ములతో నిర్మింపజేసి తిరుపతిలో శ్రీ వేంకటేశుని సన్నిధాన మున నిలుపవలయును. ఈ కార్యము అచిరకాలముననే చేసిన గాని, ఆ ప్రభువునెడ తాను కృతజ్ఞతను చూపినట్లుగాదు. ఇది సర్వులకు ఆదర్శమైన కార్యము కాగలదు. తిరుపతి దేవాలయ ములలో పునర్నిర్మాణాదులు శిల్పసంభరితముగా చేయింప వలసిన యవసరమున్నైతమున్నది. కనుక అచ్యుత దేవరాయలు పత్నీపుత్రులతోను సముచిత పరివారముతోను శ్రీ వేంక టేశ్వరస్వామి సన్నిధికి వెంటనే పయనమై పోయినాడు.

## 12

అళియ రామరాయలకు అచ్యుత దేవరాయలన్న చో బొత్తిగా సరిపడదు. ఇందుకు కారణము లనేకములు. కృష్ణ రాయలు తనకూతురు తిరుమలాంబను రామరాజున కీయదలంచి నప్పుడు ఆప్తులతో సంప్రదించినాడు. అందఱు అంగీకరించినారు. అచ్యుత దేవరాయలు మాత్రమామోదము నీయలేదు. ఈయక

పోగా తన బావమఱదులలో నొక్కని కీయవలసినదని కృష్ణ రాయల నాతడు కోరెను. కాని వీరతాభిమానియైన రాయలు వీరపుత్రియైన తన కూతురు వీరపత్ని కావలయునని యెంచి రామరాజునకే యిచ్చుట సంభవించినది. అప్పటి నుండియు రామరాజునకు అచ్యుతదేవరాయలన్న ద్వేషము.

ఇట్టిస్థితిలో అతడు రాజ్యమున కాధిపత్యము వహించుట రామరాజునిద్వేషాగ్ని కాజ్యాహార మైనది. ఎట్లైన నెట్లైనా తని పదచ్యుతుని చేయుదునాయని యెదురువేచియున్నాఁడు.

అచ్యుతదేవరాయలు తిరుపతి కేగిన పిమ్మట అతనిని పదచ్యుతుని జేయుటకవకాశములు రామరాజునకెక్కువగా సమకూడినవి. విజయనగర (సామ్రాజ్య) మున అచ్యుతదేవ రాయల కున్నంత పలుకుబడి రామరాజునకును గలదు. అతడు తన రాజకీయ తంత్రముల నెల్ల నుపయోగించి సలకము సామరులను రాజ్యకార్య నిర్వహణార్థ మని స్థలాంతరముల కంపెను. సామ్రాజ్యాధిపత్యమునకు అర్హత అచ్యుతదేవరాయలకంటెను ఆతని అన్నయగు శ్రీరంగరాయలవారి కుమారుడగు సదాశివరాయలకే యెక్కువగా గలదని పెద్దలచే నామోదింప జేసెను. ఇట్టి ప్రజామోదమును సంపాదించి సదాశివరాయలను వజ్రసింహాసనము నధిరోహింపజేసినాడు. అటుపిమ్మట సదాశివరాయలకు తాను ప్రతినిధిగా నుండి అధికారమును చెలాయింప మొదలిడెను.

రామరాజు తొలుదొల్త విజయనగరమున కీలకస్థానములలో నున్న ప్రభుత్వోద్యోగులను తొలగించి ఆ తావులలో

తన అనుయాయులను నియమించినాడు. తరువాత తన కను కూలురు కారనుకొన్న కొందఱు సామంతులను మండలాధీశు లనుగూడ పదవిచ్యుతులను జేసి, ఆ తావులలో తన అనుయాయు లను నిలిపినాడు. తన తమ్ము లిద్దఱిలో తిరుమలరాజును గుత్తి దుర్గమునకును, వేంకటాద్రిరాజును కందనవోలునకును సామంతు లను జేసెను. తన పినతండ్రులైన తిమ్మరాజును, కొండరాజును ఆదవేని దుర్గాధిపతుల నొనర్చినాడు. పెమ్మసాని తిమ్మనాయ కుని గండికోటకును, హండే హనుమప్ప నాయకుని అనంత పురమునకును అధికృతులనుగా జేసెను. వీరిద్దఱు రామరాయల కత్యంతము విశ్వాసపాత్రులైన మిత్రరత్నములు. పెనుగొండ మండలాధీశుడైన విరుపణ్ణను ఆ పదవి నుండి తీసివేసి తనకు నిక్కలి శరీరవాహుడైన కృష్ణప్పనాయకు నక్కడ మండలాధి పుని చేసినాడు. కృష్ణప్ప నాయకుని తమ్ముడైన తిమ్మప్ప నాయకుని విజయనగర కోశాధ్యక్షు నొనర్చినాడు.

రామరాయలు వివాహము కాకమునుపు గోలుకొండ కుతుబ్ సాహి కొలువులో దండనాయకుడుగా నుండువాడు. ఆ కారణమున మహమ్మదీయులన్నచో ఆదరముకూడ అతనికి గలదు. బిజాపురము నేలుచుండిన ఇబ్రహీంఆదిల్ శాహు తన పూర్వు లనుసరించు షియాధర్మమును వీడి సున్నీ సంప్ర దాయమును స్వీకరించెను. ఈ సందర్భమున ఆతడు తన కొలువులోనున్న షియాధర్మావలంబులైన మహమ్మదీయులను గూడ ఉద్యోగములనుండి తీసివైచెను. రామరాజు వారిలో దాదాపు మూడువేలమందిని తన కొలువులో జేర్చుకొనినాడు.

అచ్యుతదేవరాయలు తిరుపతికి సమీపమునందున్న తిరుచానూరుసందలి శిల్పాచార్యులచేత శ్రీకృష్ణదేవరాయల వారి పంచలోహమూర్తిని నిర్మింపజేసినాడు. అక్కడే చిన్నాదేవి తిరుమలాదేవుల లోహమూర్తులను గూడ నిర్మింపజేసినాడు. ఆమూర్తులు చక్కని కిరీటములతోను కంఠహారములతోను, కర్ణభూషలతోను, కటిబంధములతోను మిగుల సుందరములుగా తయారైనవి. ఈ మూర్తి నిర్మాణమున ప్రధాన సూత్రధారుడైన లోహశిల్పప్రవీణ గంగాధరస్థపతిని అచ్యుత ప్రభువు గొప్పగా సత్కరించి ఆవిగ్రహములను ఎగువ తిరుపతి లోని శ్రీవేంకటేశ్వరస్వామి కెదురుగా సంస్థాపింపజేసినాడు. ఈ మువ్వురును ఆ స్వామికి చేతులు జోడించి నమస్కరించు చున్నట్లు శిల్పి తీర్చినాడు. ఈ సమస్తకార్యములను పూర్తి చేసికొని తీర్థయాత్రలు ముగించుకొని అచ్యుతదేవరాయలు రాజధానికి విచ్చేసినాడు. రాయలవారు ఎప్పటికేని తిరిగి రాజధాని చేరుకొన్నను దైవసందర్శనము చేసికొనిదే ప్రాసాదములో నడుగు పెట్టడు. ఆ నియమము ననుసరించి ప్రభువు భగవదర్చనోచితమైన వేషముతో హజారరామస్వామి దేవాలయమున నడుగుపెట్టెను. రామరాయల యేర్పాటువలన ఆతని అనుచరులు అచ్యుతరాయలవారిని పట్టుకొని కారాగార బద్ధు నొనర్చిరి.

అప్పటికే రాజకీయోద్యోగులు పెక్కురు రామరాయల వారి పక్షమువారయినందున అచ్యుత ప్రభువు మిన్నకుండ వలసివచ్చినది. క్రమక్రమముగా రామరాజు తన యభిప్రాయ ముల నెల్లను సదాశివరాయల రాజకీయముద్రతో శాసనముల

కొనస్సి సామ్రాజ్యమును పాలింపజొచ్చినాడు. రాజకుటుంబములో నుప్పతిల్లిన ఈ అనైకమత్యము అలజడి కారణముగా ద్రవిడ దేశపు అమరనాయకులు, సామంతులు, ఉమ్మత్తూరు పాళెయగాండ్రు మొదల తిరుగుబాటు చేసిరి. అచ్యుత దేవరాయలు బద్ధుడగుట, సదాశివ దేవరాయ రామరాయల పాలకులుకాక వారి తిరుగుబాటునకు హేతువే. అచ్యుత దేవరాయలు పాండ్యరాజ దుహితను పెండ్లాడి బాంధవ్యము నెరపియున్నందున ఆ పాండ్యరాజు, తద్బంధువర్గము గూడ రామరాయు. సదాశివరాయల పని పట్టవలయునని పూనిరి. వారు శస్త్రములు కట్టుటలేదు. బొక్కసము వెండి బంగారములతో నిండారియుండెను. అయినను రామరాజు అధైర్యపడలేదు. అతడు పౌరుషప్రతాపములు మూర్తికట్టిన సాహసిగదా. గుత్తి, కందనవోలు, ఆదవేని, అనంతపురము, పెనుగొండ మున్నగు దుర్గములనుండి కూడ ధనసాహాయ్యము చేకూరు నేర్పాట్లను చేసికొన్నాడు. ఇట్లు వలసిన యేర్పాట్లన్నియు చేసి దక్షిణ దేశపు తిరుగుబాట్ల నణంచుటకు తగు సైన్యముతో రామరాజు బయలుదేఱిపోయెను. పోవునప్పుడు తిమ్మప్పనాయకునికి తమ కెప్పు డెంత ధనము కావలసిన నంత ధనమును కోశమునుండి తీసి పంపుచుండవలయునని ఆజ్ఞాపించెను.

అచ్యుత దేవరాయలు పదచ్యుతి నందినప్పటి నుండియు సామ్రాజ్యముననేమి, విజయనగరముననేమి జరిగిన మార్పులు అసంఖ్యాకములు. బొక్కసములోని విత్తమంతయు దక్షిణ దిగ్విజయయాత్రకే వ్యయమై పోవుచున్నది. నగరములోని

కళాసంస్థలు ప్రభుత్వమునుండి రావలసిన ద్రవ్యము రానందున క్షీణింపజొచ్చినవి. ఈ దెబ్బ వేలసంఖ్యలో విద్యార్థులను, వందల సంఖ్యలో ఆచార్యులను పోషించుచున్న శిల్పవిద్యాగురుకులమునకు గాఢముగా తగిలినది. గురుకులపు తలుపులు మూయవలసిన గతి పట్టినదన్నను అనవచ్చును. ప్రాస్తుత విద్యాసంస్థలు కొన్నిమాత్రము అవి జనాదరణ విస్తృతమైయుండున నెల్లెట్లో నడుపబడుచున్నవి. సంగీత విద్యాసంస్థ, నాట్య విద్యాసంస్థ అసలే పనిచేయుట లేదు. జనాధారములు లేని గురువులెన్నాళ్ళని ఉచితముగా విద్యాదానము చేయగలరు? కృష్ణరాయలనాడు మహావైభవము ననుభవించిన యీ సంస్థలు అచ్యుత దేవరాయలనాడు అవసానము కొంతవఱకైనను నిలుపుకొన్నవి.

సదాశివరాయలవారు నజని [illegible] ప్రతిష్ఠించిన పిదప నాలుగైదేండ్లలో అంతయు తాఱుమాఱైనది. ఈ వ్యత్యాసమునకు, పాపము! ఆ ధర్మ ప్రభువు హేతువుగాడు. ఆయనచుట్టు వెలసిన గ్రహములు, రామరాయల అధికార వాంఛ, తదనుయాయుల ఆసుర స్వభావము – మున్నగునవి కారణములు. సదాశివరాయలు ఈ సామ్రాజ్యాధిపత్యమును తాను కోరుకొననేలేదు. రామరాజు బలవంతముననే తాను రాజయినాడు. ఆతనియిష్టమును బట్టియే అన్నియు జరుగవలయును.

నాట్యవిద్యా సంస్థ మూలబడుటతో కుప్పాయమ్మను నిరుత్సాహ మావరించినది. దానికి తోడు దేశమున దుండ

గింద్ర ప్రాబల్య మెక్కువై పోయినది. త్రాగిననీళ్ళను కూడ కడుపులో నిమడనిచ్చునట్లుగ లేరు అధికారులు. బయటికి క్రక్కించి యితరుల కిమ్మనుచున్నట్లున్నారు. ఈ దిగులుతో ఆమె మంచముపట్టినది.

కష్టాయమన్న్నను పద్మిని వ్రాసిన దీక్ష దుర్ఘట మైనదని తెలియును. ఎన్నో రీతుల వడుల నుజల మంపలించిచూచినది. కాని లాభము లేకపోయినది. ఆపిల్ల తన పట్టుదలను వీడ నన్నది. ఒకనా డెవ్వరో బైరాగి వచ్చి చుట్టుప్రక్కల యిండ్ల యందున్న వారి చేతులలోని రేఖలనుబట్టి రాబోవు శుభా శుభములను చెప్పుచున్నాడు. కొందరి శరీరరోగములు, మానసికవ్యాధులు కుదురుటకు యంత్రములను, తాయెత్తులను కట్టుచున్నాడు. కొన్ని రకముల మూలికల నాతడు తాయెత్తు లలో పెట్టి యిచ్చును. అవి అత్యద్భుతముగా పని చేయును. వీనిమాట యెట్లున్నను, ఆతడు చెప్పుచున్న భూతకాలిక వృత్తాంతము లన్నియు నిజములే యగుచున్నవి. భూతము యథార్థ మగుచున్నప్పుడు భవితవ్యము మాత్ర మెందుకు సత్యము కారాదని ప్రజ లాతని వెంటబడి చేతులు చూపించు కొని తృప్తి పడుచున్నారు. ఇట్టి వ్యక్తులను సాక్షాద్దైవత ములుగాకూడ భారతదేశము భావించును గదా! ఎంత గొప్పవారైనను, పురుషప్రయత్నముమీద గట్టినమ్మక మున్నవారైనను చాటుగనో, మాటుగనో ఇట్టివారివలన తమ భవిష్యమును తెలిసికొన నుత్సహించు చుందురు. రాజకీయుల కిట్టి పిచ్చి మఱీ యెక్కువ.

కుప్పాయమ్మకూడ పద్మిని చేతిని ఆ బైరాగికి చూపించి నది. ఆత డామె హస్తరేఖల కెంతయో మెచ్చుకొన్నాడు. కుప్పాయమ్మ పద్మిని జన్మవృత్తాంత మెక్కడ బయట పడునో యని "మా అమ్మాయినిగూర్చి జరిగిపోయిన సంగతులు చెప్ప వలదు. భవిష్యత్కాలమున నామెకు కలుగు ఫలితము లను చెప్పిన చాలు." నని బైరాగిని కోరినది.

ఆత డామె విద్యాచాతుర్యమునుగూర్చి యున్న దున్నట్లు చెప్పినాడు. ఆమె జీవిత ప్రథమపాదమున కొన్ని కడగండ్ల నెదుర్కొన్నను, ద్వితీయపాద మత్యంత సుఖావహము కాగలదని యాతడు జోస్యము చెప్పెను. ఇంకను దీర్ఘముగ ఆలోచించి సునిశిత రేఖాపరిశీలన మొనర్చి కడ కామె ఒక మండలాధీశుని భార్య కాగలదని యా సన్యాసి వచించెను. ఈ మాటలు పద్మినికిని కుప్పాయమ్మకును ఆశ్చర్యము కొల్పి వించినవి. కుప్పాయమ్మ "మేము భోగమువారము. మాలో పెండ్లిండ్లు లేవు. ఇట్టి స్థితిలో నాపిల్ల ఒక మండలాధీశునికి భార్య యెట్లు కాగల?" దని సన్యాసి నడిగినది. ఆత డా విషయము లన్నియు మ మ్మడుగవలదు. మాకు తోచిన దేదో చెప్పినాము. నమ్మిన నమ్ముడు. లేకున్న లేదు. అని యాగ్ర హించి తనదారిని బోయెను.

కుప్పాయమ్మ కీ సంగతి నిజమగు నేమో యను నమ్మ కము కొలదిగా నేర్పడినది. పద్మిని కిది యంతయు అయోమయ మనిపించినది. తా నొక భోగపుపిల్ల, తన్నేమి? ఒకమండలా ధీశుడు చెట్టపట్టు టేమి? సమాజ మిట్టి పరివర్తనమున కనువైన స్థితిలో లేదు. కానిమ్ము. వేచి చూత మని పద్మిని

తనయ, సర్వవిద్యా కుశల ఒక మండలాధీశ్వరునికి భార్య యగుటకన్న తన కింక కావలసిన దేమి? పాప మలనాడా సన్న్యాసిని తాను హేళన చేసినది. వేశ్యల కేమి, పెండ్లిండ్లేమి, అని పరిహసించినది. కాని నేడు విధి విధానమెంతగా అనుకూలించుచున్నది. కుప్పాయమ్మ సంతోషము పట్టజాలక పద్మినికి కృష్ణభూపతి యభిప్రాయము నెఱిగించి, ఆతనిని పెండ్లాడి సుఖింప వలసిన దనియు, అట్లయిన పెండ్లి చేసికొన వలయుననెడి నీ సంకల్పము గూడ సిద్ధించుననియు చెప్పినది.

కాని పద్మినికి కుప్పాయమ్మ మాట నచ్చలేదు. ఆమెకు కృష్ణప్పనాయకుని ప్రవర్తనము పూర్తిగా తెలియును. "అతడు త్రాగుబోతు. స్త్రీలోలుడు. మోసములకు పుట్టినిల్లయిన స్వార్థపరుడు. ఇప్పటికే అతనికి ఒకరిద్దఱు భార్యలు, ఒకరిద్దఱుంపుడుకత్తెలు నున్నారట. ఆతడు వారి నెన్నోరీతుల బాధించుచుండునట. ఇట్టివానినా, తాను వివాహమాడుట. ఆతడు తన్నుంపుడుకత్తెగా చేసికొనుటకే మొదట తలంచినాడు గదా. ఆ పదకము పాఱనందున పెండ్లాడుదునని ఇప్పుడీ క్రొత్తయెత్తు వేసినాడు. అంతియేకాని; వివాహ వ్యవస్థమీది గౌరవముచేత కాదు. ఇట్లాలోచించుకొని "బహుపత్నీకుడగు వానిని నేను పెండ్లాడనమ్మా!" యని పద్మిని - తల్లికి చెప్పినది. కుప్పాయమ్మ ఎన్నోరీతుల పద్మినికి నచ్చజెప్పజూచినది. కాని లాభము కలుగలేదు.

కడకు కుప్పాయమ్మ కూతునుబుజ్జగించుచు ఇట్లన్నది:

"నీవు సిరి రా మోకాలొడ్డుచున్నావు. అసలు మన భోగము వాండ్రను పెండ్లాడుటకు సిద్ధపడువారెవ్వరు! ఏదో

నీయదృష్టము పండి భగవంతుడు కృష్ణభూపతి కీ బుద్ధి పుట్టించినాడు. ఆతడెంతో సాహసముచేసి నిన్ను పెండ్లాడ నిశ్చయించుకొన్నాడు. నీవేమో అందు కంగీకరించుటలేదు. బాగుగా నాలోచించుకొనుము. నీవు చిన్నపిల్లవు. ఇంకను నీబుద్ధి వికసించలేదు. జీవితములోని కష్టనిష్ఠురతలు నీకిప్పుడే యర్థముకావు. నీసంకల్పమునకు నీవిట్లు పెండ్లిచేసికొని హాయిగా నుండవచ్చును. ఆకృష్ణభూపతికి అళియరామరాయల వారి ప్రాపకమున్నది. ఆతడింకెంతో యభివృద్ధి గాంచవచ్చును. మా చిన్నారితల్లివికదూ! నామాట వినుము.” పద్మిని యింక దాపనేల యని తన మనోనిశ్చయమును తల్లికెరిగించినది:

“అమ్మా! నన్ను నీవు పెండ్లాడ ప్రోత్సహించుచున్నందుకు సంతోషము. కాని నే నెట్టిస్థితిలోను కృష్ణప్ప నాయకుని వివాహమాడను. విధియనుకూలించి యదృష్టము కలసివచ్చినెడల వీరభద్రప్పను పెండ్లాడుదును. ఆతనికి నే నేనాడో నా హృదయమును సమర్పించుకొనియున్నాను. ఒకపక్షమున ఆతడు నన్ను వరింప నిష్టపడనిచో బ్రహ్మచారిణిగా నే కాలము పుత్తును. ఇది ముమ్మాటికిని నా ఆత్మనిశ్చయము. నా మనోభీష్టమును నా యోగక్షేమములకై పరితపించు కన్నతల్లికి నివేదింపక యెట్లుందును. ఇది యందరాని కోర్కెయే కావచ్చును. అయినను నాఅంతఃప్రబోధమునకు భిన్నముగా జరుగవీలులేదు.”

పద్మిని మాటలు కుప్పాయమ్మకు విభ్రాంతి కలిగించినవి. ఆమె యిట్లన్నది :

"తల్లీ! విరుపణ్ణమండలాధిపతి పదవి యూడినదని నీకు తెలియదా? అట్టి కుటుంబములో ప్రవేశించి నీ వేమి బావుకొనియెదవు. ఆ వీరభద్రప్పకును నీకును వయస్సులో గూడ తేడా లేదే. కనుక కృష్ణప్పను వరించుటే మంచిదని నాకు తోచుచున్నది. ఎందుకోగాని వీరభద్రప్ప నిన్ను పెండ్లాడుననీ నాకు నమ్మకముగా లేదు."

ఎంత చెప్పినను పద్మిని తల్లిమాట విననేలేదు. తుదకు కుప్పాయమ్మ కాగ్రహము కలిగియున్నది :

"నీవు నీ భవితవ్యమును పాడుచేసికొనుచున్నావు. ఆ సన్న్యాసి జోస్యము పండబోవునప్పటికి నీకీ దుర్బుద్ధి యేల పుట్టుచున్నదో తెలియకున్నది.

"తన నిన్నెన్వడును పెండ్లాడడు. నీ బ్రతుకు బుగ్గిపాలు కావలసినదే. నిన్నింతదానిని చేసిన నాకే యెదురుతిరుగుచున్నావు. నీ కర్మము నీవనుభవింపుము."

అని యామె వెంటనే "తన కూతురు బహుపత్నీకుని పెండ్లియాడుట కిష్టపడుట లేదనియు, ఇష్టములేని పెండ్లి సుఖావహము కాదనియు, ఎన్నోరీతుల నచ్చజెప్పుచు సవినయముగా కృష్ణప్పకు వర్తమానమంపినది.

కాని ఆ కాముకున కది నచ్చునా? తాను బహుపత్నీకుడయినందున తన్నామె పెండ్లియాడ నంగీకరింపకున్న దనుమాట కృష్ణప్పకు మిక్కిలియు సహింపరానిదైనది. "ఈమె ఏకపత్నీవ్రతునకు భార్య కావలయునను నాశగూడ పెట్టుకొన్నదా? కానిమ్ము, చూతము." అని యాతడు పద్మిని తన్ను పెండ్లాడ

కున్నచో రాగల యాపదల నెదుర్కొనుటకు సిద్ధపడవలెనని హెచ్చరించుచు కప్పాయమ్మకు కబురంపెను.

కృష్ణప్ప నాయకుని జెవదింపు తల్లిదండ్రులకు భయ హేతువైనది. వారు సరిగా అన్నమని తినుటలేదు. నిద్రయని పోవుటలేదు. కృష్ణప్పనుండి ఏ క్షణమున ఎట్టి కీడు మూడునో యని వా రుద్విగ్నులై యున్నారు.

కృష్ణప్ప కొక యాలోచన తట్టినది. "ఆస్థాన రాజనర్తకి పదవి ఎంతో గౌరవముతో కూడినట్టిది. ఆ పదవియం దున్న వారికి ప్రభుత్వరక్షణాదు లుండును. ఏ నెవ్వరుగాని యిష్టము వచ్చినట్లు మాటాడుటకుగాని, ఇష్టము వచ్చినట్లు చేయుటకు గాని వీలుండదు. కావున ముందుగా పదవినుండి తొలగింప వలయును. అప్పు డామె సామాన్య వేశ్య, లేదా దేవదాసి మాత్రమే యగును. అప్పుడు తన యాటలు సాగించుకొనుటకు వీలుండును." ఇట్లు పన్నాగము పన్ని తిమ్మప్పనాయకునితో గూడ గలసి యాలోచించి తగినసమయమున సదాశివరాయలతో నిట్లు మనవి చేసెను.

కృష్ణప్ప : మహారాజా! రాజ్యవ్యవహారము లేమియు బాగుగా లేవు. ప్రభువులు క్రొత్తగా రాజ్యమునకు వచ్చుట యైనది. వచ్చీరాకముందే దక్షిణదేశము తిరుగుబాటు చేసినది. అళియరామరాజులవారు ఆ తిరుగుబాటు నణంప నేగినారు. అవసరమైనప్పుడెల్ల బొక్కసములోని రొక్కము నంపుచుండ వలయునని కోశాధిపతి కాజ్ఞ యిచ్చినారు. కోశాధిపతి యేమి చేయును? వారు

నోట నాలుక లేనివాడు. ఉన్నంతవఱకు రొక్కమును బంపుచునేయున్నాడు. విరుపణ్ణపాలనములో కోశపు టాదాయము సద్వినియోగమైనట్లు లేదు. ఆతడు ప్రభుత్వధనముతో లేపాక్షిలో దేవాలయములు గట్టి అందు దివ్యశిల్పముల వెలయించుచున్నట్లు తెలియుచున్నది. అందుకు మన శిల్పవిద్యాగురుకుల స్థపతులు తోడ్పడుచున్నారు. ఏది యెట్లయినను యుద్ధమునకు ద్రవ్యమును బంపక తప్పదు. యుద్ధములో గెలిచిననే మనకు ప్రభుత్వాదాయము పెరుగ గలదు. లేకున్న కోశము క్షీణించును గదా. ఇట్టి స్థితిలో మనము కొన్ని ఖర్చులను దగ్గించుకొను టవసరమేమో యని నాకును తమ్మునికిని తోచుచున్నది. ఆపై దేవరవారి యిష్టము.

సదాశివ : ఔను. మీరు చెప్పినట్లు రామరాయలకు విత్తమంపకున్న యుద్ధమున పరాజయము వాటిల్లవచ్చును. నగరములోని యుద్యోగులకు జీతబత్తెములీయక తప్పదు కదా! ఇట్టి స్థితిలో ఏ ఖర్చులు తగ్గించుకొన దగినవో ఆలోచింపుడు.

కృష్ణప్ప : కొన్ని వినోద వ్యయములను ప్రభుత్వము తగ్గింపవచ్చును. సారస్వత విద్యాసంస్థల నట్లుంచి, శిల్పము, వాస్తువు, సంగీతము, నాట్యము, మున్నగు వినోదకళా సంస్థలను కొన్నాళ్ళవఱకు కట్టివేసిన బాగుండునేమో. ప్రభువు లాలోచింప గోరెద. వీనిని కొన్నాళ్ళపాటు నిలిపి వేసిన మనకు మాసమునకు ఇరువదివేల వరహాలైనను మిగుల గలవు.

సదాశివ : ఆపత్సమయమున ఆలోచించుచు కొంత కాలము వినోద వ్యయమును తగ్గించుట. ప్రభుత్వమును చేయునట్టి పనియే. కనుక నూటికిద్దరును ఆలోచించి ఆజ్ఞాపత్రికలను వ్రాసి పంపుడు. దానిని రాజముద్ర వేసి అమలు పరిపింతము.

కృష్ణప్ప : ప్రభువులు చిత్తగించు నెడల ఇంకొక్క యుద్దేశ్యము గూడ నా కున్నది. మన మెట్లును నాట్యకళాసంస్థను రద్దు చేయుచున్నాముగాన, ఆస్థాన నర్తకితో మాత్ర మేమి యక్కఱ ? దేశ మల్లకల్లోలముగా నున్నప్పుడు రాజుగారు రాజనర్తకితో వినోదించుచు వేలకొలది విత్తమును బాడుచేయుచున్నారని ప్రజ లనుకొందు రేమో యనియు నాకు భయముగా నున్నది. అట్టి నింద నందుట భృత్యులుగా మేము సహింప లేనట్టిది. ఇంకొక విశేషము. పద్మిని దేవి అచ్యుతరాయల వారి కిష్టురాలు. అళియరామరాయలవారు అచ్యుత దేవరాయల కిష్టులైనవారి నందఱిని తొలగించుచునే దేవరవారి కీ సామ్రాజ్యమును గట్టి పెట్టినారు. రాజ్య వ్యవహారములు చక్కబడ్డపిదప మన మింకొక నర్తకి నెన్నుకొనవచ్చును. దేశమున నట్టువరాండ్రకు కొఱత లేదు గదా.

ప్రభువున కీయాలోచనము సముచితమనియే తోచినది. దేశ ముపద్రవము నెదుర్కొనవలసి వచ్చినప్పుడు రాజు వినోద పరాయణు డగుట ప్రజలు మన్నింపని విషయము గదా. అతడు కృష్ణప్ప కుతంత్రము నూహింప లేక మిాదుమిక్కిలి వాని బుద్ధి

వైభవమునకు ప్రభుభక్తికి లోలోన మెచ్చుకొనుచు యోగ్యుడైన హితచింతకుడు లభించినాడనుకొని యిట్లన్నాడు.

సదాశివ : మీ యూహ సముచితముగానే యున్నది. కాని పాప మామె స్త్రీ గదా. ఈ పదవి లేనిచో ఆమెకు జీవనాధార మేముండును !

కృష్ణప్ప : ఆమె వేశ్య గదా ప్రభూ ! ఆమె కీ పదవి గౌరవ మునకు మాత్రమే. వేశ్యలు కులవృత్తిచే నెంతయైనను సంపాదించి మహాభోగము లనుభవింపజాలుదురు. ప్రభువులకు తెలియని దేమి ? అందును ఆమె త్రిలోకసుందరి! పురుషాకర్షణ మంత్రవిద్య !

సదాశివ : సరే కానిండు.

అని ప్రభువు అంగీకారసూచకముగా తల యూపెను. కృష్ణప్ప తిమ్మప్ప నాయకు లిరువురు తమ యెత్తు పారినందుకు సంతోషించిరి. కళాసంస్థల కేనాడో ధన మిచ్చుట నిలిచి పోయినది. ఇప్పుడు కృష్ణప్ప చేసినపని దానికి రాజాజ్ఞను సంపాదించుట మాత్రమే.

పద్మిని కృష్ణభూపతిని వివాహమాడ తిరస్కరించినప్పటి నుండియు కుప్పాయమ్మ దేహవ్యాధియు, మనోవ్యాధియు నానాటికి బలము లగుచున్నవి. ఆమె శల్యావశిష్ట యైనది. తన మరణానంతరము పద్మినీదేవి స్థితి యేమగునో ఆమె కెవ్వరును రక్షకులు లేరు. ఉన్న వెల్లను ఆమెకు తా నిచ్చిన విద్యా విశేషములును, జన్మతః సంక్రమించిన గుణములు మాత్రమే.

ఇంకొక్కటి స్వచ్ఛమైన శీలము. ఎన్నో ఆపన్నములను పాటించ నామె దీక్ష పూని యున్నది. ఈ లోకము నాకిక తావ నిచ్చునా ? ఈ పిచ్చిపిల్ల ఎక్కి మెట్టిని కంటకాకీర్ణమగు మార్గమున కాలు పెట్టినది. ఆమె నిత్య పరిభావ ప్రేమము. ఓ విరూపాక్షస్వామీ ! ఓ హజార రామచంద్రా ! ఓ సాక్షి గణేశా ! దుష్టమర్దన మొనర్చి భక్తుల సంరక్షించు బాహు నో ఉగ్రనరసింహస్వామీ ! నా విజ్ఞప్తి నాలకించి కాపాడరా! కృష్ణప్ప బారినుండి రక్షింపరా ! అని పాపము దీనస్వరముతో మొఱపెట్టుకొనుచుండులోపల, అస్థాన దాసపుత్రి పనిమనిషి పద్మినీదేవిని తొలగించినామను ఆజ్ఞాపత్రము నొక భటుడు తెచ్చి యిచ్చెను. ఆ దుర్వార్తను వినుటతోడనే ప్రాణమున్న ప్రాణములు పైకి పైకే లేచి అనంతవిహాయసములో కలసి పోయినవి.

పద్మినీదేవి యిప్పు డొంటరికత్తె: పనవిలేని పడతి. ఆమె నెవ్వ రేమి చేసినను చేయవచ్చును. ఆమె అచ్యుత దేవరాయల కాదరపాత్రురా లయినందున నిప్పటి ప్రభుత్వమున నామెకు స్థానము లేదు. ఏసమయమునందైని కృష్ణప్ప నాయకు డామెను చెఱబట్టవచ్చును. ఇట్టి విషమఘట్టములో ఆమె నాదరించువా రెవ్వరు ? ఆపిల్ల పెల్లు విలపించినది. ఎంత యేడ్చినను ఆమెకు ఉపాయము తోచలేదు. తన కింతవఱకును భృత్యులుగానున్న వారునైతము ఆమెను వీడి మఱల రాజోద్యోగములు సంపాదింప తహతహ లాడుచున్నారు. ఆమెను పడుపు వృత్తికి దిగవలసినదని సలహాలిచ్చువారేగాని, ఆమె శీలమును సంరక్షించుకొను నుపాయము చెప్పువారు లేరు. ఆమె మనోనేత్రమునకు

హఠాత్తుగా వీరభద్రప్ప దర్శనమిచ్చినాడు. ధర్మమూర్తియగు విరుపణ్ణ సాక్షాత్కరించినాడు. ఆ రెండు వెలుగులు అగపడుటతో చీకటి తొలగి ఆమె కొక క్రొత్తవదారికనట్లయినది. అప్పటి కప్పుడే ఆమె లేపాక్షికి ప్రయాణమై పోయినది.

# 14

వానలు కురిసి కురిసి వెను కాడినవి. చెఱువులు దొరువులు నిండిపోయినవి. క్షేత్రములు సస్యములతో కళకళలాడుచున్నవి. శారద రాత్రులు చంద్రికాధవళములై సజ్జనుల యశస్సుల ననుకరించుచున్నవి. ఆశ్వయుజ పూర్ణిమాచంద్రుడు మింటనొలువుచేటి లేపాక్షిలోని కూర్మాద్రిమీది వీరేశ్వరాలయ శిల్పశోభను తిలకించుచున్నాడు.

వెన్నెలరాత్రులలో స్థపతి కుటుంబమును, తక్కిన శిల్పులును కూర్మాద్రి చఱియపై సమావేశమై ఆయా విషయములను మాటాడుకొనుచుందురు. ఈ సందర్భమున విరుపణ్ణ వీరణ్ణలును సకుటుంబముగా వచ్చుటకి విచ్చేసి పాల్గొనుటయు కలదు. కన్నప్ప వచ్చునని వేఱ చెప్పనక్కఱలేదు. పురుషోత్తమ స్థపతి ఒక్కొక్కనాడే వేవో శిల్పసంబంధులు, తాత్త్వికములు నగు విషయములను వారి కుపన్యసించుచుండును. వాని నాలించుటకు గ్రామస్థులును అప్పుడప్పుడు వచ్చుచుందురు.

స్థపతిభార్య వీరాంబ పెందోట రాజ కుటుంబమున బుట్టినట్టిది. ఆమె మార్కండేయ ప్రభునకు రెండు తరములు

పూర్వుడగు కేదార విభుని కూతురు. రాజకుటుంబములోని దైనందున గాబోలు అనేక కళలు, విద్యలు బాగుగా పట్టు పడినవి. చిత్రకర్మములో ఆమెకు చక్కని ప్రవేశమున్నది. ఆమె పరమరమణీయముగా బొమ్మలను గీయగలదు. వానిని పలురంగులతో సుందరము లొనర్పగలదు. వీరాంబలోని ఈ చిత్రవిద్య లక్ష్మికి గూడ సంక్రమించినది. లక్ష్మి చిన్నప్పటి నుండియు నేలమీదను గోడలమీదను ఏవేవో బొమ్మలను గీయుచునేయుండెడిది. ఆమెకున్న చిత్రకళా సంస్కారమును గుర్తించిన తలిదండ్రులు ఆమె కాయా చిత్ర లక్షణములను బోధించుచు దానికి ప్రోది కూర్చెడువారు.

నాడు లక్ష్మి శిల్పములోని ప్రాథమిక లక్షణములైన విగ్రహముల కొలతలను గూర్చి చెప్పుమని తండ్రిని కోరినది. తక్కిన శిల్పవిద్యార్థులును ఆ విషయమును బలపఱచినారు. పురుషోత్తమ స్థపతి చెప్పుటకుపక్రమించినాడు.

శిల్పశాస్త్రములో ప్రతిమాలక్షణము ముఖ్యమైనది. ఆలయమునందు ప్రధానముగా ఆరాధింపబడునది దైవప్రతిమయే గావున, అది సౌందర్య సర్వస్వముగను, భావప్రపూర్ణముగను ఉండవలయును. మూలవిరాణ్మూర్తి సలక్షణము, సౌందర్యోపేతము కానిచో, అది ఉపాసకుల దృష్టి నాకర్షించి వారి మనోరథములను తీర్పజాలదు. ఒక్కొక్క సుందరపురుషుని గాని, స్త్రీనిగాని చూచినప్పుడు మన దృష్టి అనుకోకుండగనే వారిపై నెట్లు పడునో, అట్లే సుందరమగు దేవతామూర్తిని గాంచి, నప్పుడును మన బుద్ధి తద్దర్శనారాధనములకై పరువెత్తి ఆ పను

లొనర్చి ధన్యము కావలయును. అందుకే శివ విష్ణ్వాది పురుష ప్రతిమలు కాని, లక్ష్మీ సరస్వత్యాది స్త్రీమూర్తులుగాని సలక్షణమగు నంతర్బాహ్య సౌందర్యమునకు నివాసభూములై యుండవలయునని శాస్త్రమును, సంప్రదాయమును చెప్పుచున్నవి.

దేవ మనుష్యాది భేదములతో నుండు స్త్రీ పురుషులలో గాని, తిర్యక్కులగు పశుపక్ష్యాదులలోగాని ఏయే యంగము లెంతెంత ప్రమాణములో నుండవలయునో, అంతంత ప్రమాణములో నవి యున్నప్పుడే అందచందములకు నెలవులై అవి ప్రకాశింపగలవు. తలకు దగిన శరీరము; శరీరమునకు దగిన చేతులు, కాళ్ళు, పొట్ట మొదలగు నంగములు, ఆయంగములకు దగిన వ్రేళ్ళు మొదలగు నుపాంగములు. అట్లే ముఖ ప్రమాణములకు దగిన ముక్కు, చెవులు, కన్నులు, పెదవులు, గడ్డము, చెక్కిళ్ళు మున్నగునవి యున్నప్పుడే స్త్రీ పురుషులు చక్కనివారనిపించుకొందురు. అట్లుకాక శరీరమును మించిన పెద్ద తల, తలకు దగని దేహము, కుఱుచ చేతులు, మిడిగ్రుడ్లు లేక-గుంటకన్నులు, వొంకికాళ్ళు, చొట్టముక్కు, చేట చెవులు, వ్రేలాడు పెదవులు, పెదవిమీఱినపండ్లు- మొదలగు అవలక్షణములున్నవారు ఏవము కలిగించుచుందురు. వారికున్న ఆ అవయవ లక్షణములు అవలక్షణములనే వారికి కూర్చుచుండును. ఇట్టి వారి ఆకారములు ఆకర్షణీయములు, ఆరాధనీయములు కావనుట మనకు అనుభవసిద్ధమే. కావున సర్వలక్షణ సంపన్నములగు శరీరములుగల స్త్రీ పురుషులు సృష్టిలో అరుదుగా నుందురు. అందుకే కాళిదాసు "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" బ్రహ్మదేవుని ప్రవృత్తి

సమస్తగుణములను ఒక్కచో నుంచునదిగా నుండవని నుడివి నాడు. అట్టి గుణసమగ్రతను చేకూర్చుటకే ప్రతిమాలక్షణములో కొలతలు ముఖ్యములయినవి.

అంగుళపరిమాణము పరమాణువునుండి క్రమాధికముగా పెరుగుచుండును. అణువులో పదునాఱవ వంతు పరమాణువు. ఇది యోగీశ్వరుల సునిశితదృష్టికి మాత్రమే గోచరించును. ఎనిమిది పరమాణువులు ఒక త్రసరేణువు. ఎనిమిది త్రసరేణువులు ఒక వాలాగ్రము, లేక రోమాగ్రము. ఎనిమిది వాలాగ్రములు ఒక లీక్ష. ఎనిమిది లీక్షలు ఒక యూక. ఎనిమిది యూకలు ఒక యవ ప్రమాణము. ఎనిమిది యవలు ఒక ఉత్తమమానాంగుళము. ఏడు యవలు ఒక మధ్యమ మానాంగుళము. ఆఱు యవలు ఒక అధమ మానాంగుళము. కనుక మానాంగుళము ఉత్తమ మధ్య మాధమ భేదములతో నుండు నని తెలియవలయును. ఇట్టి యంగుళముల సంఖ్యతోనే కిష్కువు, ధనుర్ముష్టి, దండము — మున్నగు ప్రమాణము లేర్పడు చున్నవి.

మానాంగుళమేకాక మాత్రాంగుళముగూడ నొకటి శిల్పశాస్త్రప్రసిద్ధమై యున్నది. ప్రతిమా నిర్మాణముచేయు శిల్పాచార్యునియొక్కగాని, చేయించు యజమానుని యొక్కగాని, కుడిచేతి నడిమివ్రేలి నడిమికనుపు పరిమాణమును మాత్రాంగుళమందురు. దీనిని దేహాంగుళమనికూడ వాడుదురు. ఈ మాన-మాత్రాంగుళముల సంఖ్యతో దశతాళ నవతాళాది భేదములతో నొప్పు వివిధ ప్రతిమలు నిర్మింపబడవలయును. ఈ తాళములుగూడ ఉత్తమ మధ్యమాధమ భేదములుగలవై యున్నవి.

ఉత్తమ దశతాళమున ప్రతిమ పొడవు నూటఇరువది నాలుగంగుళములు. ఈ ప్రమాణము ప్రధాన దైవతములగు బ్రహ్మ విష్ణు శివాది మూర్తుల కుండవలయును. మధ్యమ దశ తాళమున ప్రతిమ పొడవు నూటయిరువది అంగుళములు. ఈ ప్రమాణము — శ్రీదేవి, భూదేవి, పార్వతి, దుర్గ, సరస్వతి - మున్నగు స్త్రీ దేవతామూర్తులకు తగినట్టిది. అప్పుడు ముందు చెప్పిన పురుషమూర్తులకన్న స్త్రీమూర్తులు నాలుగంగుళ ములు కుఱుచలై "దేవుని చెవులవఱకు వచ్చు నెత్తుగలదై దేవి యుండవలయు"ననెడి మను ప్రభృతి శిల్పబ్రహ్మలు చెప్పిన లక్షణమునకు సరిపడును.

అధమదశతాళమున మూర్తి పొడవు నూట పదునా అంగుళములు. ఈ ప్రమాణముతో సూర్యచంద్రులు, ఏకాదశ రుద్రులు, అష్టవసువులు, గరుడ శేష స్కందాదుల మూర్తులు నిర్మితములు కావలయును. నవ-నవార్ధ తాళ ప్రమాణములతో నవగ్రహ కుబేరాదుల మూర్తు లుండును. అష్టతాళము మానవులకును, ఋషులకును, యోగులకును నుపయోగింతురు. ఈ తాళము లెవరెవరి కెట్లెట్లుండవలయు ననుటలో శిల్పశాస్త్ర కారులలో అభిప్రాయ భేదములున్నవి. మన దాక్షిణాత్యు లెక్కువగా మయ శిల్పశాస్త్రము ననుసరించి తాళప్రమాణము లను పాటించుచుందురు. ఔత్తరాహులీ ప్రమాణముల నంతగా పాటించునట్లు లేదు.

లక్ష్మి: అసలు తాళమనగా నేమి నాయనా!

పురుషోత్తమస్థపతి: చేతి బొటనవ్రేలి చివరినుండి తర్జని చివరి వఱకును చాచినచో, ఆ పరిమాణమును ప్రాదేశ

మందురు. అట్లే మధ్య మాంగుళ్యగ్రము వఱకును గల పరిమాణమును తాళమనియు, అనామికాగ్రము వఱకును గోకర్ణమనియు, కనిష్ఠాగ్రము వఱకును వితస్తియనియు నందురు. వెరసి ప్రాదేశ - తాళ - గోకర్ణ - వితస్తులని వీనికి పేరులు. వీనిని శిల్ప - వాస్తు - యజ్ఞాదుల పరిభాషలలో వాడుచుందురు.

లక్ష్మి : అసలు ఏ మూర్తికైనను ముఖాదులు ఏ యే ప్రమాణములలో నుండవలయునో స్థూలముగా నాకు చెప్పుము నాన్నా ! మొన్న నేను రెండు బొమ్మలను గీయగా, అమ్మ అవి-ప్రమాణ యోగ్యతకు దూరముగా నున్నవని ఆక్షేపించినది. ఆ ప్రమాణము లేమో చెప్పు మనగా, మిమ్ముల నడిగి తెలిసికొమ్మన్నది.

పురుషోత్తమ : ఔనమ్మా! ఏ తాళములో నున్న విగ్రహము నకైనను, చిత్తరువునకైనను ముఖాదులు దిగువ రీతిగా నుండవలయును. ఇందుకు ఉదాహరణముగా నవతాళ ప్రమాణములోని మూర్తుల అవయవ ప్రమాణములను వివరించెదను; వినుము.

నవతాళమున పాదాది మస్తకాంతము ప్రతిమ పొడవు నూటయెనిమిది యంగుళములని మయ మతము. ఇందు మస్తకము నాలు గంగుళములు. ముఖము పది రెండంగుళములు. ఈ పది రెండంగుళములు మూడు సమభాగములు చేసికొని భ్రూమధ్యమునుండి కేశపర్యంత మొక భాగమును, ముక్కున కొక భాగమును, నాసిక

నుండి గడ్డము చివరివఱ కొక భాగమును ప్రత్యేకించు కొనవలయును. అప్పుడు చిబుక - నాసికా - భ్రూ - ఉపరి భాగములు సమములై సౌందర్యమును పొసగించును. కంఠము పొడవు నాలు గంగుళములు. కంఠమునుండి స్తనమధ్యము వఱకు పది రెండంగుళములు. అచ్చటి నుండి బొడ్డువఱకును, పది రెండంగుళములే. బొడ్డునుండి మర్మావయవమూలము వఱకును నంతియే ప్రమాణము. అటనుండి మోకాలివఱకును ఇరువది నాలుగంగుళములు. మోకాలినుండి చీలమండలవఱకును అంతియే పొడవు. చీలమండల నుండి పాదాంతము నాలు గంగుళములు. మనము సర్వాంగ సుందరుడగు పురుషుని చూచినచో ఆతని యవయవము లీ ప్రమాణములకు సరిపడియుండును. అట్టివాడు సాముద్రిక శాస్త్రలక్షణములకు సరిపడి శుభంకరుడగును. విలక్షణుడు భయంకరు డగును.

అంతట నొక శిల్పవిద్యార్థి ఈ అంశము నింక వివరముగా చెప్పుమని కోరినాడు. పురుషోత్తమస్థపతి పై యర్థము నే మఱల నిట్లు వివరించెను :

"విగ్రహము ఎత్తు ఎంత యున్నను దాని నీ రీతిగా తొమ్మిది భాగములుగా విభజించుకొనవలయును. గడ్డము చివరి నుండి కేశములవఱ కొక భాగము. కంఠాది స్తనమధ్య మొక భాగము. స్తనాది నాభిపర్యంత మొక భాగము. నాభ్యాది మర్మావయవపర్యంత మొక భాగము. అటనుండి మోకాలి వఱకును, మోకాలినుండి చీలమండ వఱకును రెండేసి రెండేసి

భాగములు. ఇప్పటి కెనిమిది భాగములైనవి. మిగిలిన తొమ్మిదవ భాగమును మూడువంతులు చేసికొని కేశాదిమస్త కాగ్రమున నొక వంతును, కంఠమున నొక వంతును, గుల్ఫము నుండి పాదాంతమున నొక వంతును ప్రత్యేకించుకొనవలయును. అప్పుడా మూర్తి అందచందములతో నొప్పును. ఇంతవఱకు నేను ప్రతిమయొక్క దైర్ఘ్యమును గూర్చి మాత్రమే చెప్పినాను. దాని స్థౌల్యమును గూర్చియు ముఖాదుల వెడల్పులను గూర్చియు చెప్పవలసిన దెంతయో కలదు. వానిని గూర్చి మఱొకసారి చెప్పెదను. ఇప్పుడు చెప్పిన ప్రకారము కాక, ప్రమాణములు తాఱుమాఱగుచో మూర్తి సౌందర్యము చెడిపోవును. ఈ యంశములను గుర్తుంచుకొని నీవు చిత్రరచన చేయుము లక్ష్మీ! అప్పుడు నీ బొమ్మలు ఎవరి యాక్షేపమునకును గుఱికావు. ఇట్లే పశుపక్ష్యాదులకును లక్షణము లూహింపవలెను.''

"ఇక నేను బొమ్మలువేసి అమ్మను ఓడింపగలను నాన్నా!" అన్నది లక్ష్మి.

మాచమూర్తి లక్ష్మి అందగత్తె యని సూచించుటకు "బొమ్మలు వేయుటకు నీకు శాస్త్రము, లక్షణపరిజ్ఞానము ఎందుకు లక్ష్మీ! నీ అవయవముల పరిమాణములే నీకు చాలును. నాన్నగారిని వృథా శ్రమ పెట్టినావు" అన్నాడు.

లక్ష్మి కోపమును నటించుచు మూతిముడుచుకొని "నీ కన్న చక్కగా లేనులే'' అని యవ్వలి మొగమైనది. ఆమె కాప్రక్క జక్కన్న కనుపించినాడు. ఆమె మోము వికసించినది.

లక్ష్మీమాచమూర్తుల మాటలను గమనించుచున్న లలిత లక్ష్మీవలన మాచమూర్తి పొందిన తిరస్కారమునకు జాలిపడినది. లలిత పాంచాలవరమునుండి వచ్చిన విద్యానిధి కూతురు. ఆమె లక్ష్మీయంత యందగత్తె కాకపోయినను సౌందర్యహీన మాత్రముకాదు. తెలివి తేటలలోను, శీలము లోను తండ్రినిపోలి పుట్టినదావె. ఆవులించిన ప్రేవులు లెక్క పెట్టగలదు.

జక్కణ హంపణ లిద్దఱును నాగమంగళ శిల్ప గురుకుల మున శిక్షితులైనవారు. వారిదివఱకు తమ గురువులనుండి ఇట్టి యుపన్యాసములను వినియే యున్నారు. వానికన్న పురుషోత్త ముని ప్రసంగము సుగమముగా నున్నదని వారాతని బోధన శక్తిని లోలోన మెచ్చుకొన్నారు.

ఇంతలో కన్నప్ప "శిల్పిదొరా! ఈ దేవాలయాలు, ఈ దేవుళ్ళు, పూజలు, ఏటికోళ్ళు — మనకు ఎలా మోక్షం ఇస్తాయో తెలియదు, అది కాస్త చెపుదురు సామీ!" అని అడిగినాడు.

విరుపణ్ణకుగూడ ఆలయస్వరూప రహస్యము, దైవ మూర్తులు మోక్షప్రదములగుటలోని తత్త్వము పురుషోత్తమ స్థపతి ముఖతః వినవలయునను కోరిక గలదు. కావున నతడు ప్రధానాచార్యుని ఆ విషయములను గూర్చియు—ఈ నామ రూపాత్మక జగము, ఇందలి జీవులు సగుణోపాసనముచేసి నిర్గుణ తత్త్వమును పొందుట యెట్లు వానిని గూర్చియు బోధింప వలసినదని కోరినాడు. ఆ యాచార్యు డిట్లు చెప్పదొడగినాడు.

కార్యరూపమైన ఈ జగత్తు పుట్టుటకు కారణ మొక టున్నది. అది సత్తు (నిత్యము) చిత్తు (జ్ఞానము) ఆనందమే స్వరూపముగా గలది. దానినుండి నామరూపాత్మక జగము పుట్టినది. అనగా జగత్తులో అనేక రూపములు నామములు కలవన్నమాట. పరమేశ్వరుని మనము అష్టమూర్తియని వర్ణింతుము. ఆ అష్టమూర్తులును జగమునకు ఉపాదానకారణమైన భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము — అను పంచ భూతములును, దివారాత్రులను చేయు సూర్యచంద్రులును, యజమానుడు (కర్త, లేక జీవుడు). ఈ యెనిమిదింటికి మించి జగ మనునది వేఱుగా లేదు. నానావిధగుణములు, వికారములును పంచభూతములనుండి పుట్టినవే. మనోబుద్ధి చిత్తాహంకారములుగూడ సూక్ష్మములగు పంచభూతములనుండి పుట్టినవే. వీని నన్నింటిని అపర ప్రకృతి యందురు. జీవుడు పర ప్రకృతి. ఉభయప్రకృతులను శాసించువాడు ఈశ్వరుడు.

సూర్యచంద్రులను పంచభూతములను వేఱుపఱచినచో మిగిలిన జీవాత్మయే పరమేశ్వరుని అష్టమమూర్తి యగుచున్నది. ఇది సచ్చిదానంద స్వరూపము. అనగా నిత్యత్వము, జ్ఞానము, ఆనందమే జీవునికిని స్వరూపమన్నమాట. పరమాత్మ తత్త్వముగూడ సచ్చిదానందమే యని చెప్పుకొన్నాముగదా! అందువలన వస్తుతః ఈ జీవునికిని ఆ పరమాత్మకును భేదము లేదని అద్వైతము. ద్వైతము జీవాత్మ పరమాత్మలకు భేదము చెప్పును.

ఏకమును, సత్తును అయిన పరమాత్మ తత్త్వము మాయావిలాసముచేత — అనగా ప్రకృతిచేత బహునామ

రూపములతో భాసిల్లుచున్నది. అఖండ పరబ్రహ్మమునకు ఆ యా నామరూపములను కల్పించుకొనుట ఉపాసకుల ముక్తి కోసమే; సాధకుల హితముకోసమే. పరమ నిర్గుణ తత్త్వమును సామాన్య సాధకులు ఉపాసింపలేరు. కావున ఒక్కొక్కరు తమ తమ రుచిభేదములనుబట్టి శివవిష్ణ్వాదులను, శక్తిగణపత్యాదులను ఆరాధించుచుందురు.

ఈ నానావిధరూప కుసుమములు శిల్పశాఖనుండి పుట్టినవే. అట్లే అనంతనామ సుమములను పూచునట్టిది సాహిత్యశాఖ. ఈ నామ కుసుమములకు బీజములు అక్షరములు. వానిని బీజాక్షరములనియు అనవచ్చును. ఇవి శబ్దబ్రహ్మము నుండి పుట్టినవి. కనుక బీజాక్షరయుక్త సాహిత్యశాఖ శబ్ద బ్రహ్మ ప్రధానము. శిల్పశాఖ రూపబ్రహ్మ ప్రధానము. నానావిధములైన నామసుమములతోడను, రూపపుష్పముల తోడను అలరారు శాఖోపశాఖలతోగూడిన జగద్వృక్షమునకు మూలము అఖండ నిర్వికార నిత్యపరబ్రహ్మము. కనుక ఆ పరబ్రహ్మము సాకారమును, నిరాకారమును. సగుణమును నిర్గుణమును. మనము చెప్పికొన్న అష్టమూర్తి సగుణబ్రహ్మ స్వరూపమే. నిరాకార బ్రహ్మప్రాప్తికి సాకారోపాసనము హేతువు.

దేవాలయములో రూపవంతుడగు నొక దేవు డుండును. ఆ దేవుడు నానాబీజాక్షరములతోగూడిన మహాయంత్రమున సంస్థాపితుడు. ఆతనిని ఒక మంత్రముతోను, ఒక ధ్యానశ్లోకముతోను స్మరింతుము. ఇంక ననేకరీతుల షోడశోపచారపూజాసహస్ర నామార్చనలతో ఆరాధింతుము. ఈ మంత్రయంత్రాదులు

శబ్దబ్రహ్మాధారములు. ఆ దేవుని దివ్యస్వరూపము శిల్పబ్రహ్మ సముద్భవము. ఇట్టి సాకారోపాసన మనుజుని క్రమముగా నిరాకారములోనికి తీసికొనిపోయి అరూపమున వానిని విడుచును. మంత్రమయ శబ్దబ్రహ్మోపాసన అశబ్దములోనికి గొంపోయి— కడకు "అశబ్దము - అస్పర్శము - అరూపము - అవ్యయము- అరసము - అగంధము - అనాది - అనంతము-ధ్రువము"నగు నిర్గుణ పరబ్రహ్మతత్త్వమున జీవుని గలిపివేయును. లేదా ఆ పరబ్రహ్మమే యాతడగును. ఇదియే మోక్షము. అట్టి ముక్తుని శీతోష్ణసుఖదుఃఖాదులు బాధింపవు. అతడు జగద్దుఃఖముల కతీతుడు; అమృతుడు. ఈ అమృతస్థితిని మానవులకు చేకూర్చుటకే శిల్పయోగము ప్రవర్తించినది. శిల్పయోగులందుకే కీర్తి కామన [illegible] తమువీడి జగద్ధితముకోసము ప్రవర్తించుచున్నారు. దేవాలయ స్వరూః రహస్యములనుగూర్చి యింకొకసారి చెప్పెదను.

పురుషోత్తమస్థపతిచేసిన సూత్రప్రాయమగు తత్త్వోపన్యాసము శ్రోతల మనస్సులపై మాసిపోని ముద్రలు వేసినది. విరుపణ్ణ దానియందలి గంభీరభావముల నర్థము చేసికొన్నాడు. అతనికి సగుణోపాసనతత్త్వము బోధపడినది. నామరూపములను ఇట్లు భావించి ఉపాసించుటచే నామరూపాత్మక జగమునకు హేతుభూతుడైన పరమేశ్వరుని మానవు లెట్లు పొందగలుగుదురో విరుపణ్ణకు తెలిసినది.

కన్నప్పకు భాష యర్థము చేసికొనుట కష్టమైన దన్నమాటయేగాని, భావము బాగుగనే బోధపడినది.

దృష్టితో దేవతలను ఎంద జారాధించుచున్నారు ?" అని వా రెల్లరు తమలో తాము ప్రశ్నించుకొనిరి.

# 15

విరుప ప్రభువున కిప్పుడు పెనుగొండ మండలాధిపత్య మును, విజయనగర కోశాగారాధ్యక్ష పదవియును పోయినవి గదా. ఈ విషయములు కామాక్షీ వీరణ్ణ వీరభద్రులకు తీఱని వంత గూర్చినవి, శిల్పులును ప్రజలును ఇట్టి సత్పురుషునకు జరుగవలసిన పని గాదిది యని చింతిల్లిరి. "రాజకుటుంబ వ్యవహారము లట్లున్నవి. దాని కెవ్వరేమి చేయగలరు? అళియ రామరాయలు ఎవ్వరిని గద్దెనెక్కింప దలచునో, ఆతడు సింహా సనము నధిష్ఠించి తీరవలయును. ఎవ్వరిని రాజపదమునుండి తొలగింపదలంచునో, ఆతడు తొలగి తీరవలయును. ఇందు కెవ్వరును ఏమియును చేయజాలరు. ఇప్పుడు జరిగినది అంతియే గదా. విజయనగరమునకు చుట్టుప్రక్కలనున్న మండలాధీశు లందఱవలెనే విరూపాక్షుడును తన స్థానమును కోల్పోయినాడు. అందాతని లోపము లేమియు లేవు. ఆతడు సత్ప్రభువని పేరు పొందినాడు. ఆతని రాజ్యము సౌరాజ్యమైనది. ఆతని పాలనములో చిట్టిచీమయు కడుపులో నీరు కదలకుండ సుఖించి నది. ఇప్పు డట్టిదంతయు తాఱుమాఱైనది. దైవదుర్వి పాకము."

విరుపణ్ణకు మాత్రము ఈ పదవీచ్యుతి విచారహేతువు కాలేదు. దైవాదేశముగా లభించిన యవకాశము నాతడు

సద్వినియోగము చేసికొనినాడు. ఇప్పుడా పదవి పోయినను ఆతడు చింతింప నక్కఱలేదు. ఆతడు చేసిన పనికి పరమేశ్వరుడును, ప్రజలును సంతసించినారు. కనుక ఆతడందుకు చింతిల్ల వలసిన పనిలేదు. ఆతడు శీతోష్ణములయందును సుఖదుఃఖముల యందును, లాభనష్టముల యందును సమదృష్టిగల స్థితప్రజ్ఞుడు. కనుకనే ఆతనికి లవలేశమైనను చింత కలుగలేదు.

విశేషించి తాను భగవదారాధనలో నెక్కువగా కాలము పుచ్చుట కిదియొక సదవకాశమని యాతడు భావించినాడు. అట్టి యవకాశమును గల్పించిన అళియరామరాయల వారికిని ఆ పాపనాశేశ్వరస్వామికిని ఆతడు మనస్సులోనే కైమోడ్పులు పెట్టినాడు. తన్ను పదచ్యుతుని జేయుటలో కృష్ణప్ప నాయకునికి గూడ భాగముండునని విరుపణ్ణకు తెలిసినను, ఆతడు కృష్ణప్పపై ఈసు చెందలేదు.

*   *   *   *

లేపాక్షిలో శిల్పకార్యములు శరవేగముతో సాగిపోవు చున్నవి. ముఖమండప నాట్యమంటపముల యందలి శిల్పముల నిర్మాణము జక్కణ్ణ హంపణ్ణలకు అప్పగింపబడినది. జక్కణ్ణ కలియుగ విశ్వకర్మ జక్కణాచార్యుని వంశమువాడు. ప్రత్న ఋషి గోత్రోద్భవుడు. జక్కణ్ణ నాటినుండియు ఆ కుటుంబము వారు ప్రతితరమునకు ఒక్కొక్కనికి జక్కణ్ణ యని పేరు పెట్టు కొనుచున్నారు. ఈ జక్కణాచార్యుని ప్రధాన స్థాపత్యమున మండప స్తంభములు తీర్పబడవలయునని పురుషోత్తమ స్థపతి నిర్ణ యించినాడు. ఆయనకు కొందఱు తమిళాంధ్ర శిల్పుల తోడ్పా టుండును. వేలాపురీ దేవాలయ స్తంభ శిల్పములకు మఱిసిన

విరుపణ్ణ తత్సదృశ స్తంభములను ఇంకను కొంగ్రొత్తరీతులతో మలచవలయునని సంకల్పించుకొనియున్నాడు. ఈ సంకల్పము నెఱింగియే పురుషోత్తము డందులకు జక్కణ హంపణలను నియమించుటయైనది.

స్తంభశిల్పములు నానావిధముల తీర్పబడుచున్నవి. ఒకదానితో ఇంకొక్కదానికి పోలికయే లేదు. అందలి లతా బంధములు, నాగబంధములు, కోలాటపుబొమ్మలు పరమ మనోజ్ఞములు. అందు కొన్ని చతురశ్రస్తంభములు. కొన్ని ఆఱు కోణములవి. ఇంకకొన్ని అష్టాశ్రములు. ఈ స్తంభము లలో బ్రహ్మకాంత, విష్ణుకాంత, రుద్రకాంతాది నానాభేదము లున్నవి. ఆ భేదములతో నొప్పు నానాస్తంభముల నా శిల్పి సత్తములు గండరించుచున్నారు.

నాట్యమండపము అఱువదినాలుగు స్తంభములతో నొప్పునట్లు పథకము వేయబడినది. ఒక స్తంభమును పోలి యింకొక స్తంభముండుటకు వీలులేదు. ప్రతి స్తంభమును ఒక ప్రత్యేక శిల్పముతో ప్రకాశింపవలసినదే. నాట్యరంగమండప ములో నాట్యశిల్పములకు ప్రాధాన్యముండవలయును గదా! అఱువదినాలుగు స్తంభములలోను అతిముఖ్యములు పది రెండు. వానిలో ఒకదానిమీద భృంగీశ్వరుడు ఒక నాట్యభంగిని ప్రద ర్శించుచున్నాడు. ఆ స్తంభమున కెదురుగానున్న మఱొక కంబముమీద రంభ భృంగిప్రదర్శిత నృత్యభంగివిలాసమును అలవఱచుకొనుచున్నది. రంభ ఎంతయోగ్య శిష్యురాలు! గురువుచూపిన భంగిమను పొల్లుపోనీక నేర్చి పొనరిపించు కొన్నది.

ప్రప్రథమ నాట్యవిద్యాచార్యుడు నటరాజైన పరమ శివుడు గదా. తరువాత ఆయన శిష్యులైన ప్రమథగణములలో నంది, భృంగి, రిటి ప్రభృతులు ఆ విద్య నభ్యసించి లోకమున ప్రచారము చేసినారు. వీరిలో నందికి తండువు అని పర్యాయ నామ మున్నది. ఆతడు లోకమున కుపదేశించిన విద్య తాండ వము. శివుడు ప్రథమాచార్యుడయినను తండువు ప్రచారకుడై నందున నీ నృత్యమును తాండవ నృత్య మన్నారు.

రంగమండప స్తంభములమీద శివతాండవ కేళిని జక్కణ హాంపణలు అత్యద్భుతముగా తీర్చిపెట్టినారు. ఒక స్తంభము మీద చతుర్ముఖ బ్రహ్మ మద్దెలను వాయించుచున్నాడు. ఇం కొకట తుంబురుడు వీణను మీటుచున్నాడు. నంది హుడు క్కను ప్రయోగించుచున్నాడు. సూర్యుడు నాదస్వరమును, దత్తాత్రేయుడు తాళమును, చంద్రుడు మున్నగువారు తత్త ద్వాద్య విశేషములను వాయించు నా నాట్యసభాదృశ్యమెంత మనోహరముగా నున్నది.

ఇక పార్వతీ సమేతుడైన తాండవేశ్వరమూర్తి శిల్పము చూచుటకు రెండు కన్నులేమి చాలును! భువనమును ఆంగి కాభినయ మొనర్చుకొని, సమస్త వాఙ్మయమును వాచికము చేసికొని, చంద్ర తారకాదులను ఆహార్యము గావించి సాత్వి కాభినయమునకు తానే తానకమై నెఱపు నా పరమేశ్వరుని తాండవకేళికి ప్రక్కనున్న పార్వతి ముగ్ధురాలై పోయినది. ప్రధానములైన ద్వాదశ స్తంభములమీదనున్న దేవతాకోటి రసతన్మయమైనది. విరుపణ్ణ వీరణ్ణలు ఈ భవ్యశిల్పసౌందర్యము

నకు కనులప్పగించి స్థాణుత్వము నందినారు. కామాక్షి తన భర్త చేయించుచున్న యీ శిల్పములకు ఉబ్బితబ్బిబ్బగు చున్నది. కన్నప్ప ఈ శిల్పదర్శనము చేయునప్పుడు పొందిన అనుభూతి ఆతనికే యెఱుక. ఆతని కన్ను లానందజల బిందువు లతో నిండిపోయినవి. నిమీలితాక్షుడైన విరుపణ్ణ నోటినుండి హఠాత్తుగా మహిమ్నస్తోత్రములోని ఈ శ్లోకము వెలువడి నది.

* "మహీ పాదాఘాతా ద్వ్రజతి సహసా
సంశయపదమ్,
పదం విష్ణో ర్భ్రామ్యద్భుజ పరిఘ
రుగ్ణ గ్రహగణమ్,
ముహు ర్ద్యౌ ర్దౌస్థ్యం యాత్యనిభృత
జటా తాడిత తటా,
జగ ద్రక్షాయై త్వం నటసి నను
వామైవ విభుతా !"

విరుపణ్ణ మానసమున అలనాడు పెనుగొండలో తాండవ నృత్య మొనర్చిన పద్మినీదేవి దివ్యాకృతి పొడకట్టినది. నా

* ఓ పరమేశ్వరా ! నీవు సంధ్యాతాండవము చేయునప్పుడు పాదతాడనముచేత భూమి నిలుచునో నిలువదో యను సంశయ దశను పొందుచున్నది. ఆకసము బాహుసంచలనముచేత పీడింపబడిన నక్షత్రగ్రహములు గలదగుచున్నది. ఇటునటు గదలుచున్న నీ జడల తాకిడిచేత స్వర్గలోకము దుస్థితిని పొందుచున్నది. జగద్రక్షణార్థమై చేయుచున్న నీ నాట్యము జగదపకారహేతువగుట యాశ్చర్యము. అనుకూలమాచరింపబోయిన కొంత ప్రతికూలముగూడ జరుగుట ప్రభుత్వసహజము గాబోలు !

డామె యవయవవిన్యాస మెట్లున్నదో, నేడీ తాండవేశ్వరుని అంగభంగివిశేషమును అట్లే యున్నది. ఆమె మోములో ఎట్టి తేజమప్పుడు భాసించినదో ఈ మహానటుని ముఖములోగూడ అట్టి వర్చస్సే పరవళ్ళు త్రొక్కుచున్నది. ఈ శిల్పిలా పద్మినీ దేవినిగాని, ఆమె తాండవనృత్యమునుగాని యెఱుగనే యెఱుగరే. ఎట్లీ రూపమును చెక్కగలిగినారు! విరుపణ్ణ శివభక్తి పరవశుడై యా దేవునియెదుట నట్టే కూర్చుండిపోయినాడు. ఏదో దివ్యసమాధి ఆతని నావరించినది. కామాక్షీవీరణ్ణలు, శిల్పులును ఆతని భక్తితన్మయత కాశ్చర్యచకితులై చూచుచున్నారు.

ఇంతలో ఎవరోపిలిచినట్లు ఒక దివ్యసుందర స్త్రీమూర్తి ఉదితయౌవన ఆ మండప మధ్యమునకు విచ్చేసినది. ఆమె సాక్షాత్కరించిన బాలాత్రిపురసుందరివలె నున్నది. ఆమె రాక వారిని మఱింత విస్మయావిష్టుల నొనర్చినది. వచ్చిన యీమె ఏమియు మాటాడక విరుపప్రభుని పాదములపై వ్రాలినది. ఆమె తన కన్నీళ్ళతో విరుపుని పాదములను ప్రక్షాళించినది. కొంతసేపటి కాయనకు సమాధి సడలినది. కన్నులు తెఱచునప్పటికి ఇతఃపూర్వము ఎన్నాతెను మనసార సంస్మరించినాడో, ఆమెయే తన పాదములపై వ్రాలియున్నది. ఆత డొక్కసారి ఉచ్చైస్స్వరముతో "పద్మినీదేవి! ఇచ్చట కెట్లు వచ్చినది?" అని ఆశ్చర్యముతో అన్నాడు.

కామాక్షి వచ్చి పద్మినిని కౌగలించుకొని యోగక్షేమముల నడిగినది. ఆమె అందఱి యెదుట తన ఆస్థాన నర్తకి

పదము భంగమగుట, కృష్ణభూపతి మోహాంధత, కుప్పాయమ్మ మరణము మున్నగాగల విజయనగర విశేషములను పూస గ్రుచ్చినట్లు చెప్పినది. తనకు అభయ ప్రదానము చేయవలసిన దని విరుపదంపతులను వేడుకొన్నది. "పరమేశ్వర దాసులు భంగి పాటు చెందరమ్మా!" అని యామెను వారూఱడించినారు.

ఈ దృశ్యమును గాంచుచున్న జక్కణ్ణ హంపణ్ణలకు కథ ఏదో లీలగా మాత్రమే అర్థమయినది. హంపణ్ణ కన్నులు నిర్నిమేషముగా పద్మినీ రూపమును జూడసాగినవి. ఆతని మనస్సామె సహజసిద్ధ లోకాతీత దివ్యసౌందర్యమును భావనసేయ మొదలిడినది. ఆమె పేరునకు మాత్రము పద్మిని కాదు. ఆమె రూపధేయములో పద్మినీజాతి స్త్రీ కుండవలసిన సౌందర్య సర్వస్వము సమ్ముద్రితమై తోచిన దాతనికి. ఆత డింత వఱకిట్టి స్త్రీరత్నమును చూచి యెఱుంగడు. అప్సరస్సౌందర్య మనునది ఊహామాత్ర సిద్ధము. శిల్పముననను, చిత్రముననను దానిని రూపొందింప వచ్చును. కాని అది నిర్జీవము. ఇది సజీవ సౌందర్యము.

ముఖమండపములో జక్కణాచార్యుడు పాంచాల లక్షణములతో నొప్పు నొక సుందరమూర్తిని స్తంభమువిూద శిల్పించినాడు. ఆతడు ముమ్మూర్తులా వీరభద్రప్పకు ప్రతినిధి. ఆతనికి దీటైన స్త్రీమూర్తిని తాను రచించుటకు హంపణ్ణ మనస్సులో సంకల్పించుకొని యున్నాడు. పద్మినీజాతి లక్షణముల నాతడు చదివియున్నాడు. ఆ చదివిన మూర్తిని దృశ్యజగత్తునకు తెచ్చుట మాటలు కావు. ఎన్నియో వనితా

మూర్తుల నిష్పటికి నానా స్తంభములమీద శిల్పించుటమైనది. సహశిల్పులచేతను కొన్నింటిని తీర్పునట్లు చేసినాడు. ఆ మూర్తులలో సమగ్ర సౌందర్యము రూపుదాల్చిన ట్లాతనికి దోచలేదు. ఆ స్త్రీ విగ్రహములు వీరభద్రప్పకు ప్రతిగా తీర్చిన ప్రతిమ ప్రక్కన నిలబడుటకు పనికివచ్చునట్లు లేవు. ఇప్పుడు పద్మినీ దేవి కంటబడుటచేత తన మనోవీథిలో చిత్రితురాలైన దేవతా మూర్తి బాహ్యజగత్తున సాక్షాత్కరించినట్లయినది.

శిల్పులు సౌందర్యారాధకులు. సౌందర్యములో సర్వేశ్వరుని సందర్శించుటయే ఆ శిల్పయోగుల లక్షణము. కామవాసనా దూషితముకాని దివ్యదృష్టితో మహాశిల్పి సౌందర్యరసము నాస్వాదించును. ఒక గోవులో, ఒక పాములో, ఒక నెమలిలో, ఒక లేడిలో, ఒక చక్కనిదానిలో ఏదో ఒకానొక అలౌకిక సౌందర్యము మూర్తి కట్టవచ్చును. దానిని సహృదయుడు చూడవచ్చును. అక్కడ ఆతని కేమి కామ వాసన యున్నది ? పారమేశ్వర సౌందర్యమును త్రాగుటయే వాని లక్ష్యము. సౌందర్యారాధకుల లక్ష్య మిట్లుండును. వారు లింగాది వివక్ష చేయక అందమునకు మాత్ర మంజలింతురు.

హంపణ్ణ చేతు లప్రయత్నముగా తన యెదుట నున్న పద్మినీదేవి నమస్కరింప లేచినట్లయినది. ఆతడు నల్వురు నవ్వుదురేమో యని తన్నుదాను నిగ్రహించుకొన్నాడు. ఆ దివ్యసుందరమూర్తిని శిలలో శిల్పించుటకే ఆత డామె నింతదనుక కన్నార్పక చూచియున్నాడు. ఇట్టి హంపణ్ణ అంతర్యము నెంద అర్థము చేసికొందురు ? ఎవ్వ రెవ్వ రెట్లు భాషించినారో

ఆతనికిని దెలియదు. ఈ దృశ్యము నంతటిని కన్నార్పక చూచుచున్న కన్నప్ప కొక్కనికే ఆ శిల్పీశ్వరుని యాంతర్య మర్థమయినది. ఆతడు చదువులు నేర్వని సహృదయ చక్రవర్తి. మనుష్య మానసము నర్థముచేసికొనగల ధీశాలి.

*   *   *   *

విరుపణ్ణ ఆలయ కుడ్యములమీద శిల్పింపబడిన తక్కిన మూర్తులను, పౌరాణిక గాథలనుగూడ వరుసగాచూడ మొదలిడినాడు. ఆతని కొకచోట కన్నప్పకథ పొడకట్టినది. కన్నప్ప మహాశివభక్తుడు. అతడు కాళహస్తీశ్వరుని పూజించుచుండును. ఒకనాడా స్వామి కన్నప్ప భక్తిని పరీక్షింపదలచి తన కన్నులకేదో జబ్బుచేసినట్లు నటించి, కన్నులనుండి నీరు కారునట్లు చేసికొన్నాడు. పరమభక్తుడగు కన్నప్ప స్వామి కన్నుల కెన్నో వైద్యములు చేసినాడు. గుణము కలుగలేదు. కడకు కన్నప్ప తన రెండు కన్నుల నూడబెరికి స్వామికన్నులయం దమర్చి తన గాఢభక్తిని ప్రదర్శించి తాను గ్రుడ్డివాడైనాడు. భక్తుని సాహసమునకు కాళహస్తీశ్వరు డనుగ్రహించి వానికి మోక్షము నొసంగినాడు. ఈ కథను శిల్పు లతిసుందరముగను విశదముగను చెక్కియున్నారు.

విరుపణ్ణకు కన్నప్ప భక్తిత్యాగసాహసములు అద్భుతము లనిపించినవి. ఆత డెంతటి మహాభక్తశిఖామణియో అని లోలోన సంతసించి యా శిల్పమును ఱెప్పవేయక అదేపనిగా చూడమొదలిడినాడు. ఆ శిల్ప మాతని హృదయములో నెట్టి భావముల నంకురింపజేసినదో యెవ్వరికిని దెలియదు. కడకు

కామాక్షి వచ్చి ఆయనను ప్రబోధించి మఱియొక శిల్పమును జూచుటకు తీసికొనిపోయినది. వారా యాలయ కుడ్యముల యందు ఇంకనెన్నింటినో శైవమూర్తులను, శైవగాథలను గాంచి తన్మయులైనారు.

*　　　*　　　*　　　*

తండ్రివద్ద ప్రతిమాలక్షణములను నేర్చుకొన్నప్పటి నుండియు లక్ష్మి వేయు బొమ్మలలో ఒక వింత సోయగమేర్పడు చున్నది. ఆ బొమ్మలు ముఖాద్యవయవముల కొలతలలోను, భావలావణ్య సంయోజనములోను గొప్ప చిత్రకారులు చిత్రించిన చిత్తరువులను పోలుచున్నవి. ఆమె కొన్నింటికి రంగులను కూడ వేయుచున్నది. ఇది యంతయు ఆమె మొట్టమొదటి కళాభ్యాస కృషి. లక్ష్మి తల్లిగూడ ఆ చిత్తరువులను మెచ్చుకొనసాగినది. ఏమియు తోచనప్పుడెల్లను ఆ పిల్ల వీరేశ్వరాలయ కుడ్యములమీదను, ప్రాకారపు గోడలమీదను, శిల్పములు లేని తావులందెల్లను ఏవేవో చిత్తరువులను గీయుచుండెడిది. ఆమె చిత్రకళ పరిణతము కాకున్నను ఆచిత్తరువులు చూచువారిని ఆకర్షించుచునే యున్నవి.

నాట్యమండప శిల్పములనుగాంచి తమ జీవితములు సార్థకములయినట్లుప్పొంగిపోవు వీరణ్ణకు ఆ గోడలమీద లక్ష్మి సవరించిన చిత్తరువులను జూడగనే ఇంకొక ప్రేరణ కలిగినది.

"ఇప్పటికి తీర్చినదంతయు మహత్తరశిలాశిల్పము. వీనికి తోడుగా నిచ్చట వర్ణచిత్రములనుగూడ చిత్రింపజేసిన నెంత

బాగుండును ! శిల్ప చిత్రకళలు రెండును సమముగా అలనాడు వ్యాఘ్రనదీతీర పర్వతగుహాలయముల (అజంతా) లో బౌద్ధుల తపఃఫలముగా వెలసినవట. విజయనగరాధిపులును చిత్రకళకు పట్టాభిషేకము చేసినారు. లేపాక్షిలోగూడ దివ్యశిల్పకళను తీర్చిదిద్దవలయును. అప్పుడు బంగారము పరిమళించినట్లుండును.''

వీరణ్ణ వెనువెంటనే తన యుద్దేశ్యమును అన్నగారికి నివేదించినాడు. తమ్మునకు గలిగిన చిత్రకళాభిలాషను విరుపణ్ణ ముద్దుచేసి వల్లె యనినాడు. లేపాక్షిలో అద్భుత చిత్రకళా లక్ష్మిని నర్తింపజేయుటకు తీర్మానింప బడినది. తగిన చిత్ర కారులను రప్పించి చిత్తరువులను రచింపజేయు భారముగూడ ప్రధానాచార్యుడగు పురుషోత్తమ స్థపతిమీదనే పడినది.

నాడు తొండమండలమునను విజయనగరమునను, బెజవాడ దగ్గఱనున్న కొండపల్లిలోను, గొప్ప గొప్ప చిత్రకారులుండెడు వారు. వీరందఱును పలురంగులను చేయుటలోను, వానిని ఆ యా పాళ్ళలో కలిపి పెక్కు చిత్రవర్ణములుగా తయారు చేయుటలోను సిద్ధహస్తులు. కొండపల్లిలో అన్ని కులములకు చెందినవారును చిత్రకర్మము చేయుదురు. వారు రంగులను వేయుటలోనే గాక మట్టిని పాకముచేసి బొమ్మలను జేయుటలో గూడ వారు నేర్పరులు. ఆ బొమ్మలకు చక్కని రంగులను వేసి వినోదవస్తువులుగాగూడ వారు చేయగలరు. కొండపల్లి బొమ్మల ద్వారా నాడు దేశదేశాంతరములలో తెలుగువారి వాణిజ్యము సాగుచుండెడిది. తొండమండల శిల్పులకును విజయనగరమువారి కిని చిత్ర సూత్ర - చిత్ర శాస్త్రజ్ఞానము మెండు. పురుషోత్తమ

స్థపతి ఈ మూడు ప్రదేశములనుండియు నేర్పరులగు చిత్ర కారులను రప్పించినాడు. వీరికి నాయకుడుగా తొండమండలము వాడైన చిత్రకళానిధి రామోజు శిల్పి నియమితుడైనాడు. రామోజు చిత్రకుండ, చిత్ర బాహుళ్యాది సంస్కృత చిత్ర శాస్త్ర గ్రంథముల రహస్యములను క్షుణ్ణముగా ఆకళించుకొన్నవాడు. నానావిధ చిత్రనిర్మాణ దక్షుడు. ఎన్నెన్నో పౌరాణిక చిత్రములను తీర్చు నేర్పున్నవాడు. ఆయన చేతిక్రింద పనిచేయు చిత్రకారులును ముప్పదిమంది యున్నారు.

# 16

అచిరకాలముననే పద్మిని విరుపణ్ణ కుటుంబములో అందఱ యనురాగమును చూఱగొన్నది. కామాక్షీ విరుపణ్ణలకు ఆమెమీద ఎనలేని వాత్సల్యము. తమ బిడ్డలలో ఒక బిడ్డగా వా రామెను చూచుకొనుచున్నారు. ఎందుకు చూచుకొనరు. ఆమె గుణశీలములు, విద్యాబుద్ధులు, నడవడిక అట్టివి. ఆమె జన్మతః వేశ్యకాదని వారెఱుంగుదురు. ఆమె వేశ్యచేతిలో పెరిగినది. ఆ పెంపుడుతల్లి యైనను ఆమెకు తమ వృత్తి సహజములగు నలవాటులు గఱపలేదు. ఒక మహారాజపుత్రిని వలె పెంచి ఆటపాటలలో నెఱజాణను చేసినది. దానికి తోడు చక్రవర్తి మన్ననలను గూడ ఆమె యందుకొన్నది.

పద్మిని వచ్చిన పిమ్మట కామాక్షికి గూడ విశ్రాంతి చిక్కినది. గృహకృత్యముల నన్నింటిని పద్మినియే చక్కదిద్దుకొనిపోవును. కుటుంబసభ్యుల యక్కఱల నెఱింగి వారికి సాయ

పడును. ఆమెకు విరుపణ్ణమీద అమిత భక్తి. ఆయన శివపూజకు వలసిన యేర్పాట్లన్నియు తానే చేయును. ఆయన ఏ సమయమున నే యే గ్రంథములను పారాయణ మొనర్చునో, వానినప్పుడ సిద్ధపెట్టును. ఆయన దేవతార్చన ముగియునప్పటికి అన్నము వడ్డించుటకును తానే పూనుకొనెడిది. కాని కామాక్షి ఆ పిల్ల కట్టి శ్రమ నిచ్చుడి.ని కాదు. పద్మిని తాను వేశ్య యైనందువలన కామాక్షి వడ్డన చేయనిచ్చుటలేదని తలంచి స్గిగ్గిల్లెడిది.

పద్మిని వచ్చినప్పటినుండియు వీరభద్రప్ప ఎవరో మంగళ దేవత మానవస్వరూపముతో తమ యింట తిరుగుచున్నట్లు భావింపజొచ్చినాడు. పద్మినీ వీరభద్రులు ఒకరినొకరు ప్రేమ వీక్షణములతో చూచుకొందురు. ఏకాంతము చిక్కినప్పుడు ఏవో పరియాచకము లాడుకొందురు. పద్మిని ఏవేవో ఒయ్యారములు పచరించి ఆతని నాకర్షింప జూచును. ఆత డట్టె కరగిపోయి ఒకానొక తన్మయత ననుభవించును. ఇట్టి సమయములందు తాను వేశ్య నను భావము తోచి ఆమె ఉలికిపడును. తన విలాసముల నాత డెట్లు శంకించునో యని భయపడును. అప్పుడప్పుడు వారు నాట్య సంగీత విషయకములగు చర్చలతో ప్రొద్దుపుచ్చుచుందురు. వీరి ఆనుకూల్యము నెవ్వరును అడ్డగించువారు కారు. పద్మినికి రాజనర్తకి పదమునుండి విముక్తి చిక్కిన పిదప పెద్ద బరువు దింపుకొన్న ట్లనిపించినది. ఆమె తనలోని విద్యాశక్తులు ఉడిపోవనేల యని వీరణ్ణ విరుపణ్ణల యాడుపిల్లలకును, కామాక్షి యన్నకూతురు గౌరికిని, ప్రధాన శిల్పాచార్యుని కుమారి లక్ష్మికిని, తక్కిన శిల్పుల ఆడుపిల్ల

లకును సంగీత నాట్యవిద్యలు నేర్ప మొదలుపెట్టినది. ఆమె కది యొక కాలక్షేపము.

గౌరి కామాక్షికి అన్నకూతురు. అన్నగారు అకాల మరణముపాలు కాగా ఆ పిల్ల నాటినుండియు మేనత్త కామాక్షివద్దనే పెరుగుచున్నది. గౌరి అందమైన పిల్లయే. ఆమెను వీరభద్రప్పకు చేసికొందమని కామాక్షి భావించునది. కాని యాతనికి పదునేనేండ్లవఱకును మాటలు రానందున, మూగవాని నాపిల్ల యంగీకరింపదని కామాక్షి తన యభిప్రాయమును బయటపెట్టలేదు. వీరణ్ణ కుమారుడు చెన్నబసవప్ప వీరభద్రప్పకంటెను పెద్దవాడు. ఆతనికి పెనుగొండలోనే చిన్న రాజకీయోద్యోగముగూడ దొరకినది. గౌరిని ఆతనికి చేసికొన్నచో ఆ తండ్రిలేనిపిల్ల తన కుటుంబములోనే కాలము గడుప వచ్చునని కామాక్షి భావించినది. వీరభద్రప్ప మూకత్వము పోయినప్పటినుండి గౌరిని తన సొంతకోడలు చేసికొనవలయుననియే ఆమె అభిప్రాయము మార్చుకొన్నది. ఈసంగతి మగనితో చెప్పినదిగాని, ఆతడెట్టి సమాధానము నొసంగలేదు. విరుపణ్ణ స్వభావమే యట్టిది. వివాహ మనునది వధూవరుల పరస్పరానురాగముమీద నాధారపడి జరుగవలయు నని ఆతని యభిప్రాయము. అదియునుగాక వీరభద్రప్ప మూగవాడుగా నున్నప్పుడు వీరణ్ణకొడుకుకు జేసికొనవలయునన్న పిల్లను మఱల నిప్పుడు వీరభద్రప్ప యోగ్యతనుబట్టి ఆతనికే చేయవలయు నను భార్య యుద్దేశ్య మాతనికి నచ్చలేదు. అందుకే యాతడు మిన్నకున్నాడు.

ఒకనాడు పద్మినీవీరభద్రులు ముఖమండప శిల్పములను పరామర్శించుటకు పాపనాశేశుని గుడికి పోయినారు. అచ్చటి స్తంభశిల్ప కళాకౌశలము వారికి కనువిందొనర్చినది. ఒక స్తంభముమీద నిలబడి యున్న వినాయకుడు మందహాసము చేయుచు వారి నాశీర్వదించుచున్నట్లున్నాడు. ఇంకొకచోట సరస్వతీదేవి పద్మినీదేవి గానమునకు తన సంతసము నెఱిగించు చున్నట్లు చిఱునవ్వు లొలికించుచున్నది. మఱొకచోట అన్న పూర్ణాదేవి పరమసుందరముగా శిల్పింపబడి లోకమునకు కాట కములు రాకుండ కాపాడుటకు ప్రతిన పూనినట్లున్నది. ఇంకొక చోట మృత్యుంజయుడు దర్శనమిచ్చి అభయదానము చేయు చున్నాడు. ఆ రీతిగా నానావిధ దైవమూర్తులను ఆ స్తంభ ములమీద దర్శించువారికి ఒక కంబముమీద వీరభద్రప్ప అగపడినాడు. ఆ విగ్రహము ముమ్మూర్తుల వీరభద్రునిదే. అది ఆతడు కావలయునని శిల్పులతో చెప్పి చెక్కించు కొన్నాడో, లేక ఆ శిల్పులే ఆతని సౌందర్యలావణ్యములకు లోబడి అట్లు గండరించినారో పద్మినికి తోచలేదు. ఆమె తొగరు పెదవిపై దరహాసముద్ర పట్టియుట్లున్నది :

"రసజ్ఞశేఖరులు తమ మూర్తినిగూడ వెలయింప జేసికొన్నారా యేమి ? ఈ విగ్రహము తమ నోటి నుండి యూడి పడినట్లే యున్నది !"

వీరభద్రప్ప : ఆ మూర్తి నా నోటినుండి యెట్లూడిపడును ? అది శిల్పి చేతి యులినుండి రూపు తాల్చినది. నీ వా బొమ్మకు దిష్టి పెట్టుచున్నట్లున్నావు.

పద్మిని : పెట్టినచో మీ అమ్మగారితో చెప్పి ఉప్పు మిరప కాయలకు పని పెట్టుదములెండు. అప్పుడు దృష్టి దోషము తొలగును.

వీరభద్రప్ప కచ్చట తన మూర్తి నేలచెక్కెనో బోధ పడలేదు. వారు రెండడుగులు వేయునప్పటికి ఇంకొక కంబము మీద పద్మినీదేవి మూర్తి దర్శన మిచ్చినది. ఆ విగ్రహము అన్ని విధముల పద్మినియే. ఆ సమదీర్ఘ నాసిక, చంద్ర ముఖము, సమున్నత వర్తుల వక్షోజములు, లతాభుజములు, పద్మహస్తములు అన్నియు పద్మినీదేవివే. అద్దములోని ప్రతి బింబమునకును బింబమునకునువలె పోలిక లన్నియు అమరినవి. వీరభద్రప్ప అన్నాడు :

"పద్మినీ ! ఈ మూర్తి యెవ్వరిదో చూడుము ; ఎంత సొంపుగా నున్నదో !"

పద్మిని తన ప్రతికృతిని గాంచి ఆశ్చర్యపడినది. ఆ విగ్ర హము అచ్చము తనదే. ఆ శిల్పి తన్ను తీర్పవలయునని యిట్లు చెక్కినాడో, లేక అలవోకగా తీర్చినప్పు డిట్టి మూర్తి సిద్ధ మయినదో ఆమెకు తోచలేదు. కొంతవడికి ఆమెకు స్మృతి వచ్చినది. తాను తొట్టతొలుత రంగమండపములో విరుపణ్ణ కాళ్ళపై బడి లేచిన పిమ్మట ఒక శిల్పి కుమారు డెవ్వఁడో తన్ను రెప్ప వేయక చూచియున్నాడు. తన సర్వావయవములపై ఆతని చూపులు జాలు వాఱినవి. ఆతనినిగూర్చి తా నప్పుడు కాముకుడని యనుమానించినదికూడ. ఈ నిర్మాణ మాతనిదై యుండవచ్చును. "నే నానాడు తప్పదలంచితిని. ఆ శిల్పి నన్ను

చూచినది కాముకదృష్టితో గాదు. నన్నిట్లు తీర్చి నెంచి సౌందర్యదృష్టితో చూచినాడు. ఆతనిని వృథగా శంకించి పాపము మూట గట్టుకొన్నాను. మానవుల యూహ లిట్లే యుండును గాబోలు. ఒకరు చేయుచున్న పనిని ఇంకొక రర్థము చేసికొనలేక అపోహముల పాలగుచుందురు. ఇప్పట్టున నేనింక ఆత్మపరిశోధనము చేసికోవలయును. వీరభద్రప్పకు నాపై ప్రేమ యున్నదని నే ననుకొనుచున్నాను. మఱి ఆయన హృదయమేమో నాకు తెలియదు. తుదకు మోసపోవను గదా. అయినను ఆయన మనస్సును తెలిసికొనుట మంచిది.

పద్మిని : సృష్టిలో మనుజులను బోలిన మనుజులుండుట లేదా?

వీరభద్ర : ఉండవచ్చు. కాని నిన్ను బోలిన వనిత లుండరని నా యభిప్రాయము.

పద్మిని : మీ దంతయు చిత్రము. నే నంత ఆకాశమునుండి యూడిపడలేదు. నావంటివారును నుండవచ్చును.

వీరభద్ర : కాదు పద్మినీ! నీవు శారదాభ్ర సంఛన్న నీలాకాశమునుండి యూడిపడిన కరుణోదీర్ణ గిరిజారమణ శిరశ్చంద్రరేఖవే. మానవ మన స్సమ్మథనార్థ నవమన్మథ రాజ మంత్రవిద్యవు. సందేహము లేదు. లేకున్న ఇంతటి మృదులాచ్ఛ దివ్యసుందర తనూవిలసనము లెవ్వరి కుండును!

వీరభద్రప్ప ఈ మాట లనునప్పటికి పద్మినిని లజ్జ యావరించినది. వెనువెంటనే తాను వేశ్యనను భయము

నైతము కలిగినది. ఆమె నిరాశాహతములు భయనిదానములు అయిన చూపులతో నాతని పుల్కుపుల్కున జూచుచు నన్నది :

పద్మిని : నన్నుగూర్చి ప్రభువుల యభిప్రాయ మేమో తెలిసికొన వేడుక పడుచున్నాను.

వీరభద్ర : నీవు విద్యావతివి. అందగత్తెవు. మంచిదానవు. మా అమ్మకు నాన్నకు ఇష్టురాలవు.

పద్మిని : మఱి మీకో ?

వీరభద్ర : నా కిష్టము లేకున్న నేమాయె. గృహయజమానుల ప్రేమను చూఱగొంటివి గదా.

పద్మిని : మీ కిష్టురాలను గానప్పుడు గృహయజమానుల ప్రేమ నా కేమి యొరిగించును ?

వీరభద్ర : పద్మా ! నేనేమియు చెప్ప లేకున్నాను.

వీరభద్రప్ప ఈ మాట యనుట తోడనే తాను వేశ్య యగుటచేత నే ఆత డేమియు చెప్ప లేనను చున్నాడని భావించి పద్మిని భయభ్రాంతయైనది. ఆమె తన యాశాతంతువు తెగిపోవుచున్నట్లే సముద్వేగమును పొంది గద్గదస్వరముతో నన్నది :

పద్మిని : నేను వేశ్యనని సందేహమా ?

వీరభద్ర : నీవు వేశ్యవని యెవరన్నారు ? నీ కింతవఱకును దెలియదా ? నీవు వేశ్యవు కావు. ఉత్తమోత్తమ శైవాచారపరాయణులైన దంపతుల ముద్దుల బిడ్డవు.

పద్మిని : కాదు. మా యమ్మ కుప్పాయమ్మ. మీరు చెప్పు శైవదంపతులు లెవ్వరు ? నన్ను మోసగింపకుడు.

వీరభద్ర : కాదు పద్మినీ ! కాదు. కుప్పాయమ్మ నీకు పెంపుడు తల్లిమాత్రమే. కన్నతలిదండ్రులు శిష్టాచారసంపన్నులు. అందుకే నీకిట్టి నియమపాలనాశక్తి యబ్బినది. నీవిందఱి యనురాగమును చూఱగొనగలిగినావు. నీ రక్తము లోని సర్వాణువులును శివప్రభావ పూతములు. వేశ్య నను మాటనుమఱచిపొమ్ము. నామాటపై నమ్మకము లేనిచో అమ్మగారి నడిగి తెలిసికొనుము. నీ పుట్టినిల్లు అనంతపురము. మాయమ్మ పుట్టిన యిల్లును అనంత పురమే.

వీరభద్రప్ప మాటలు నమ్మవలయునో లేదో పద్మినికి తోచలేదు. ఆతడు తన్ను పెండ్లాడదలచి తాను వేశ్య యగుటచే నల్వురు నిందింతురని వేశ్య కాదని లోకమునకు ప్రకటించుటకీ పన్నుగడ పన్నినాడో; లేక నిజమేఅంతయేమో; ఆమె యూహింపలేకపోయినది. తాను వేశ్య కాదని కుప్పాయమ్మ ఎప్పుడుగాని తనకు చెప్పలేదు. అట్లుచెప్పిన తనకు లోబడదని ఆమె అట్లు చేసినదా. ఏమో, అంతయు పద్మినికి అయోమయముగా తోచినది. ఆమెదృష్టిని మఱల శిల్పసందర్శనముమీదికి పోనిచ్చినది.

ఆ ముఖమంటపములోని యొక భాగమున వారికి మూడు లోహమూర్తులు దర్శనమిచ్చినవి. అందు వీరభద్ర మూర్తులు రెండు, భద్రకాళీమూర్తి యొకటి. వానిని మైలవరము నుండి వచ్చిన దొడ్డనాచార్యుడును, పాంచాలవరమునుండి వచ్చిన విద్యానిధియు నిర్మించినారు. ఇవి ఉత్సవమూర్తులు. వీరభద్ర భద్రకాళీ విగ్రహములు రెండును మిక్కిలి పెద్దవి. వాని బరువు దాదాపు ఇరువదియాఱు మణుగులకు మించి యున్నవి. ఇంకొక వీరభద్ర విగ్రహము శాంతమూర్తి. ఇది యేడు మణుగుల బరువున్నది. ఇంత పెద్ద ఉత్సవ విగ్రహముల నెవ్వరును చేయింపరు. భద్రకాళీవిగ్రహము వీరభద్రుని చెవుల వఱకు వచ్చు నెత్తు కలదై యున్నది. దేవుని చెవులవఱకు వచ్చు నెత్తు కలదై దేవీమూర్తియుండవలయునను మయశిల్ప శాస్త్ర నియమమును పాటించి యా శిల్పులు దాని నట్లు తీర్చి నారు. ఈ మూడుమూర్తులను దర్శించి వారు పోబోవుచుండగా దొడ్డనశిల్పి వచ్చి వానిలోని విశేషముల నిట్లు వివరించినాడు.

ముందాతడు ఒక ఇనుపకడ్డీని తీసికొని ఆ మూర్తులపై కొట్టినాడు. అవి భిన్నభిన్నరీతుల మ్రోగినవి. వీరభద్రుని రౌద్రమూర్తి మేఘగంభీరధ్వనితో ఖంగుమని భయంకరముగా మ్రోగినది. భద్రకాళీమూర్తి సౌమ్యముగా చెవుల కింపువట్లు నినదించినది. శాంతవీరభద్రమూర్తియు నట్లే సౌమ్య గంభీ రముగా మ్రోగినది. ఆ మ్రోత విన్నప్పుడు వినిన వారి చిత్త ములలో శాంతి విస్తరిల్లినట్లయినది. భద్రకాళీమూర్తి ధ్వని ఎట్టి మనస్తాపమునేని శాంతింపజేసి ఆనందము నొడగూర్పజాలు ప్రణవనాదమువలె నున్నది.

"నాయనా! వీరభద్రా! ఈ మూడు మూర్తులకు ఉపయోగించిన పంచలోహములు వేఱువేఱు పాళ్ళలో గలిపి నట్టివి. ఆ పాళ్ళ నట్లు కలుపుటచేతనే ఈ నాదములలో నిట్టి తారతమ్యము ఘటిల్లినది. నాదబ్రహ్మమువలన గూడ ననేక విధ ప్రయోజనములు మానవులకు కలుగుచుండును. అందుకే లోహముల పాళ్ళ మార్పుతో నాదభేదమును బట్టి ఫలభేదము లనుగూడ ఉత్తమ శిల్పులు సాధింపవలసి యున్నారు. మనము శివపూజ చేయునప్పుడు గంటను మ్రోగించి "ఘంటా నాదం శివార్పణమ్" అనుచున్నాము కదా! అందులో గొప్ప తత్త్వ రహస్యము లేదా! కనుక ఈ యుత్సవ మూర్తులు అసాధా రణములు. ఇవి భక్తులకు సర్వాభీష్టప్రదములై యొప్పు ననుటలో సందేహములేదు. ఇది యంతయు మీ నాయనగారి శిల్ప తపః ఫలము. ఆ మహనీయుడు సంకల్పించి శ్రమించి, మమ్ము గుర్తించి తెచ్చి యీ పనికి వినియోగింపకున్న మా విద్య ప్రకాశింప వీలుండెడిది కాదు. ఆయన సార్థకజన్ముడు.

"అనేకులగు శిల్పులు, విద్వాంసులు, కవులు తమ్ము గుర్తించువారు లేక, తమ విద్యను ప్రదర్శించుటకుగాని, అర్థులు దొరకనందున దానము చేయుటకుగాని వీలుచిక్కక, అడవి బూచిన పూలవలె రాలిపోవు చుందురు. పండితుడు విద్యతో మరణించినను మంచిదే కాని ఊషరక్షేత్రమున తన విద్యాబీజములను నాటరాదని ఉపనిషత్తు చెప్పుచున్నది. ఇట్టి స్థితిలో మేమెంతో యదృష్టవంతుల మని భావించుచున్నాము బాబూ!

"ఈ సందర్భమున ఇంకొక రహస్యమునుగూడ నీకు చెప్ప నుత్సాహము కలుగుచున్నది. మనకు లోహశాస్త్ర సంపద అపారముగా నున్నది. ఒక్కొక్క లోహముచే గాని, మిశ్రలోహములచే గాని ఎన్నెన్నో విధములైన వస్తువులను సృష్టించి ఎన్నెన్నో ఫలములను సంపాదింపవచ్చును. నానావిధ స్తంభములను, మూర్తులను, గృహోపకరణములను ఇట్టి లోహములచే చేసికొనవచ్చును. ఎన్నెన్నో శిల్పరహస్యము లను మహాశిల్పులు గ్రంథస్థము చేయక అర్హులగు శిష్యులకు మాత్రమే యుపదేశించుచున్నారు. మా నాయనగారు నాకు కొన్ని పరమ రహస్యములను దెల్పినారు. వానిని నేను తగిన ప్రదేశములం దుపయోగించి అపూర్వ శిల్పముల నిర్మించు చుందును.

"వీరభద్రా! నీ కిప్పు డింకొక పరమ రహస్యము నుపదేశింప సంకల్పము కలుగుచున్నది. శ్రద్ధతో వినుము. రాగి పది రెండు పాళ్ళు, వెండి పదునాలు పాళ్ళు, బంగారము పది పాళ్ళు కలిపి మిశ్రలోహమును కూడవలయును. దానితో పుష్యమీ నక్షత్రభాను వాసరమున మంత్రవేత్తయగు శిల్పా చార్యుడు శ్రీ సూక్తమును పఠించుచు ఉంగరమును జేయ వలయును. ఆ యుంగరమును ధరించిన వారి యింట దారిద్ర్య ముండదని ఆచారమయూఖ మను నొక గ్రంథము చెప్పు చున్నది. 'అయినచో నీ పద్ధతి ననుసరించి లోకమునుండి పేద ఱికమును బాఱద్రోల వచ్చును గదా' యందువేమో! దీనిపై విశ్వాస మెందఱ కుండును? అట్టి నమ్మక మున్నవారి ఆ శుభ దినము, అట్టి శిల్పి - మున్నగు సాధనసంపత్తి సమకూడ

వలయును గదా! ఆ పని విఘ్నహతము కాకుండ నెఱవేఱ వలయును గదా! అప్పుడు గదా శాస్త్రవాక్యము ఫలించునది. వీని కన్నింటికిని పూర్వజన్మ కర్మముతోగూడ గాఢ సంబంధమున్నది. నాయనా! ఈ రహస్యములను శ్రద్ధావిశ్వాసములు లేనివారికి చెప్పరాదు. ఇట్టి యంగుళీయకము నొకదానిని నీకు చేసి పెట్టవలయునను సంకల్పమును భగవానుడు నా కొసంగుచున్నాడు. ఇక మాసము దినముల నాటికి పుష్యమీ నక్షత్రముతో గూడిన ఆదివారము రానున్నది. కావున ఆనాడీ ప్రయత్నముచేసి చూతమని నాకు బుద్ధి పుట్టినది. నాయనగారు ప్రస్తుతము పదవీ భ్రంశము నందియున్నారు. ఈ యంగుళీయక ధారణముచేత పోయిన దుర్గాధిపత్యము మఱల సిద్ధింప వచ్చునను నాశయు నాకు కలుగుచున్నది."

దొడ్డనాచార్యుడు చెప్పుచున్న లోహశిల్ప రహస్యములను వినుచున్న పద్మినీ వీరభద్రులు ఆశ్చర్యచకితులైనారు. దేశమున నున్న లోహశిల్పశాస్త్ర సమృద్ధికి వారు కైమోడ్పు పెట్టిరి. అట్టి యుంగరము నెప్పుడెప్పుడు తాల్తునా యని వీరభద్రప్ప ఉవ్విళ్ళూరుచుండెను.

పద్మినీవీరభద్రు లిట్లు స్వేచ్ఛావిహారములు చేయుటచే వా రనురాగపాశబద్ధు లైనారని కామాక్షి తెలిసికొన్నది. ఆమెసంకల్పము గౌరిని వీరభద్రప్ప కిచ్చి పెండ్లి సేయవలయుననికదా. అది కొనసాగునట్లు లేదు. విరుపణ్ణ కుమారుని మందలింపడు. పోనీ పద్మినిని తాను మందలింపవచ్చునుగదా యను

కొన్న ఆ దిక్కులేని పిల్లకు తామేనాడో ఆశ్రయమిచ్చినారు. ఆమెను మందలించిన ఆ పిల్ల యేమగునో! అది తెలిసిన వీర భద్రప్ప యేమనునో! అని కామాక్షి భయపడుచున్నది. ఇట్టి సంకటస్థితిలోపడిన కామాక్షి యొకనాడు గౌరినిబిలిచి "గౌరీ! నీవు ఏ బావను చేసికొందువమ్మా!" అని ప్రశ్నించినది.

బుద్ధియెఱిగిన ఆపిల్ల ఎటూచెప్పలేక యూరకుండినది. కామాక్షి మఱల "సిగ్గుపడదు చెప్పుతల్లీ!" యని బుజ్జగించినది. "నాకేబావయైనను ఇష్టమే. నేనెవ్వరిమీదను ముందుగా ప్రేమబీజమును నాటి పెంచుకొనలేదు. పెద్దలైనమీరును, మామయ్యయు ఎవ్వరిని చేసికొనునట్లు నిర్ణయింతురో ఏ బావ నన్ను పెండ్లాడదలంచునో—ఆ బావనే నేను వివాహమాడుదును" అని ఆ పిల్ల జవాబిచ్చినది. పద్మినీవీరభద్రులు ప్రేమబద్ధులైయున్నారని గౌరియెఱిగియేయున్నది. అట్టిస్థితిలో మేనత్త కామె యింతకన్న నేమి చెప్పగలదు? అయినను కామాక్షి రక్తసంబంధమును బట్టి వీరభద్రప్పకే గౌరిని చేసికొన నిర్ణయించుకొని యున్నది.

స్త్రీపురుషుల యనురాగము విచిత్రమైనది. కొందఱికది శరీరసంయోగమే ప్రధానమైనదిగా నుండును. ఆ కామోద్రేకము చల్లారిన పిదప ఆ యనురాగమును అంతరించును. దీనిని మోహము, జాంతవ (పాశవ) కామము, లేక శుద్ధమైన ఇంద్రియోద్వేగము అనవచ్చును. మఱికొందఱి విషయమున బాహ్యసౌందర్యాదులనుబట్టి యనురాగ మేర్పడుచుండును. ఏ కారణముచేతగాని ఆ రూపమునకు హాని వాటిల్లినచో, ఆ

యనురాగమును నశింపవచ్చును. ఇంక కొందఱు గుణరూప విద్యాశీలములనుబట్టి ప్రేమబంధమును కల్పించుకొందురు. ఈ సందర్భమున కొందఱిదృష్టిలో సౌందర్యమునకంతగా ప్రాధాన్య ముండక విద్యాగుణశీలములకే యుండవచ్చును. తుది వారి ప్రేమ చెక్కుచెదరక శాశ్వతముగా నుండుటకు వీలున్నది. సుఖదుఃఖములయం దద్వైతస్థితిని భజించు నిట్టి ప్రేమనే యుత్తమమానవప్రేమమనియు, దైవదాంపత్యమనియు మహాకవి భవభూతి సీతారాముల దాంపత్య ప్రేమయోగము నభివర్ణించుపట్టున నుడివినాడు. ఈ ప్రేమ హృదయసంబంధము, గుణశీలసంబంధముకలదగుట ముదిమి మున్నగుదశలు పైకొన్నప్పుడును చెక్కుచెదరక నిలిచియుండును.

పద్మినీ వీరభద్రుల ప్రేమ మిట్టిది. వీరభద్రుడు పద్మినీదేవి రూపవిభ్రములచే మాత్రమే ఆకర్షింపబడలేదు. ఆమె నాట్య, సంగీత విద్యాకౌశలమునకు ఆతడు ముగ్ధుడైనాడు. తరువాత ఆమె గుణశీలము లాయన నాకర్షించినవి. ఇట్టి పిల్లయిల్లాలైన జీవితము పండగలదని యెంచి యామెపై ప్రేమబంధమును పెంచుకొన్నాడు. ఆతడు కావలయుననుకొన్నచో రూపవతులు దొరకకపోరు. వారిలో నింతటి విద్యాగుణశీలము లుండవలయునుగదా !

ద్మినికూడ ఆత డొక మండలాధిపుని తనయుడని మాత్రమే ప్రేమింపలేదు. ముం దాతని రూప మామె నాకర్షించినను, తరువాత తరువాత ఆతని కార్యనిర్వహణదక్షత - వాని కుటుంబౌన్నత్యము - విరుపణ్ణ యుదాత్తత మున్నగునవి

వానిపై నామె కనురాగబంధమును ధృఢమొనర్చినవి. కేవలము అధికారమో, దర్పమో ఆకర్షణ హేతువగుచో, విరుపణ్ణ దుర్గాధిపత్యమూడిన పిమ్మట పద్మిని వీరభద్రుని పెండ్లాడి యేమి బాముకొనును ? పదవిని బట్టి వాని కన్న గొప్పవాడు గదా కృష్ణప్ప. కనుక పద్మిని దృష్టిలో వీరభద్రుని గుణశీల సామర్థ్యములకే ప్రాధాన్యము.

ఈ వలపనునది ఇంకను విచిత్రముగా నడచును. ఒకడొకదానిని వలచును. ఆమె కాతనిపై అనురాగ ముండదు. అట్లే ఒక్కతె ఒక పురుషునిపై ప్రేమబీజము నాటుకొనును. ఆత డంగీకరింపనందునగాని, స్థితిగతు లనుకూలింపనందునగాని అది ఫలింపక పోవచ్చును. ఇట్టివానికి పద్మినీ కృష్ణప్ప నాయకులను, గౌరీ వీరభద్రులను ఉదాహరణముగా గైకొనవచ్చును. గౌరి అందమైన పిల్లయైనను, మేనత్త కామెను వీరభద్రునకు చేసికొను సంకల్పమున్నను వీరభద్రు డందుకేల యొప్పుకొనకున్నాడు ? ఇట్టి యుదాహరణములు పెక్కులు మనకు లోకములో చిక్కును. వీని కన్నింటికి కారణములు వేఱుగా నుండును. అవి పూర్వజన్మ సంబంధములై కొన్నియు, ఇతర హేతువులు గలవై కొన్నియు నుండవచ్చును.

# 17

నాట్యమండప శిల్పముల నారసి వచ్చిన నాటిరాత్రి కామాక్షి యొక కల గన్నది. ఆమె హ్రీంకారత్రయసంపుటమైన పంచదశీమంత్రముతో లలితాదేవి నుపాసించుచుండును.

మూకపంచశతి ఆమెకు పారాయణ గ్రంథము. మూకుడు చిన్నప్పటినుండియు మూగవాడే. అతనికి కామాక్షీదేవి యనుగ్రహము వలన హఠాత్తుగా మూకత్వముపోయి విద్యలు తేజరిల్లినవి. అతడు మూకమహాకవియైనాడు. తన్ననుగ్రహించిన దేవత కామాక్షిని గూర్చి యాతడు అయిదువందల శ్లోకములను అయిదు విధముల వృత్తములలో రచించినాడు. ఆ గ్రంథమును మూకపంచశతి యందురు. దేవీభక్తు లీ శ్లోకములను పఠించి దేవీప్రసాదము నందుచుందురు. రంగమంటపములోని దివ్య శిల్పములు హృదయమును ఆకర్షింపగా కొంతతడవు తాండవేశ్వరమూర్తిని భావించి ఆమె కామాక్షీ పంచశతిలోని కటాక్షశతకమునుండి కొన్ని శ్లోకములను భక్తిమెయి పఠించుచు, మంత్రమును ఉపాంశుజపము చేయుచు పండుకొన్నది.

కామాక్షి జాగ్రత్తునుండి స్వప్నావస్థలో ప్రవేశించినది. ఇంతవఱకు ఆమెకు స్వప్నములో లలితమైన అంబా స్వరూపము మాత్రమే తోచుచుండెడిది. నేడట్లు కాదు. అష్ట బాహుసమంచిత దుర్గాదేవి, గదా ఖడ్గ పాశాంకుశాద్యాయుధములను ధరించి దంష్ట్రికరాళయై దర్శనమిచ్చినది. ఆమె సింహాసనము నధిష్ఠించినది. ఎడమకాలితో మహిషాసురుని తన్నుచు త్రిశూలముతో పొడిచి చంపుచున్నది. ఆత డార్త నాదము చేయుచు విలవిల తన్నుకొని చచ్చినాడు. కొంతవడి కామె మఱింత భీషణాకృతియై విశ్వరూపము తాల్చినది. ఆ తల్లి పాదమొకటి పెనుగొండ కొండమీద మోపినది. రెండవపాదమును లేపాక్షి కూర్మాద్రిపృష్ఠముపై పెట్టినది. భయంకరమగు వక్త్రమును తెఱచి యిట్లన్నది.

"కామాక్షీ! మీ దంపతుల భక్తి నాకు మెచ్చు గూర్చినది. నే నింత వఱకును పంపా విరూపాక్ష దేవుని పాదదాసినై విజయనగర సామ్రాజ్యమున కే ముప్పును రానీక కాపాడినాను. విజయనగరరాజుల నిప్పుడు స్వార్థము పైకొన్నది. వారు స్వధర్మచ్యుతులగు చున్నారు. ధర్మదూరు లగు వారి చేతిలోనికి ప్రభుత్వముపోవు చెడురోజులు దాపు రించు చున్నవి. వారు విమతస్థులతో చేయి కలుపజూచు చున్నారు. విద్యారణ్యుల నాటి భక్తిప్రపత్తులను ఆదిమ దంప తులయెడ ఆ యేలికలు చూపుట లేదు. అంతయు తాఱు మాఱగుచున్నది. ఇక నే నచ్చట నిలువజాలను. ఈ లేపాక్షి నే నిజావాసము చేసికొందును. నేటినుండి యిరువది యేండ్లవఱకును విజయనగర సామ్రాజ్యము యుద్ధజ్వాలలో చిక్కి తపించును. ఆపై సమూలముగా నాశనమగును. అచ్చటి రాజకుటుంబ ములు దక్షిణదేశమునకు తరలి రాగలవు. మీ దంపతులకు శివ సన్నిధానము చేరువలో నున్నది.

ఈ మాట లనుచునే దేవీ స్వరూపము తిరోధానమంది నది. అప్పుడే విరుపణ్ణ "కామాక్షీ! తెల్లవార వచ్చినట్లున్న" దని ఆమెను మేల్కొలిపినాడు. ఆమె భర్తృదేవుని పాదము లను కన్నుల కద్దుకొని తన స్వప్న వృత్తాంతమును వినిచినది. ఆయన దుర్గాదేవి చెప్పినట్లు జరుగనున్న విజయనగర పతనము నకు హృదయమున మిక్కిలి వగచినాడు. కన్నుల నీరు సైతము పెట్టుకొన్నాడు.

పిమ్మట వారు ప్రభాత శివార్చనకు కూర్మాద్రిమీదికి పోవునప్పటికి మిక్కిలి పెద్దదయిన స్త్రీ పాద ముద్ర యొకటి

జాతిలో మూడంగుళముల లోతుగా వారికి పొడకట్టినది. అది దుర్గాపాద ముద్రయని వారు సంభావించి దేవీమహిమకు భక్తి నమ్రులైనారు. సంగతి నంతటిని విన్న పురుషోత్తమస్థపతి దుర్గాప్రతిష్ఠయు నిక్కడ యావశ్యకమని సూచించినాడు. ముఖ మండపములోని యొక మూలనున్న స్తంభముమీద శివప్రియకా శిల్పమనోజ్ఞమైన దుర్గాదేవిని దిద్ది తీర్చినాడు. ఆమె స్తంభోద్భవ దుర్గ. కామాక్షీ దేవియాజమాన్యమున దుర్గాదేవికి ప్రాణ ప్రతిష్ఠా నేత్రోన్మీలన సంస్కారాదులు జరిగినవి. ఆ దేవతగూడ పాపనాశేశ్వర కోదండరామ వీరభద్రమూర్తులతో బాటు ఆరాధకులకు నిత్యోపాస్యురాలయినది.

*　　*　　*　　*

లేపాక్షిలో వీరభద్ర రఘునాథమూర్తుల ప్రతిష్ఠలు జరిగిన పిమ్మట విరుపణ్ణ పెనుగొండ దుర్గాధిపతి యగుట శిల్పులకు సంతోషమును గూర్చినది. కాని కొంత కాలమునకే ఆతనికి పదవీచ్యుతి జరుగుట వారికి విచార కారణమైనది. ఇందుకు విజయనగర రాజ్యాంగములోని అనైకమత్యము అవకతవకలు హేతువులైనను, మనుష్యప్రయత్నముచేత దైవానుగ్రహమును పొంది మఱల మండలాధిపత్యము నేల సంపాదింపరాదని శిల్పులు సంకల్పించుకొన్నారు.

లేపాక్షిలోని శిల్పిగణములో పెక్కురు జ్యోతిర్మంత్ర తంత్ర శాస్త్రములలో అఖండు లున్నారు. పురుషోత్తమస్థపతి మాట చెప్పనే యక్కఱ లేదు. జక్కణాచార్యునికి జ్యోతిర్మంత్ర శాస్త్రములు వంశపరంపరా సిద్ధములు. పెందోటనుండి వచ్చిన

బత్తైన కంవసాధారణ మేధాశాలిత్వమున్నది. ఒకనాడు సర్వ శాస్త్రకుశలులైన నలుగురైదుగురు శిల్పాచార్యులు నాట్య మండపములో సమావేశమైనారు. వారు విరుపణ్ణ వీరభద్రప్పల జాతకచక్రములను దెప్పించి పరిశీలించినారు. పదవీచ్యుతి కలుగు నాటికి విరుపణ్ణకు గ్రహబలము చాలియుండలేదు. ముఖ్యముగా రవి కుజ గ్రహముల బలము చాలనందున రాజ్య భ్రంశము జరిగినది. బుధ రాహువుల బలముండుటచే ఆతడు దేవాలయ శిల్పనిర్మాణమున కృతకృత్యుడగు చున్నాడు. మోక్షకారకుడగు కేతువు తగిన స్థానమున నిలిచి విరుపణ్ణ విషయమున సానుగ్రహుడై యున్నాడు.

తరువాత వారు వీరభద్రప్ప జాతకమును పరిశీలించిరి. కుజు డాతనికి పరమోచ్చ స్థానములోనుండి యోగ్యగ్రహ దృష్టుల నందియుండుటచే అనుకూలుడే కాని, కొన్ని చిన్న లోపము లాతని కున్నవి. రవి అధిమిత్ర స్థానము నందుండుట చేత అనుకూలుడే. కాని వానిని చూచు గ్రహముల దృష్టి మంచిది కాదు. భోగకళత్ర కారకుడగు శుక్రుని బలము వీర భద్రప్ప కధికముగానే యున్నది. మాతృకారకుడగు చంద్రుడు వాని కనుకూలుడే. కొలదికాలములోనే అతనికి కుజ మహాదశ రానున్నది. ఆ సమయమున వీరభద్రప్ప జాతకము బాగుగా యోగింపవచ్చును. ఆ దశలో నేదో యొక సమున్నతస్థితి కాతడు చేరుకొనవచ్చునని వారు ఊహ చేసిరి. గ్రహవిషయకము లైన కొన్ని ప్రతిబంధములను తొలగింపవలసి యున్నది. అటు పిమ్మట బత్తైనాచార్యు డిట్లన్నాడు.

బ_త్తైన : ప్రధానాచార్యా ! వీరభద్రప్పకు సంపూర్ణముగా గ్రహముల అనుకూల్యము సంపాదించుటకు గ్రహజపము లును దానాదులును చేయుట మంచిదని నా యభి ప్రాయము.

జక్కణ : అంతియే కాదు. నవగ్రహములు నవరత్నములకు అధిదేవతలై యున్నారు. అ యా గ్రహముల అను కూల్యము సిద్ధించుటకు నవగ్రహజప హోమ దానము లతోఁ బాటు నవరత్నఖచిత స్వర్ణాంగుళీయకమును గూడ తాల్చుట ప్రయోజనకారి యని నా యభిప్రాయము.

దొడ్డన : ఇది మిక్కిలి సమంజసమైన యాలోచన. తామ్ర తార సువర్ణములను ఆ యా పాళ్ళలో మేళవించి వీర భద్రప్పకు నే నొక యుంగరమును జేసి ఋాయ సంక ల్పించు కొన్నాను. ఆ యంగుళీయకమునందే నవగ్రహ దేవతాకములగు నవరత్నములను బిగించినచో అన్ని ప్రయోజనములును నెఱవేఱ గలవు.

విద్యానిధి : మీ రా మిశ్రలోహమును తయారుచేసి యుండు. నేను వలసిన మంత్రములను జపించి యంగుళీయకమును రత్నఖచితముచేసి యిచ్చెదను.

ఈ యుపాయ మందఱకును సముచితమని తోఁచినది. పుష్యమీ నక్షత్రయుక్త భానువారమునాఁడు శుచియై, వార్చి, మహామంత్రజప పరిపూతదేహుఁడై విద్యానిధి శ్రీ సూక్త పారాయణ మొనర్చుచు నవరత్నాంగుళీయకమును నిర్మించి

వీరభద్రప్ప వ్రేలికి స్వయముగ తొడిగి ఆశీర్వదించినాడు. విరుపణ్ణ శిల్పాచార్యులు తమ శ్రేయస్సును గోరి యొనర్చిన యీ యభ్యుదయకార్యమునకు మనస్సులో నెంతగానో మెచ్చుకొని వారికి కృతజ్ఞతా బద్ధుడైనాడు.

* * * *

పురుషోత్తమ స్థపతి లేపాక్షికి వచ్చినప్పటినుండియు తన నిత్యానుష్ఠానమును అగస్త్యగుహలో జరుపుకొనుచున్నాడు. ఆతడు యోగాభ్యాసపరాయణుడు. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి — అను అష్టాంగములను ఆత డిదివఱకే సాధించినాడు. ఇప్పుడు ధ్యానధారణా సమాధులను మూటిని కలిపి సంయమయోగము నభ్యసించుచున్నాడు. ఈ సంయమమున నెగ్గినవారినే సంయములని పిలుతురు. సంయమము సిద్ధించిన యోగులకు అణిమాద్యష్ట సిద్ధులును, నిగ్రహానుగ్రహ సామర్థ్యమును అలవడును. ఇంక నెన్నియో అలౌకిక దివ్యశక్తులను వారు ప్రకటింపజాలుదురు. లేపాక్షి దేవాలయ శిల్పములను తీర్చుటకు అసంఖ్యాకులైన మహాశిల్పులు విచ్చేసియుండుటచే ప్రధానాచార్యుని కెక్కువగా విశ్రాంతి చిక్కుటకు వీలైనది. పురుషోత్తముడు తన కాలము నెక్కువగా ఈ సంయమాభ్యాసమున కుపయోగించుకొనును.

ఒకనాడు పురుషోత్తముడు ఆయా శిల్పులు చేయుచున్న శిల్పములను పరిశీలించి భోజన వేళ కాకమునుపే పాకశాలకు వచ్చినాడు. ఆనాడు సోమవారము. ఆచార్యమాతకు సోమ

వారద్రవత నియమ మున్నది. ఆనాడామె జపము, పూజాపుర స్కారములయినగాని వంటపనికి పూనుకొనదు. ఆచారము ననుసరించి నాడితరులెవ్వరును వంటచేయ వీలుగాదు. భోజనా ర్థము వచ్చిన కుమారు నామె "ఇంక నాలస్య మున్నది. నాయనా! పని యేమైనను చూచుకొ"మ్మని చెప్పినది.

ఆ పాకశాల కెదురుగనే యొక బృహత్పాషాణము చిఱుకొండవలె నిలిచియుండెను. దానిని చూచుచున్న స్థపతి హృదయమున నేమి యూహకలిగెనోయేమో, ఆతడు నల్వురు కృతహస్తులైన శిల్పులను నామమాత్రముగా తోడుచేసికొని ఆ శిలను ఏడు తలలతోనొప్పు నాగేంద్రునిగా తీర్చిదిద్దినాడు. ఆ యేడు పడగలు ఛత్రమట్లు విస్తరింపబడినవి. సర్పశరీరము చుట్టలు చుట్టుకొని యున్నది. ఆ చుట్టలమధ్య పానవట్టము మీద ఒక బృహల్లింగాకారము మలచబడినది. ఇది యంతయు ఒక్క శిలలోనే రూపుతాల్చినది. దిగువనుండి ఫణాగ్రము వఱకున్న యెత్తు పదునాఱడుగుల ప్రమాణము. ఇట్టి బృహ ద్రూపమును కల్పించుటకు పట్టిన కాలము పదునాఱు గడియ లైనను కాదు. నాలుగు గడియలు మాత్రమే. ఆతని తప శ్శక్తి యెట్టిదో! పురుషోత్తమ స్థపతి తన సంయమశక్తిచేత ఇట్టి మహాఘనకార్యముల నెన్నింటినో చేయుచుండువాడు. ఇట్లు నాగలింగేశ్వరమూర్తి శిల్పరచన ముగిసిన పిమ్మట నా శిల్పివతంసు డద్దానికి ప్రాణప్రతిష్ఠచేసి దాని యెదుటనే ధ్యాన నిమగ్నుడై సమాధి సుఖము ననుభవింపబూనెను.

తల్లి, మనుమరాలు లక్ష్మినిబిలిచి నాయనగారేరమ్మా! యని యడిగినది. ఆ పిల్ల వాకిలివద్దకు వచ్చి చూచునప్పటికి

ఇంతదనుక చిన్నకొండగానున్న యీ బండ నాగలింగేశ్వరుడుగా రూపుదాల్చియుండుట, దాని యెదుట తన తండ్రి ధ్యానావస్థలోనుండుట గాంచి లక్ష్మినాయనమ్మకా వృత్తాంతము నెఱింగించినది. మడిగుడ్డలతోనున్న యీ శిల్పిమాత వాకిటిలోనికి వచ్చి కుమారుని ప్రతిభకు, తపశ్శక్తికి ఆశ్చర్యపడి యద్దాని సౌందర్యమును తిలకింప జొచ్చినది. రెండుమూడు క్షణములట్లు చూచుచుండగనే యందుండి యొక పెద్ద మ్రోత వినవచ్చినది. ఆ ధ్వనికి శిల్పాచార్యునకు సమాధిభంగమై కన్నులు తెఱచి చూచినాడు. లింగాకృతి మూలమునుండి సప్తశీర్ష నాగేంద్రుని శిరములదాక నిలువున శిల్పము పగిలి యున్నది. పగులున్నదే కాని యది రెండు ఖండములైపోలేదు. శిల్పాచార్యుని మనస్సున కిది యేదో యశుభముగా తోచినది. అయినను ఆతడా భావమును బహిర్గతముగానీక దానికి శాంతి విధులు జరిపి యామూర్తి తన ప్రభావమును గోల్పోకుండునట్లు తన తపశ్శక్తిచేత చేయగలిగినాడు. దానిని శిలాదోషమని కొందఱు శిల్పులన్నారు. మాతృదృష్టి సోకి యట్లయినదని కొంద అన్నారు. పురుషోత్తమ స్థపతి నడుగగా అందుకు వ్యాఖ్యాన మనవసరమనియు, ఆమూర్తి యెట్లయినను స్వప్రభావమును గోల్పోవదనియు సమాధాన మిచ్చినాడు. ఈ సంఘటనము విరుపణ్ణ ప్రభృతులకు పురుషోత్తమ స్థపతిమీద భక్తిగౌరవముల నినుమడింప జేసినది.

పురుషోత్తముని మేనల్లుడు మాచమూర్తి, మేనమామ తపశ్శక్తిచేతను, శిలావిజ్ఞానముచేతను ఇంత లేసి పనులుచేయుచున్నాడని యెఱుగును. ఎచ్చటనైనను లింగమూర్తి కెదుట

నందీశ్వరుడుండుట సంప్రదాయము. శంకరుడు వృషభధ్వజుడును వృషభవాహనుడును అయినందున లింగమూర్తి కెదుట నంది యుండక తీఱదు.

మాచమూర్తి మేనమామ చేసినపని సంపూర్ణము కాదని తెలిసికొని నంది నిర్మాణమునకు బూనుకొనినాడు. నాగలింగేశ్వర శిల్పమున కెదురుగా నూరు ధనువుల దూరములో నొక పెద్దశిల ప్రకృతిసిద్ధముగానే యున్నది. ఆ శిల నాగలింగేశ్వరస్వామి కత్యంతము అభిముఖముగా నున్నది. ఆ శిలను ఒక మహానందినిగా మలచుటకు మాచమూర్తి పూనినాడు. ఆయనకు పొన్నంబలశిల్పి, శివప్రియన్, హంపణ్ణలు చేదోడుగా నిలిచిరి.

* * * *

ఒకనాడు నాట్యమంటపమున విరుపణ్ణ వీరణ్ణ ప్రభృతులు సమావేశమైనారు. నాట్యమండప స్తంభశిల్పములు, ముఖమండప స్తంభశిల్పములు అత్యద్భుతములైనందున తన్నిర్మాణము చేసిన శిల్పుల కెట్టి బహుమానములిచ్చి సన్మానింతమా అని వారాలోచింప మొదలిడిరి. ఆ సందర్భమున లేపాక్షి, హిందూపురములలోని పలువురు పెద్దలుగూడ వచ్చి శిల్ప సందర్శనము చేయుచున్నారు. ఇంతవఱకు పనిచేయుచున్న శిల్పులు దినబత్తెములను నిత్యావసర ద్రవ్యమునుదప్ప ఎట్టి వేతనమును పుచ్చుకొనుటలేదు. ప్రధాన స్థపతికి ఉత్తమకళా నిర్మాణముననే చూపుగాని, దానికి విలువగట్టి డబ్బుతీసికొనునుద్దేశ్యమే లేదు. వారమున కొకసారి భోజనమున కావశ్యక

మగు వస్తుసామగ్రియంతయు భృత్యులద్వారా శిల్పుల వసతి గృహముల ముందుకువచ్చి చేరును. అదనముగా వారికేమైన వస్తువులు కావలసియున్నను వారాభృత్యులతో జెప్పి తెప్పించుకొనవచ్చును. ఈ విధముగా విరుపణ్ణ శిల్పీశ్వరుల కేలోపము జరుగకుండ నేర్పాట్లు చేసినాడు. ఇక ఆయా ప్రత్యేకప్రత్యేక శిల్పకార్యములకు అధిపతులైన పురుషోత్తమాది స్థపతివర్యులకును ఏ లోటునులేదు. వారికి రాజమర్యాదోచితముగా నిత్యజీవితము సాగిపోవుచున్నది. తమకు లేని సౌకర్యములనుగూడ శిల్పుల కేర్పాటు చేసియున్నాడు కళాప్రియుడగు విరుపణ్ణ.

దైవమూర్తులను నిర్మించియిచ్చు శిల్పులు ఆ దైవములకు ప్రతినిధులవంటివారని శాస్త్రమనుచున్నది. "శిల్పిపూజా శిలాపూజా శిల్పిదుఃఖేన దుఃఖితా." శిల్పులను పూజించిన, శిలలనుపూజించిన ఫలము చేకూరును. శిల్పిని గౌరవింపక కొంచెపఱచినచో, ఆ శిల్పులు తీర్చిన శిలామూర్తులుగూడ దుఃఖము పాలగును. ఆ దైవ శిలాప్రతిమలు భక్తులకు సత్ఫలితముల నీయజాలవు. ఈ రహస్యముల నెఱింగిన విరుపణ్ణ శిల్పాచార్యుల నుచితబహుమతులచే సత్కరించుట కర్తవ్యమని తలంచినాడు. సమ్మాన నిర్ణయసమావేశమునకు పిలువక పోయినను కన్నప్పగూడ ప్రతిదినము వచ్చునట్లే శిల్పసందర్శనేచ్ఛతో వచ్చినాడు.

బహుమానమును గూర్చి ఇంతని అంతని వీరణ్ణ విరుపణ్ణలు మథనపడుచున్నారు. యువకుడైన వీరభద్రప్పయు తనకు తోచిన సూచనలు చేయుచున్నాడు. స్తంభములు

మహాశిల్ప మండితములగుటచేత వాని కేమిచ్చి ఋణమీగెద మను ప్రశ్న పుట్టినది. ఎవరికి తోచినట్లు వారు చెప్పినారు. కన్నప్ప కన్నడము వాడు. ఆతనికి తెలుగంతగా రాదు. ఆతడు తెలుగు కన్నడములను సరిపాళ్ళలో కలిపి మాటాడుచుండును. విరుపణ్ణ నుద్దేశించి "ప్రభూ! ఎష్టు ఆలోచనే, సాలుకు సావర్ వరాలు మూలకు మున్నూరు వరాలు ఇత్తురు" అన్నాడు. ఆతని మాటకు పురుషోత్తమస్థపతి చలించినాడు. విరుపణ్ణ సంతోషించినాడు. ఆతని సూచనయే కడ కనుసరింప బడినది.

మండపములో ఒక్కొక్క వరుసలో కొన్ని స్తంభము లున్నవి. వానిపై తీర్చిన శిల్పముల కన్న మూలనున్న కంబములమీద తీర్చిన శిల్ప మెన్నోరెట్లు మిన్న. సాలుగానున్న స్తంభములను చెక్కుటకు శిల్పులెంత శ్రమించినదియు, మూల స్తంభములను చెక్కుటకెంత శ్రమించినదియు కన్నప్ప బాగుగా గుర్తించినాడు. కన్నప్పయే కాదు, ప్రతి కళావేత్తయు ఆ పని విలువను గ్రహింపగలడు. అందుకే కన్నప్ప వానికట్లు వెల కట్టినాడు.

నాట్య మండపములోని స్తంభములలో రెండంతరిక్ష స్తంభములున్నవి. అవి నేలమీద ఆనవు. మండపోపరిభాగము ననే అవి భూమిపై నానకుండునట్లేవో యేర్పాటులు చేయబడి యుండును. మొత్తముమీద ఈ స్తంభముల నట్లు నిలుప గలుగుట మహాప్రజ్ఞా సాధ్యముకాని మాటలు కావు. పురుషోత్తమస్థపతికిగూడ ఆ శిల్పచాతుర్య మబ్బురమైనది. ఆ రెండు స్తంభములను తమిళులైన పొన్నంబళ శిల్పియు, శివప్రియ

శిల్పియు నట్లు చేసినారు. వా రసాధారణ మేధాశాలులు. పురుషోత్తమస్థపతి ఆ మహాచార్యులకు నాలుగువందల వరహాల నీయ ప్రభువు నర్థించినాడు. విరుపణ్ణ అయిదువేల నిచ్చి యందఱి హర్షమునకును బాత్రుడైనాడు.

*　　　*　　　*　　　*

కార్తికపూర్ణిమనాడు వీరభద్రాలయమునకు రాకపోకలు చేయు జనులకు ఎడ, తెఱపి, లేకయున్నది. అనేకులు శివభక్తులా నాడు పగలంతయు ఉపవాసముండి శివార్చన చేసికొని రాత్రికిగాని భుజింపరు. విరుపప్రభుని కుటుంబము, పురుషోత్తమస్థపతి కుటుంబముగూడ ఉపవసించి శివ పూజలలో నిమగ్నమై యున్నవి. విరుపణ్ణ క్రిందటిసారి పురుషోత్తముడు బోధించిన రీతిగా నాడు పరమేశ్వరుని సగుణోపాసన చేయుచున్నాడు. ఆయన ధ్యానమునకు కూర్చుండగనే శివ స్వరూపమును హృదయమున కొంతసేపు భావించినాడు. అటుపిమ్మట ఆ పరమేశ్వర స్వరూపము సచ్చిదానందాత్మక మని ఆతనికి తోచినది. అప్పుడా మూటినిగూర్చి మననముచేయ నారంభించినాడు. అంతట తృతీయ నేత్రాదులతో గూడిన శివస్వరూపము తిరోహితమై విశుద్ధ పరబ్రహ్మము భాసించినది. ఆత డా పరమాత్మ తత్త్వమును చాలసేపు నిధిధ్యాసము చేసినాడు. ఒకానొక అనిర్వచనీయానందానుభూతిని విరుపణ్ణ పొంది, చాలసేపటికి గాని బాహ్యజగమునకు రాలేకపోయినాడు.

పిమ్మట పురుషోత్తమస్థపతి వచ్చి విరుపణ్ణ ప్రభృతులకు దేవాలయమును జూపుచు దాని తత్త్వము నిట్లు వివరించినాడు.

"దేవాలయము నొక విరాట్పురుషునిగా భావింపవచ్చును. జీవునకు దేహమెట్టిదో దేవునకు దేవాలయ మట్టిది. దేహమున కున్నట్లే దేవాలయమునకును సర్వావయవము లుండును. ఇటు చూడుడు. ఈ పాద శిలలున్నవే - ఇవియే దేవాలయ పురుషునికి పాదములు. వానికి పైనున్న అూలు పిక్కల వంటివి. ఆ మేఖలయే నడుము. సోమసూత్రమే అపానము. అవిగో మన చేతులకు కర్మశక్తి నొడగూర్చు చున్నవా అననొప్పు నాలయ స్తంభములే విశ్వపురుషుని బాహువులు. చేతులకు నానావిధ భూషణములెట్లు అందమునుగూర్చునో, అట్లే స్తంభములమీది నానావిధ శిల్పములు వాని కాభరణములై యందము కూర్చును. ఈ స్తంభములమీద ఎన్నెన్నో దేవతా ప్రతిమలను తీర్పవచ్చును. ముప్పదిమూడు కోట్ల దేవతల నీ స్తంభములమీద తీర్చిన దేవాలయములు మన దేశమునం దనేకమున్నవి. వీనిమీద నాట్యశాస్త్రమును, యుద్ధాదులను, లతా వితానములను గండరింపవచ్చును. ఈ స్తంభములలో నెన్ని రీతులున్నవో చెప్పజాలము. ఇట్లే దేవాలయపు గోడల యందు సైతమెన్నో శిల్పములను మలచవచ్చును. కనుకనే దేవాలయము నొకవిరాట్పురుషుని యాకారముగా మనమెంచు చున్నాము. ఆ విశ్వరూపుని శరీరమునందే కదా చరాచరాత్మక జగత్తు ప్రకాశించునది !

"ఆ గర్భాలయము హృదయము వంటిది. అందలి దీపమే ప్రాణము. ఆ దీపపుకాంతులే ఆలయపురుషుని కన్నులు. ఘంట యనెడి నాలుకతో దేవుడు మనలను బిలుచుచున్న స్థితిని గమనించుచున్నారా ? నాభివంటి బ్రహ్మస్థానమును, ముక్కును

బోలిన శుకనాసమును, చెవులనుబోలిన గవాక్షములను కంఠము వంటి అమలసారికను చక్కగా భావింపుడు. మేదస్సువంటి గచ్చును, ఎముకలవంటి తాళ్ళను, మాంసువంటి కాయపాలిని గాంచుడు.

"అది గదిగో! దేవాలయ పురుషుని శిరస్సు - సర్వాగ్రమున నున్న ఆ కలశశిఖరమునుజూడ మఱువకుడు. శ్రీశైల క్షేత్రములో ఈ శిఖరసందర్శనమే ముఖ్యాతిముఖ్యము. ఇంతటి సుందరస్వరూపము గల దేవాలయ పురుషుని కందలి మూల విరాణ్మూర్తియే ఆత్మ. అది యే రూపములోనున్నను, ఏ నామముతో పిలువబడినను భక్తులు రాగద్వేషములు పూనరాదు. నామరూపములకు ప్రాధాన్యమీయక-వానిచే సూచితమగు జగత్కారణ పరమతత్త్వమునే భక్త లనుసంధానము చేయవలయును. బంగారము కావలసినవాడు — అది ఏ నగ రూపములోనున్నను స్వీకరించును గదా! నామరూపములు నగల వంటివి. మూలతత్త్వము బంగారమువంటిది. దేవాలయములోని మూర్తిని ప్రతిమయని మన మనుచున్నాము. దాని యర్థమేమను కొన్నారు? "ప్రతి మీయతే ఇతి ప్రతిమా'' — పరమేశ్వరునితో ఉపమింపబడునది. అనగా ఆయనకు ప్రతిగా భావింపబడునదని. జగదీశ్వరుని స్మరణ, ధ్యాన, పూజనములు చేయుటకీ ప్రతిమలు ఆయన ప్రతినిధుల వంటివని సారాంశము. ఇట్టి ప్రతిమను సాధనముగా చేసికొని మూలతత్త్వము ననుభూతికి తెచ్చుకొనవలయు ననుట పరమ రహస్యము."

పురుషోత్తమ స్థపతి యుపన్యాసమును శ్రోతలు తమ తమ సంస్కారములకు దగినట్లుగా నర్థముచేసికొన్నారు. విరుపణ్ణ మీాద నీ యుపన్యాస ప్రభావ మెక్కువగా పడినది. కామాక్షియు కన్నప్పయు కన్నులు మూసికొని తన్మయులై పోయినారు. భక్తులు పెక్కురు దేవాలయముల కేగి పూజా పురస్కారములు చేసి వచ్చుచుందురు. వారిట్టి తాత్త్వికోప న్యాసముల నింతవఱకు వినియెఱుంగరు. విరుపణ్ణ యుద్యమము చేతనే ఋషి కల్పులగు నిట్టి మహాశిల్పాచార్యులు వచ్చి, మహాశిల్పములను నిర్మించుటయు, మహారహస్యములను విని పించుటయు జరిగినదని వారు సంతసించిరి.

పిమ్మట విరుపణ్ణ "ఆచార్యా! శిల్పులనుగూర్చిగాని, వారి ధర్మములను గూర్చిగాని లోకమున కేమియు తెలియ కున్నది. వారు రచ్చలకెక్కక రహస్యముగా నుండువారై నందున వారి యోగ్యత లెఱుకపడకున్నవి. శిల్పాచార్యుల ధర్మములను సంగ్రహముగా తెలుపుడని పురుషోత్తముని కోరెను. అతడాపనికి విద్యానిధిని నియోగింపగా, అతడిట్లు చెప్పెను.

"సానగ సనాతనాది బ్రహ్మఋషుల వంశమున జన్మించిన శిల్పులు వేదములను కడముట్ట చదువుటయే కాక, వాని యర్థ ములను గూడ నెఱింగియుండవలయును. వేదములనెల్ల చదు వుట అసాధ్యకార్యముగనుక అవసరములైన వేదభాగముల విజ్ఞానమైనను వారికి ముఖ్యమై యున్నది. వేదవిజ్ఞానమవసర మన్నప్పుడు వాని యంగములను చదువవలయునని వేఱ చెప్ప

నక్కఱలేదు. సాముద్రము, గణితము, జ్యోతి ర్వాస్తు శిల్ప శాస్త్రములు పూర్తిగానే చదువవలయును. చతుష్షష్టికళల మర్మములను శిల్పాచార్యు డెఱింగి యుండవలయును. శైవ, వైష్ణవ, గాణాపత్య, బౌద్ధ, జైన, కాపాలికాది మతముల పరిజ్ఞానము శిల్పులకు ముఖ్యము. సువర్ణాదిలోహములు, దారువులు, శిలలు, ఇటుకలు, గచ్చులు, చిత్రములు, వర్ణములు— మున్నగు పనులన్నియు వా రెఱింగియుండు టావశ్యకము. శ్రౌతస్మార్తక్రియలను స్వయముగా నాచరించుటయేగాక, యితరులచే చేయించుశక్తియు శిల్పుల కుండవలసియున్నది. స్నాన, సంధ్యా, జప, హోమ, తర్పణ, వైశ్వదేవాదులోనర్చి తగిన వైదిక సంపత్తిని శిల్పులు సంపాదించి యుండవలయును. ఇక యజనయాజానాది షట్కర్మములనుగూర్చి వేఱుగాచెప్ప నక్కఱలేదు. సర్వాగమ సిద్ధాంతముల నెఱింగి ప్రతిష్ఠాతంత్ర మును సమర్థముగా నిర్వహింపగల యోగ్యత శిల్పులకు సంపాదింపదగినది. ఈ ఘట్టమున ప్రాణప్రతిష్ఠా, నేత్రోన్మీలన సంస్కారముల వంటివి శిల్పిచేతిమీదుగా జరుగవలసి యున్నందున, ఆతడు తపోయోగశక్తి సంపన్నుడగుట మిక్కిలియు గుణము. శమదమాది నిష్ఠాగరిష్ఠుడై సప్తవ్యసనదూరుడై మంచినడవడి కలవాడుగా శిల్పియుండవలయుననుట సామాన్య ధర్మమే. శిల్పి, లక్షణోపేతములగు నవయవములు కలిగి సత్యవచనుడై ఏకపత్నీవ్రతనియమము కలవాడుగానుండవలయును. "అరోగీ రూపసంపన్నః" అనుమాట ఆతని కారోగ్యముగూడ ముఖ్యమని సూచించుచున్నది. మయమహర్షి చెప్పిన ఈ లక్షణముల నేకశ్యప, సమరాంగణాదులును, వాతూలాగమకర్తయు పేర్కొనియున్నారు. ఇంతయేల, శిల్పాచార్యునికి తెలియని

సంగతి యుండరాదుగనుక, ఆతడు సర్వజ్ఞుడై యుండి సదనుష్ఠాన పరుడు గావలయునని తేలుచున్నది. ఇట్టి శిల్పాచార్యుడు ప్రతిష్ఠించినమూర్తి లోకకల్యాణకరమగుననుటలో లేశమేని అతిశయోక్తి లేదు. ఈశ్వరానుగ్రహముచే విరుప ప్రభువుల కిట్టి మహనీయ లక్షణములుగల శిల్పాచార్యులు పురుషోత్తమ స్థపతులు దొరకినారు. అందుకనియే వారు ప్రతిష్ఠించిన రఘు నాథ, వీరభద్ర, గౌరీ, దుర్గామూర్తులు ప్రభావముకలవై ప్రజల వాంఛలను నెఱవేర్చుచున్నవి. ఇంకను తక్షకుడు, సూత్రగ్రాహి మున్నగువారి కుండవలసిన విద్యాధికారాదులు ప్రత్యేకముగా నున్నవి.

# 18

పద్మినిని వశపఱచుకొను యత్నములో కృష్ణభూపతి తలచినదొకటి, చివరకు జరిగినదొకటి. ఆమెను రాజనర్తకి పదమునుండి తొలగించినచో ఆమె సామాన్య వేశ్యయయి తనకు సులభముగా చేజిక్కునని అతడు తలంచినాడు. కాని తన కా బంధము తొలగుటచే ఆమె స్వేచ్ఛాచకోరి యైనది. విజయ నగరమును వీడుట కామెకు చక్కని యవకాశములను కృష్ణప్ప నాయకుడు కల్పించినట్లైనది. ఇప్పు డాతడేమి చేయవలయును? పద్మినిని తన వలపుకత్తెను చేసికోవలయునను తలం పాతనికి చిరకాలమునుండియు కలదు గదా. ఆ సంకల్పము నెఱవేఱనిది ఆతనికి నిద్రపట్టదు.

జీవితమునం దనేకులు అందని వస్తువులకే అత్యాసక్తితో అఱ్ఱులు చాచుచుందురు. మఱికొందఱు వస్తుప్రాప్తిదుర్లభ

మను కొన్నప్పుడు దాని సంగతినే పట్టించుకొనరు. పట్టుదలగల మనుజులు అప్రాప్యములకును ప్రయత్నించుట, తుదకు విఫలులై పలుబన్నములకు పాత్రులగుట అనేకుల విషయమున మనము చూచుచునే యున్నాము. కృష్ణప్పకు బన్నముల నెదుర్కొన గల సాధనసంపత్తి యున్నది. ఆతడు తన ప్రయత్నము నేల విరమించును!

విరుపణ్ణ పద్మినిని చేరదీసి తనకు బద్ధశత్రువైనాడు. ఆ భోగముపిల్లను తన కుమారుడు వీరభద్రప్ప కుంపుడుకత్తెను జేయుటకో, ఇల్లాలిని జేయుటకో నిశ్చయించుకొని ఆత డామె కాశ్రయమిచ్చి యుండును. పద్మినీ వీరభద్రప్ప లిదివఱకే పరస్పరానురాగబద్ధులై యున్నారు. వీరి యనురాగబీజము ఫలించుటకు వీలులేదు. దానికి విఘ్నములు కల్పింపవలయును. పద్మినిని ఆ కుటుంబమునుండి వేఱుచేయవలసి యున్నది. ఒక రీతి నాలోచించిన తాను చేసిన పని తప్పాయేమి ?. పద్మిని ఆస్థాన నర్తకిగానే యున్నయెడల ఆమెమీద ఏవో చాడీలు చెప్పి, నేరములుమోపి సదాశివరాయల మనస్సు విఱిచి ఆమెను తన పాదాక్రాంతురాలి నొనర్చుకొన వీలయ్యెడిది. ఇప్పు డామెను రాజాజ్ఞ లేమియు చేయజాలవు. ఆమెపై నేరములు మోపు నధికార మిప్పు డెవ్వరికిని లేదు. ఆమె ఎక్కడున్నను ఎవ్వరును ఏమనుటకును వీలులేదు. ఆమె సర్వవిషయములలోను స్వతంత్రురాలు. ఆమె స్వాతంత్ర్యము నఱికట్టుట కిప్పుడు కుప్పా యమ్మకూడ లేదాయెను. ఔను, నిజముగా తాను పొరపాటే చేసినాడు. తన కప్పు డింతటి దూరాలోచనము లేకపోయినది. ఇప్పు డందుకు చింతించి ప్రయోజనమేమి. కానిమ్ము. ఇప్పటి యుపాయము నిప్పు డాలోచింపవలసి యున్నది.

ఆతడు కొన్ని రాత్రు లిట్టి చింతతోనే గడపినాడు. తుద కాతని కొక యుపాయముతోచినది. లేపాక్షి పెనుగొండ మండలములోనిదే. ఆ మండలములోని ప్రజలు తనకు విధేయులై యుండవలసిన వారు. విరుపణ్ణ ఇంతకు పూర్వ మీ మండలమునకు అధిపతియే కావచ్చును. అయిన నేమి? ఇప్పుడు పదచ్యుతుడయినాడు. తనకులోబడి యుండవలసినదే. పద్మినిని తీసికొని వచ్చి తన కప్పగింపవలసినదని యాతనిని తాను కోరవచ్చును. మంచి యుపాయము తట్టినది. వెంటనే యాత డొక లేఖను వ్రాసి చారునిచే లేపాక్షిలోనున్న విరుపణ్ణకు పంపినాడు.

"భూతపూర్వ పెనుగొండమండలాధిపతులు శ్రీవిరూపాక్షశ్రేష్ఠిగారికి కుశలప్రశ్న పూర్వకముగా ప్రస్తుత పెనుగొండ. మండలాధీశులు వ్రాయునది. మీరు మేము వలచిన పద్మినీదేవిని చేరదీసి ఆమెకు మాపై యేవము కలిగించి మా మైత్రిని భంగము చేయుచున్నట్లు తెలిసికొన్నాము. ప్రభువులతో ఇట్టి విద్వేషమునకు బూనుకొనుట మీ కెంత మాత్రమును క్షేమముగాదు. కనుక ఈ జాబందిన మూడు దినములలోపల పద్మినీదేవిని తెచ్చి మా కప్పగింపవలసినదిగా కోరుచున్నాము. ఆమెనుగూర్చి మాకెన్నో విశిష్టాభిప్రాయము లున్నవి. ఆమె విజయనగర రాజనర్తకీ పదమునుండి దురదృష్ట వశమున రాయలవారిచే తొలగింపబడియున్నది. ఆమెకు కలిగిన పదవీచ్యుతికి మేమెంతయు చింతించుచు, ఆమెను మా ఆస్థానపు రాజనర్తకిగా నియమించి ఆమె

కళాసేవల నందుకొనదలంచి యున్నాము. ఆమె మీవద్ద నున్నచో ఆమెకు చేకూరెడు మేలేమియు లేదు. మీ రామె కెట్టి యుపకారమును చేయజాలరుగదా. ఈ సంగతు లన్నింటిని పద్మినీదేవికిగూడ చెప్పి, ఈ సదవ కాశమును సద్వినియోగపఱచుకొనున ట్లామె కవ కాశము గలిగింతురని నమ్ముచున్నాము. ఈ లేఖనే ఆజ్ఞాపత్రముగా భావించి, పద్మినీదేవి మూడవనాటికి మా యాస్థానమునకు వచ్చి తన రాజనర్తకీపదవి నని ష్ఠింపవచ్చును."

ఇట్లు,

కృష్ణప్పనాయకుడు.

లేఖ వచ్చునప్పటికి విరుపణ్ణ ప్రభృతులు లేపాక్షిలోని మాచమూర్తి తీర్చిన నంది శిల్పసౌందర్యమును గాంచు చున్నారు. మాచమూర్తి వారికి విశేషములను వివరించు చున్నాడు.

"ప్రభూ! ఈ నంది మిక్కిలి పెద్దది. దీని పొడవు ముప్పది యడుగులు. ఎత్తు ఇరువది యడుగులు. ఏడు కుఱు చలు పొందుపడు నట్లీ నంది హంపణాచార్యాదుల సాయముచే నిట్లు మలచబడినది. హోయసలరాజుల కాలమున హాలెబీడులో తీర్చబడిన నందులుగూడ ఇంత పెద్దవిగావు. కళావేత్తలగు మీరే నంది సౌందర్యమును చూచి భావింపవచ్చును. మా శిల్పమును మేమే వ్యాఖ్యానముచేయుట బాగుండదు."

నిరుపణ్ణ ఆ నంది చక్కదనమునకును, బృహద్రూపము నకును ముగ్ధుడై యిట్లన్నాడు :

"శిల్పాచార్యా ! ఈ నంది పండుకొన్న తీరూ, కాళ్ళు ముడుచుకొన్న రీతీ, ఆ చూచుచున్న పద్ధతీ ఎంత అందముగా నున్న వయ్యా ! దీని మెడలో ఇరువదియారు పెద్దగంటలతో నున్న పట్టెడ ఒక తత్త్వరహస్యమునకు సంకేత మనుకొందును. ఆ పెద్ద పట్టెడకు నాయకమణిగా మెడక్రిందనున్న పెద్ద ఘంట, దాని మీది సింగపుతల, ఆపైనున్న గండభేరుండపక్షి ! ఆ కుచ్చులూ ఎంత సుందరములు ! ఈ పెద్ద పట్టెడకు పైనున్న మువ్వలపట్టెడ, దిగువనున్న జంటత్రాళ్ళ కంఠాభరణము, దాని మీద నమర్చిన మఱొక యలంకారము—ఇట్టి నాలుగు గ్రైవేయకములతో ఈ నంది యెంతో సొంపుగా నున్నది ! ఆ చెవులకు కట్టిన కుచ్చుల నగలు, ఆ ముఖపట్టము, తోక క్రిందుగా నడుమునుచుట్టి వచ్చు నా పట్టెడను గంటలూ రావియాకులూ ఒకదాని తరువాత నొకటి వచ్చున ట్లమర్చి యెంత చక్కగా సృష్టించినారు !

"ఆ మూపురము క్రిందనున్న నాగబంధమూ, ఆ ముడి కుచ్చుమీదనున్న శిల్పము మఱపునకు రాకున్నదే. నందికి పెట్టిన నగలనే ఇంత సొంపుగాతీర్చిన శిల్పులు నంది తీర్పులో ఎంత మెలకువ చూపరు ! ఱిక్కించుకొనియున్న యా చెవులు, కొమ్ములు, దవడలు, నాసారంధ్రములు, ఉండవలసిన ప్రమాణములోనుండి మీ శాస్త్రకౌశలమును చాటుచున్నవయ్యా మహాశిల్పీ ! ఆహా ! ఆ శిరస్సౌందర్య మేమి ! ఆ కాళ్ళగిట్టల

తీర్పు, వానికిపెట్టిన కడియాలు ఎంత బాగుగానున్నవి. నాలుగు గడియలలో నాగలింగేశ్వరుని బృహన్మూర్తిని తీర్చిన మేన మామగారికి తగిన మేనల్లుడ వనిపించుకొన్న నీకు మంచి భవిష్యత్తున్నదని తలంతు"మని విరుపణ్ణ నాలుగు దుశ్శాలువ లనునల్వురు శిల్పులకు కప్పి వరాలరాసులతో వారిని సత్కరించి నాడు.

కృష్ణప్పనాయకుని వార్తావహుడుకూడ [illegible]రితోబాటు ఆ బృహన్నందిని చూచి సంతోషసాగరమున మునుకలు పెట్టి నాడు. ఆతనికి విరుపణ్ణ చేయించు శిల్పసృష్టి అజరామర మని పించినది. ఇట్టి మండలాధీశునికి పదచ్యుతికలుగుట, ఆ పదము కృష్ణప్పవంటి ముష్కరునికి దక్కుటనుగూర్చి యాతడు విధిని లోలోన నిందించినాడు. విరుపణ్ణకు సాగిలబడి మ్రొక్కి లేఖను సమర్పించినాడు.

లేఖను చదివిన విరుపణ్ణ నిశ్చేష్టుడైనాడు. ఆతని శరీ రము వణకసాగినది. కన్ను లశ్రువులతో నిండిపోయినవి. "పద్మిని దిక్కులేనిపిల్ల. పుట్టకమునుపే తండ్రిని కోల్పోయినది. పుట్టిన తరువాత తల్లిని కబళించుకొన్నది. తన్ను గారాబాల పట్టిగా పెంచి విద్యాబుద్ధులునేర్పి ఇంత దానిని చేసిన పెంపుడు తల్లి కుప్పాయమ్మ గతించినది. ఆమెకు వేశ్యావృత్తిపై రోత. అసలామె వేశ్యయైననే గదా, అందామెకు మక్కువ యుండు టకు. ఇట్టి పిల్లను వశపఱచుకొన వలయునని కృష్ణప్ప ఎత్తులు వేయుచున్నాడు. ఆమె యేమో తమ్ము శరణువేడి ఆశ్రయించి నది. ఇప్పుడు కృష్ణప్పభూపతి ఆస్థాన నర్తకీపదమను నాశ చూపి ఆమె నాకర్షింప కబురంపినాడు. ఇట్టిస్థితిలో తనకర్తవ్య

మేమి ? పంపకున్నచో ఆమె భవిష్యమును పాడుచేసినవాడు కాగలడు. పంపినచో ఆమె శీలము కృష్ణప్ప చెంగట సురక్షిత మగునను నాసలేదు." ఆతని కేమియు తోచలేదు. పద్మినీదేవి యభిప్రాయము నెఱింగి కార్యనిర్ణయము చేయుటకై విరుపణ్ణ యింటికివచ్చి యామెకు మండలాధిపతి యాజ్ఞ నెఱింగించి నాడు.

పద్మినికి వయస్సు తక్కువైనను ప్రపంచపు పోకడలు బాగుగానే తెలియును. తనకు రాజనర్తకి పదవి యీాడు టొక అదృష్టమని యామె తలంచుచునే యున్నది. ఆమె సంకల్పము దేవదాసీవ్యవస్థను పునరుద్ధరింపవలయుననియు, వేశ్యాగణమున పడుపువృత్తిని నిర్మూలించి దాని తావున వివాహవ్యవస్థను నెలకొల్పవలయుననియును గదా. అందుకుగూడ ఇప్పు డామె కవకాశములు దూరము లయినవి. ఇంతవఱకును ఆమె తన్ను వేశ్యాపుత్రిగా భావించియున్నది. "వీరభద్రప్ప తన కన్నులు విప్పి తన జన్మప్రకారమును వినిచినాడు; కామాక్షి సత్యమే యని దృఢీకరించినది. తాను త్రైవర్ణికులలో నొక వర్ణమువారి యాడుపడుచట. తన తలిదండ్రు లీ వర్ణవ్యవస్థకు గూడ అతీతులైన పరమ వీరశైవులట. తనకుగూడ వర్ణములు, హెచ్చు లొచ్చులు అనువానిపై అభిమానము లేదు. మానవులందఱు ఒకే కులమువారని తన యెన్నిక. ఏదైన విభేదమున్నచో దుష్టులు, శిష్టులు అని మాత్రమే యుండవలయును. ఇప్పుడు తాను తన స్వభావసంస్కారముల కనువైన కుటుంబము వారితో నెయ్యము సల్పినది. ఇట్టి స్థితిలో తాను వేశ్యా సంఘమును సంస్కరించుట అసాధ్యము. తమ సంఘమునకు చెంద

నట్టియు, వేశ్యాపుత్రిక కానట్టియు, తన మాటను, తనయుద్యమమును వారేల బలపఱతురు ?'' కనుక తత్ప్రయత్నము నామె విరమింపవలసి వచ్చినది. ఆస్థానన ర్తకీ పదముపై యామెకు మక్కువయే లేదాయె. అదియునుగాక కృష్ణభూపతి ఈ నెపముతో తన్ను గైవసము చేసికొనఁ జూచుచున్నాఁడనియు నామెకు తట్టినది. విరుపణ్ణతో నామె యిట్లన్నది :

పద్మిని : ''ప్రభూ ! నా కాస్థానన ర్తకీపదము వలదు. కృష్ణప్ప పొత్తును వలదు. నా జీవితమును మీ కుటుంబములో నన్నొక్క వ్యక్తినిగా మన్నించిన సార్థకము చేసికొందును. ఇట్టి యభిప్రాయముతోనే అలనాఁడు మీ దంపతుల నాశ్రయించినాను. ఇప్పు డద్దానికి భిన్నము జరుగనీయకుఁడు.

విరుపణ్ణ : ఔనమ్మా ! అందుకు మా యభ్యంతరము లేదు. కాని ఆస్థాన న ర్తకీ పదవి అంతకన్న గొప్పదికదా ! వెదకికొనుచువచ్చిన ఆపదమునుగూడ తిరస్కరించెదవా?

పద్మిని : వలదు వలదు. ఆస్థాన న ర్తకీపదమే కాదు. దేవేంద్రుని సుధర్మాసభా న ర్తకీపదవిగూడ నన్ను మోహపెట్ట లేదు ప్రభూ ! నన్ను మన్నింపుడు. ఇంతటి మహనీయులకు మీకు నేను బరువు కాను.

కామాక్షి : మీరు పద్మిని మనస్సు నర్థము చేసికొనలేదా స్వామీ ! ఆమె మన కుటుంబమును వీడజాలదు. ఆమె ప్రార్థనను మన్నించుటయే యిప్పుడు మన క ర్తవ్యము.

ఆలోచించిన కొలది విరుపణ్ణకు ఇది కృష్ణప్ప వేసిన యెత్తుగానే తోచినది. ఆత డామె ప్రార్థనను ముద్దు చేసి కృష్ణప్పకు లేఖ వ్రాసినాడు.

"పెనుగొండ దుర్గాధిపతులకు,

మీ లేఖ చూచుట యైనది. పద్మినీ దేవికి ఆస్థాన నర్తకీపదముమీద మనస్సు లేదు. ఆమె మాతో బాటు లేపాక్షిలో పాపనాశేశ్వరాదుల నారాధించుచు జీవితమును సార్థకింప జేసికొన కృతనిశ్చయురాలై యున్నది. ఇట్టిస్థితిలో మేము చేయదగిన దేదియు లేదని వ్రాయవలసి వచ్చినందుకు చింతిల్లుచున్నాము.

ఆత్మీయుడు,
విరుపణ్ణ.

లేఖ చదువుకొన్న కృష్ణప్పనాయకు డగ్గిమీదిగుగ్గిల మైనాడు. ఆతడు వేసిన యెత్తు పాఱలేదు. "ఇందుకు కారణభూతుడు విరుపణ్ణయే. విరుపణ్ణ అండదండలు చూచుకొనియే పద్మిని మిట్టిపడుచున్నది. లేకున్న ఒక దుర్గాధిపతి ప్రాపు నామె యేల కాదనును. విరుప డా పిల్లను తన కుమారుని కంటగట్టనెంచి యీయామెకేవో మాయమాటలు చెప్పి మనస్సు విఱుగదీసి యుండును. కానిమ్ము! ఈతని యాటలు కట్టింపలేకపోను. ఈ దేవాలయ శిల్పము లెట్లుకడముట్టునో చూచెద. విరుపణ్ణ కుటుంబ మాపదలను కొని తెచ్చుకొనుచున్నది. అతడు పద్మినిని నా కప్పగించునేమో, పాప మేదో యుద్యోగ మిప్పింతమని

యనుకొంటిని. ఆతనికట్టి యదృష్టము లేదు. ఈ కృష్ణభూపతితో కయ్యము పెట్టుకొని విరుపడేమి బాముకొనునో చూచెద. సదా శివరాయలకు చెప్పి శిక్షింపజేసి నా పగ తీర్చుకొందును. నేను తలంచినచో మరణ శిక్షయే వేయింపవచ్చును. కాని మరణము మానవుని కష్టములనుండి కడ తేర్చును. బ్రతికియుండియే బన్నముల పాలగున ట్లీ యధముని దుర్గతిపాలు సేయుదునుగాక. నిలువున కన్నులూడ బెఱికించి గ్రుడ్డివానినొనర్చి జన్మాంతము ఈ కృష్ణప్పనాయకుడు గుర్తుండునట్లు చేసి మఱి కక్ష సాధించెదను."

ఇట్లు తలపోయుచుండగనే కృష్ణప్పకింకొక యాలోచనము తట్టినది. "కార్యసాధకుడెప్పుడును తొందరపడరాదు. తొందర కార్యసాధకముగాదు. ఓర్పుతోడనే పనిని సాధింపవలయును. దురాగ్రహమంతకంటెను మంచిదికాదు. అది కార్యములను మొదలంటచెఱచును. నేనిప్పుడే దురాగ్రహముపూని విరుపణ్ణను ఆపదలపాలు చేయబూనినచో ఆతడు నాశనము కావచ్చును. అంతమాత్రమున పద్మిని నా కెట్లు లభించును. కనుక ఇప్పుడింకొక యుపాయమును ప్రయోగించుటయే రాజ్యతంత్రజ్ఞులు చేయవలసినపని. నావద్ద వీరణ్ణ కుమారుడు చెన్నబసవప్ప యున్నాడు గదా! ఆతడు మంచి ఉపాయశాలి. ఎట్టిదుర్ఘట కార్యములనేనియు చక్కబెట్టుకొనిరాగల ప్రజ్ఞ యాతనికున్నది. అందుకే అతడు ప్రత్యర్థి పుత్రుడైనను ఉద్యోగము నుండి తొలగింపనైతిని. ఇప్పుడాతని నీ కార్యసాధన కుపయోగించుకొందును." ఇట్లు తలంచి, వెంటనే చెన్నబసవప్పను రప్పించి, చెప్పవలసినవన్నియు జెప్పి, "విరుపణ్ణ పద్మినిని తన కర్పించినచో

ఉభయుల మధ్య నెయ్యము కొనసాగి మేలు గూర్చుననియు, లేకున్న విషమ ఘట్టముల నెదుర్కొనవలసి వచ్చుననియు బోధించి కార్యము సాధించుకొని రావలసినదని" పంపెను.

*

చెన్నబసవప్ప లేపాక్షికి వచ్చినాడు. ఆతడు నాట్య మండప శిల్పములు పూర్తి యైనపిమ్మట చూడలేదు. అవి అత్యపూర్వములని వినియున్నందున వెనువెంటనే వీరభద్రా లయమునకు విచ్చేసినాడు. కొంతసేపు ఆ యా సుందరశిల్పము లను తిలకించినాడు. పాపనాశేశ్వరునికి, కులదైవమగు వీరభద్ర స్వామికి, రఘునాథమూర్తికి ప్రణమిల్లినాడు. గౌరీదేవిసందర్శనము నకై యా దేవి కడకు వచ్చినాడు. గౌరీమూర్తి మొగమంతయు పసుపు పూసికొని సూర్యబింబమువంటి కుంకుమబొట్టుతోను మెడలోని హారములతోను అనుగ్రహదృష్టితో ఆతని నాహ్వా నించినది. ఆ మూర్తికెదుట నెవ్వతెయో యొక సుందర స్త్రీ మూర్తి యాతని కగపడినది. గర్భాలయము చీకటిగా నున్నం దున దీపపు కాంతిలో ఆపిల్ల నాతడు గుర్తింపలేకపోయినాడు. ఆమె నిశ్చల భక్తితో గౌరిని ధ్యానించుచున్నది. ఆమె మోమున చిఱు చెమ్మటచుక్కలు ముత్తెములవలె వ్యాపించి యున్నవి. పెదవు లేదో మంత్రమునో, ధ్యానశ్లోకమునో జపిం చుచున్నట్లు తోచినది. ఆతడామె నించుక సమీపించినాడు. పరికించి చూడగా ఆ పిల్ల తన పెత్తల్లి కామాక్షమ్మగారి మేనగోడలు గౌరియే.

ఆతడు గౌరిని చూచి చాల కాలమైనది. అప్పు డామెలో ఇంత యందమున్నదని యాతడు గుర్తించలేదు.

రోజులు గడచునప్పటికి గౌరి శరీరము, అవయవములు ఎంత సొంపుగా వికసించినవి. ఈనాడు గౌరి భూలోకమున కవత రించిన మన్మథపత్ని రతిగా చెన్నబసవప్పకు తోచినది. ఆమె సోయగమాతని నాకర్షించుచున్నది. ఆ పిల్లను కామాక్షి వీరభద్రప్పకు చేసికొనవలయునని చూచుచున్నట్లు అతనికి లీలగా మాత్రమే తెలియును. ఇట్టి స్థితిలో ఆ పిల్లమీదికి తన మనస్సు పోవుచున్నది. తన కోరికను ఆ పిల్లయును పెద్దవారును ఆమోదింతురా? చెన్నబసవప్ప వచ్చినపనినిగూడ మఱచి యేదో భావనాజగత్తులో సంచరించుచున్నాడు. ఇంతలో గౌరి దేవీ పూజ ముగించుకొని గర్భాలయమునుండి ఈవలకు వచ్చుచున్నది. హఠాత్తుగా ఆమెకు చెన్నబసవప్ప దర్శన మైనది. ఇంతవఱకు ఆమె దృష్టిలోనున్నది గౌరీదేవి ముఖము. ఇప్పుడు ఆమెకగపడినది తన కాపుడైన చెన్నబసవప్పముఖము. ఈ సంఘటన కాపిల్ల వింతపడి సిగ్గుతో ముడుచుకొనిపోయినది. ఆతడు తనకు వరుసకు బావగనుక ఆతని నెట్లు పల్కరింప వలయునో తోచక ఆ పిల్ల ముసి ముసి నవ్వులు నవ్వుకొను చున్నది.

చెన్నబసవప్ప: ఓహో! గౌరియా? అనుకొనకుండగనే అగ పడినావే!

(గౌరి మాటాడ లేదు.)

చెన్న: ఒంటరిగా నున్నప్పుడుగూడ సిగ్గుపడిన నెట్లు? సిగ్గు పడవలసినది ఇతరులు చూచుచున్నప్పుడు. ఈ గౌరీ పూజ యెందుకో?

(గౌరి తలమునుకలగుచున్న లజ్జతో పలుకనే లేదు.)

చెన్న : ఓహో ! తెలిసినదిలే. పెండ్లికి ముందు పెండ్లికూతులు గౌరీపూజ చేయుదురు. వివాహ మేమైన నిశ్చయ మైనదా ?

గౌరి : పో, బావ ! నీ కెప్పుడును పరిహాసములే.

చెన్న : ఈడు వచ్చిన పిల్లలు పెండ్లి చేసికొనుటలో పరిహాస మేమున్నది గౌరీ! మఱి పెండ్లికొడుకు వీరభద్రప్ప యెక్కడ ?

గౌరి : వీరభద్రప్ప నన్ను పెండ్లియాడునని మీ కెవరు చెప్పినారు ?

చెన్న : మీ అత్తగారు-మా పెదతల్లి.

(మఱల గౌరి మాటాడ లేదు.)

చెన్న : ఏమి, మాటాడవు ? వివరము లడుగుచున్నానని, కోపమా ?

గౌరి ముఖమున ఏదో నిరాశ తోచినది. అటుపిమ్మట ఒక జాలిరేక ఆమె మోమున తొంగి చూచినది.

చెన్నబసవప్ప వీరభద్రప్ప గౌరిని పెండ్లియాడుటకు సుముఖుడుగా లేడని గౌరి వైఖరినిబట్టి తెలిసికొన్నాడు.

(బతిమాలుచున్నట్లు దీనముగా అతడన్నాడు.)

చెన్న : గౌరీ! ఉన్నరహస్యము నాకు చెప్పవా? నిన్ను గూర్చి వీరభద్రప్ప యభిప్రాయ మేమి? వాడు తల్లి మాటను గూడ కాదనుచున్నాడా యేమి?

గౌరి : ఏమో నాకు తెలియదు. ఆయన అందగాడు. ఆయనకు నేను తగినదాననా యేమి? ఏ పద్మినీజాతి కన్యయో ఆయనను వరించును.

గౌరి మాటలు చెన్నబసవప్పమీద అమృతము చిలికి నట్లయినవి. ఆతడు వీరభద్రప్ప గౌరిని పెండ్లాడ నిష్టపడుట లేదనియు, అతని చూపు పద్మినిపై నున్నదనియు నిశ్చయించు కొన్నాడు. అతడు వలపు నిండారు చూపులతో గౌరివంక చూచుచు ప్రేమరసము చిప్పిలునట్లు "గౌరీ!" అన్నాడు. ఆ మాట గౌరిని దేవేంద్రుని సుందర నందనోద్యానములో విహరింపజేసినది.

గౌరి : నాకడ్డములెమ్ము బావా! నేను పోవలయును. మన మిద్దఱ మిచ్చట నిట్లు ఒంటరిగా మాటాడుకొనుచో అత్తయ్య యేమనుకొనును?

చెన్న : అత్తగారికి భయపడవలసిన రోజులు ముందున్నవి గౌరీ! ఇప్పుడు నేను నీ కడ్డము నిలువలేదే! పోవ నిష్టములేక యిట్లనుచున్నావు.

అని యాతడు గౌరిపోవు మార్గమునుండి ప్రక్కకు తొలగుచుండగా విరుపణ్ణ యచ్చటకు వచ్చినాడు. గౌరి వెళ్ళి పోయినది.

చెన్నబసవప్ప పెదతండ్రికి కృష్ణభూపతి రాయబార మును పూసగ్రుచ్చినట్లు వివరించినాడు. కృష్ణప్ప దుండగము లను, ప్రజల నాతడు హింసించి పన్నులనెపమున ధనసంపాదన సేయుటనుగూర్చి చెప్పినాడు. ఆతడు పరమదుర్మార్గు డనియు, పద్మినిని వాని కప్పగించుటయే తమ కుటుంబమునకు క్షేమ మనియు చెన్నబసవప్ప గట్టిగా హెచ్చరించినాడు.

విరుపణ్ణ కది నచ్చలేదు. అభయ మొసగి ఆశ్రయ మిచ్చిన పిల్లను వేటకానికి పెంపుడుచిలుక నిచ్చినట్లు కృష్ణప్ప పాలుసేయుట కాతని మన మంగీకరింప లేదు. కడ కాతడు పద్మినీదేవి కులశీలములను గూర్చియు, పద్మినీ వీరభద్రుల ప్రణ యమును గూర్చియు చెన్నబసవప్పకు తేటపఱచినాడు. పెద తండ్రి తనకు పరమ పూజ్యు డగుటయేకాక, లోకులకును ఆరాధనీయుడని తెలిసిన ఆ పిల్లవాడు ఏమియు ననజాలక పెనుగొండకు విచ్చేసి కృష్ణభూపతికి నమస్కరించినాడు.

కృష్ణప్ప : పద్మినీదేవిని తీసికొని వచ్చితివా ?

చెన్న : లేదు ప్రభూ !

కృష్ణప్ప : ఎందుకని ? విరుపణ్ణ యామెను పంపనన్నాడా ?

చెన్న ఔను-ప్రభూ

కృష్ణప్ప : ఆ బోగముపిల్లను తన కుమారుని కంటగట్ట జూచు చున్నాడా ? లేక తానే యనుభవించుచున్నాడా ?

చెన్న : శివ శివ ! పాపము శాంతించుగాక. పెదనాయన గారి నంత మాట యనకుడు. ఆయన సత్పురుషుడు. పద్మినీదేవి వేశ్య కాదు ప్రభూ !

కృష్ణప్ప : వేశ్య కాక ఇంకెవరు ?

చెన్న : ఆమె ఒక ద్విజబాలిక. బ్రాహ్మణియో, వైశ్యయో యట. ఆమె తలిదండ్రుల పూర్వులు వీరశైవమతమును స్వీకరించి లింగాయతులైనారట.

కృష్ణప్ప : ఇక నేమి ! ఆ జంగముపిల్లకు ఈ జంగము దేవరలకు పొత్తు కలసినదన్నమాట.

చెన్న : ప్రభువులు శైవదూషణము చేయుచున్నారు. జంగములు తక్కువవారు కారు.

కృష్ణప్ప : ఇంతకును ఆ పిల్లను వశపఱచుకొనుట కిది మీ పెదనాయనగారు వేసిన యెత్తుగా నున్నదే! కాకున్న ఆమె కుప్పాయమ్మ యింట నేల పెరుగవలసి వచ్చినది?

చెన్న : కాదు - ప్రభూ ! కాదు. పద్మిని పుట్టిల్లు అనంతపురము. ఆమె తండ్రి నంజుండప్ప. ఆత డీ పిల్ల, తల్లి కడుపులో నుండగనే మరణించినాడట. ఈమెను కనగానే తల్లియు మరణించినదట. నాడు ప్రక్కయింటనే యున్న కుప్పాయమ్మ ఆ దిక్కులేని పిల్లను దగ్గఱకు దీసి పెంచి యింతదానిని జేసినదట. ఈ సంగతులన్నియు మా పెదతల్లి కామాక్షమ్మగారి పుట్టినిల్లు అనంతపుర

మయినందున ఆమెకును మా పెదనాయనగారికిని తెలియును.

కృష్ణప్ప : ఇక నీవు వెళ్ళవచ్చును.

నంజుండప్ప పేరు వినగనే కృష్ణప్పనాయకుని తల తిరిగి పోయినది. అత డాలోచనలో పడినాడు.

నంజుండప్ప వీరశైవమాత్రుడు కాడు. అత డొక శివ యోగి. గాఢమగు శివభక్తిని జనులలో ప్రచారము చేయుటకే యాతడు జీవితము నంతయు ధారపోసినాడు. ఆతడు ముదిమి వచ్చువఱకు సంతానవంతుడు కాకపోవుటగూడ ఆతని మత ప్రచారమున కుపయోగించినది. ఆయన ఊరూరు తిరిగి భక్తు లకు పంచాక్షరీమంత్రము నుపదేశించుచు శైవమును వ్యాపింప జేసెడివాడు. కృష్ణప్పనాయకుని తలిదండ్రులకుగూడ నంజుండప్ప పంచాక్షరీమంత్రోపదేశము చేసి వారిని శైవుల నొనర్చినాడు. కృష్ణప్పయొక్క బాల్యమున అప్పుడప్పుడు ఆ శివయోగి అతనికి విభూతులు పెట్టుట, రక్షరేఖలు కట్టి రోగాదులను పోగొట్టుట కూడ జరిగినది. ఈ సమస్తవిషయములును నంజుండప్ప పేరు వినగనే కృష్ణప్ప మనస్సులో స్ఫురించినవి.

నంజుండశివయోగి కృష్ణప్పనాయకుని తలిదండ్రులకు గురువై వారియింటికి రాకపోకలు చేయునప్పటికి ఆతనికి సంతా నము లేదు. తరువాత సంతు కలిగినదీ లేనిదీ కృష్ణప్పనాయ కునికి తెలియదు. ఇప్పుడు చెన్నబసవప్ప చెప్పగా ఆతనికి సర్వ విషయములును గుర్తుకు వచ్చినవి. అయినను అతనికి పద్మినిపై

యాశ నశింపలేదు. అది ప్రతిహతమై తీవ్రక్రోధముగా మారి నది. విరుపణ్ణకు తగిన దండనము విధింపజేసి, పద్మినీవీరభద్రుల ప్రణయయాత్రను భంగమొనర్ప వలయు ననియే యాతడు నిశ్చయించుకొన్నాడు.

పెనుగొండమండల ప్రజలకు కృష్ణప్ప యాధిపత్యమునం దిష్టములేదు. విరుపణ్ణ మండలాధిపతియైన తరువాత చేసిన ప్రజాసౌకర్యములు వారిని శాశ్వతకృతజ్ఞతాబద్ధుల నొనర్చి నవి. కృష్ణప్ప ప్రజలకు చేసిన యుపకార మొక్కటియు లేదు. మీదుమిక్కిలి సామ్రాజ్యము దక్షిణదేశపు తిరుగుబాటు నెదుర్కొన యుద్ధములో చిక్కుకొన్నదను నెపమున కృష్ణప్ప నాయకుడు పన్నులను పెంపుచేసినాడు. వాణిజ్యముమీదగూడ సుంకములు పెంచబడినవి. సౌకర్యములు లేని ప్రజలు పెద్దపెద్ద పన్నుల నెట్లు చెల్లింపజాలుదురు? ఈ డబ్బు సద్వినియోగ మగుటకూడ లేదు. అంతయు దుర్గాధిపతి భోగములకే చాలుట లేదు. ఇట్టి ప్రభువులపై ప్రజలకెట్లనురాగ ముండును? వారు పన్నులకోసమై ప్రత్యేకించిన ధనమును దుష్టప్రభువునకిచ్చి దుర్వినియోగ మొనర్పనేల యనియు, విరుపణ్ణ కిచ్చిన కళా వికాసము జరుగుననియు నెంచి కృష్ణప్పకు చెల్లింపకుండ, లేపాక్షికి తెచ్చి, శిల్పకార్యముల కుపయోగింపుడని విరుపణ్ణ కిచ్చుచున్నారు. ఇది పన్నులకు సంబంధించిన డబ్బని విరుపణ్ణ కేమి తెలియును? ఆతడా ధనముతో శిల్పకార్యములు విస్త రింపజేయు చున్నాడు. పన్నులడబ్బే కాకుండ సొంత డబ్బును గూడ ప్రజలు విరుపప్రభువునకు సమర్పించుచుండిరి.

ఇట్టి స్థితిలో ధనముకోసమై కృష్ణప్ప విజయనగర కోశాధీశుడైన తన సోదరుడు తిమ్మప్పనాయకుని సాయ మపేక్షింప వలసి వచ్చినది. ఆత డిదివఱకే విజయనగరకోశములోని రత్నరాశులను, వెండి బంగారములను గాంచి కన్నుగుట్టి యా విత్తమును స్వార్థమున కుపయోగించుకొన మొదలిడినాడు. ఇప్పుడం దన్నగారికిగూడ భాగము పెట్టవలసివచ్చినది. సోదరు లిరువురును గలసి బొక్కసములోని రొక్కమును యుద్ధములో నిమగ్నుడైన రామరాజునకు బంపుచున్నట్లు నటించుచు కోశమును ఖాళీ చేసినారు. సామ్రాజ్యము పెద్ద ధనసంకటము నెదుర్కొనవలసి వచ్చినది. పెనుగొండ ప్రజ లేమో కృష్ణప్ప కెదురు తిరిగి పన్నులు చెల్లించుట లేదాయె. కృష్ణప్ప యిప్పుడు విషమస్థితిలో పడినాడు.

# 19

లేపాక్షిలో చిత్రరచన పూర్తియగుచుండగనే వీరభద్రప్ప కొక యాలోచనము తట్టినది. ముఖమండపార్ధమండప నాట్యమండపములు మనోహర శిల్పములతోను చిత్తరువులతోను కళకళలాడుచున్నవి. కాని ఉత్సవ సమయములందు పార్వతీపరమేశ్వరుల కల్యాణము జరుపుటకు ప్రత్యేక మంటపము ఒకటున్నచో బాగుండునుగదా! ఆతడు ప్రధానాచార్యునికిని, తండ్రికిని తన యభిమతమును సూచించినాడు. వారిరువురును వీరభద్రప్ప శిల్పారాధనోత్సాహమునకు సంతసించినారు. కల్యాణమండప నిర్మాణమునకు వాస్తుశిల్ప విధానము నిర్ణయింపబడినది. శంకుస్థాపనమునాడు కామాక్షి మేన

గోడలు గారికి పూజాద్రవ్యముల పళ్ళెరమునిచ్చి తాను శంకువు నొక పళ్ళెములో నుంచుకొని తెచ్చుచున్నది. నాట్యమండప శిల్పములా పిల్ల దృష్టి నాకర్షించుచున్నవి. ఆమె వానిని చూచుచు నడచుటలో అడుగులు తడబడి ముందుకు మొగ్గి నది. పళ్ళెయములోని పూజావస్తువులు నేలపై బడి పోయినవి. కామాక్షి ఇది యొక అశుభమని భావించినది. అయినను జరి గిన దానికి చేయునదేమి ! పురుషోత్తమ స్థపతి కానాటి శంకు స్థాపన కార్యము సంతృప్తిని గూర్పలేదు.

కల్యాణమండపమును శిల్పసుందరముగా నిర్మించుటకు ఆంధ్ర, తమిళ, కర్ణాటక శిల్పులందఱును పూనుకొనవలయు ననియు, వారు బత్తెనాచార్యుని సూచనలను బాటింపవలయు ననియు పురుషోత్తమస్థపతి నిర్ణయించినాడు.

*

చిత్రకళానిధి రామోజు విరుపణ్ణ సోదరులకు ఆలయ మండపాదులలోనున్న చిత్తరువులను పరిచయము చేయ బూను కొన్నాడు.

“ప్రభూ! వీరభద్రాలయమునకు ముందున్న ముఖమండ పము పై భాగమును గాంచుడు. అది మీకు పరమోపాస్యు డైన వీరభద్రస్వామి చిత్రము. ఇరువది నాలుగడుగుల పొడ వును, పదనా అడుగల వెడల్పునుగల యీ చిత్తరువును పదు గురు శిల్పులు తమ కళాశక్తులను ధారవోసి చిత్రించినారు. మీ కుటుంబసభ్యులు సపరివారముగా ఆ స్వామి నారాధించు

చున్నట్లు తీర్చినాము. ఆమూర్తి ఎంతటి భయాశ్చర్యములను గొలుపుచున్నదో చూడుడు. పైకప్పు బండలను చిత్రరచనకు తగునట్లు చేసికొని కుంచెలతో వానిపై రంగుల సమ్మేళనముతో బొమ్మలువ్రాయుట కష్టమైనపని. కుంచె కద్దినరంగు దిగువకు జారుచుండుటచేత చిత్రకారు డందుకు పడవలసిన శ్రమ అనుభవైకవేద్యమే.''

విరుపణ్ణకు ఆ చిత్రజగత్తునంతను గాంచునప్పుడు శైవ ప్రపంచములో తిరుగుచున్నట్లే యనిపించినది. ఆతడు రామోజును గాంచి యిట్లన్నాడు :

"మహాశిల్పీ! ఇవి యన్నియు శివలీలలు కాబోలు. ఎంత యుజ్జ్వలముగా చిత్రించినారయ్యా! ఆయుష్పూర్తి నందిన మార్కండేయుని యముడు పాశబద్ధుని జేయుచున్నాడు. ఆయన శివుని ప్రార్థించుచున్నాడు. శివు డా భక్తు ననుగ్రహించి లింగమునుండి సముద్భవించి యముని బెదరించి భక్తుని రక్షించినాడు. ఆహా! ఈ లింగోద్భవమూర్తి యెంతసుందరము. ఓహో! ఈ చిత్తరువు దక్షిణామూర్తియా! వటవృక్షము క్రింద జ్ఞానముద్రావిశిష్టుడై వృద్ధశిష్యులగు సనకసనందాదులకు ఆత్మతత్త్వము నుపదేశించుచున్నాడు. నీకు నమస్కారము స్వామీ! ఆ చండీశానుగ్రహమూర్తి, ఆ అర్ధనారీశ్వర మూర్తి, ఆ కల్యాణసుందర, గంగోద్భవ, త్రిపురసంహారమూర్తు లెంత మనోహరములు! శిల్పీశ్వరా! మీ శిల్పిపరివారము ధన్యమైనది. నిరంతరము దైవభావనచేయుచు ఆ దైవములను చిత్తరువులుగాదిద్ది లోకుల కందించు మీ శిల్పదీక్ష ఎంతటి దివ్యయోగమయ్యా!

"ఇది యేమి ? చిఱుతొండనంబి కథయా ? ఆ మాయా జంగమరూపుడైన శివుని దర్శనము, కుమారుని సఱికి తన్మాంసముతో కూర వండిపెట్ట చేయులాడని యా చిఱుతొండనంబి దంపతుల దుఃఖముతోడి రూపములు ఎంతచక్కగా రంగులలో రంగరించినారు. ఓహో! ఇది దక్షయజ్ఞధ్వంస గాథయా ? మా యభిప్రాయము నూహచేసి యీ గాథను చిత్రించి యుందురు కాబోలు. మా యిలువేల్పగు వీరభద్రుని జన్మ కథను తీర్చి మాకు ముదము కూర్చినారు మీ చిత్రకారులు. ఎంతటి పరేంగితజ్ఞులు వారు. ఇది కిరాతార్జునీయ కథయా ? వారు మాయా కిరాతీ కిరాతులా ? పందికోసము పోరాడు నా శంకరార్జునుల యుద్ధాటోపము లెంత భయంకరముగా నున్నవి!

"శివుడు బ్రహ్మకపాలమును కేలబూని దారుకావనికి భిక్షార్థమేగినాడు. మునిపత్నులా కామేశ్వరమూర్తిని గాంచి మన్మథపారవశ్యము నందినారు. ఈ రూపములెంత నయన మనోమోహనములు! నాట్యమండపోపరిభాగమున నున్న సహస్రదళపద్మము ఆధ్యాత్మికప్రబోధము సలుపుచున్నదే. ఈ నిలువుగోడలమీద, ముఖమండప పార్థమండప, నాట్యమండపములమీద, వందల సంఖ్యలో తీర్పబడియున్న చిత్తరువుల నొక్కనాడు కాంచి తనివిచెందలేము శిల్పాచార్యా! మధ్యాహ్న శివపూజావేళ యైనది. మఱలవచ్చి చూతును." అని విరుపణ్ణ తమ్మునితోగూడ వెడలిపోయినాడు.

ఆయన పోయినదే తడవుగా పద్మినీ వీరభద్రులా మండపములో ప్రవేశించినారు. పద్మినీదేవి మున్ముందుగా మండ

పోపరిభాగమునందున్న వటపత్రశాయి శ్రీకృష్ణ చిత్రమును గాంచినది. ఆ బాలుడు మఱ్ఱియాకుపై బవళించి మనోజ్ఞముగా దర్శన మిచ్చుచున్నాడు. పద్మినీ హృదయమున భక్తిభావ ముప్పొంగ కేలుమోడ్చి యిట్లు స్తుతించినది.

*"కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్య పత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి."

ఆమె మనస్సు బాలకృష్ణునిపై లగ్నమైనది. ఆమె ఆ బొమ్మ పాదముల దిక్కునకు వచ్చి చూచినది. ఆ కృష్ణుడు తన వైపే చూచుచున్నాడు. పార్శ్వభాగములకు వెళ్ళిచూచినది. అప్పుడును తచ్చిత్రస్థ కృష్ణుడు తన్నే చూచుచున్నట్లున్నాడు. ఆమె కాశ్చర్యము కలిగినది. ఈ వింత యేమాయని తల వైపునకు వెళ్ళి చూచినది. అప్పుడు సైత మాతడు తనవంకనే చూచుచున్నట్లున్నది. తన భక్తివలన అట్లు తనకు దోచినదేమోయని యామె వీరభద్రప్పను నలువైపులకుపోయి చిత్రమును దర్శింపగోరినది. ఆతనికిని ఆ చిత్తరువట్లే తోచినది. వారు రామోజు నీ వింత యేమని యడిగినారు.

"ఆ శిల్పి ఆ కృష్ణుని చిత్రించుటలో నేదో శిల్పరహస్యమును నిక్షేపించినాడు. అది యెవ్వరికైనను ఎప్పుడైనను ఏ దిక్కునుండి చూచినను తమనే చూచునట్లుండును. ఇది

*హస్తపద్మముతో పాదపద్మమును బట్టుకొని ముఖపద్మములో నుంచుకొనుచు మఱ్ఱియాకుపై బవళించిన బాలకృష్ణుని మనసార స్మరించుచున్నాను.

బాహ్యావిషయము. దీని యంతరార్థము వేఱు. వీరభద్రా! మానవులు ఏ దేశమున, ఏ కాలమున, ఎట్టిస్థితిలో ఏ పని చేసినను దానిని భగవంతుడు చూచుచునేయుండును. మనుష్యుడు అహంకారవశవర్తియై తాను దేవుని కన్నుగప్ప గలుగుచున్నాడని భావింపనచ్చును. ఆతడు మనుజులకన్నులను గప్పవచ్చును గాని, దేవుని కన్నులను గప్పజాలడు. దేవుని కన్నులు దిగ్దేశ కాలస్థితి భేదము లేకుండనే మనుజుల సర్వకృత్యములను గాంచు చుండును. దేవుడు సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్ర పాదుడు అని వేదము వర్ణించుచున్నది. ఆ సహస్రశబ్దమునకు వేయి యనియే అర్థము కాదు. అనంతమని భావము. ఆయన అనంతచక్షువు, విశ్వచక్షువు కూడ. వానిని మనము రెండు కన్నులతో చిత్రించుకొందుము. ఈ వటపత్రశాయి తన్ను చూచువారెటుపోయినను వారి వంకనే చూచుచు ఈ పరమ రహస్యమునే చాటుచున్నాడు. ఇది దీని యంతరార్థమయ్యా!'' అని వారి కద్దాని బాహ్యాంతరార్థములను వివరించినాడు.

ఆ గంభీరార్థమునకు వారు వింతపడి రామోజునకు కై మోడ్పు పెట్టి "శిల్పములందిన్ని రహస్యములున్నవని యెవరికి తెలియునాచార్యా! ఏదో, రంగులు రేఖలు చూచి తృప్తి పడుదుము. శిలాశిల్పమైన అందచందములు గాంచి ఆనంద పడుదుము. ఏ శిల్పి ఏమహాభావమును ఏ శిల్పములో ఎట్టి లక్ష్యముతో నిక్షేపించునో స్థూలబుద్ధి కేమి తెలియును? మీవంటి విజ్ఞుల వివరణము లత్యావశ్యకము లని మా కిప్పుడు తెలిసినది. ఈ వటపత్రశాయి రహస్యము నాయనగారు విన్నచో ముగ్ధు లగుదురు.'

అనుచుండగనే మాధ్యాహ్నిక శివపూజను ముగించు కొని విరుపణ్ణయు, వీరణ్ణయు నచ్చటికి విచ్చేసిరి. రామోజు వారికిగూడ వటపత్రశయనుని చూపి, అందలి రహస్యమును వివరించెను. విరుపణ్ణ "ఓ శ్రీకృష్ణా! ప్రాణములు పోవునప్పుడు వాతపిత్త శ్లేష్మాదులచేత కంఠమురుద్ధమై పోవును. అప్పుడు నిన్ను మనసార స్మరింపలేకపోవచ్చును. కావున ఇప్పుడే నా మనస్సనెడి రాజహంసను నీ పాద పద్మ పంజరములో జేర్చు కొనుము." అనునర్థముగల ముకుందమాలలోని దిగువశ్లోకమును కన్నులు మూసికొని పఠించెను.

"కృష్ణ! త్వదీయ పదపఙ్కజ పఞ్జరాన్తం
అద్యైవ మే విశతు మానస రాజహంసః,
ప్రాణప్రయాణ సమయే కఫ వాత పిత్తైః
కణ్ఠావరోధన విధౌ స్మరణం కుత స్తే?"

రఘునాథమూర్తి ప్రతిష్ఠ జరిగినప్పటినుండియు విరుపణ్ణ వైష్ణవ గ్రంథములనుగూడ చదువుచున్నాడు. మలయాళ దేశాధిపతియగు కులశేఖర మహారాజు రచించిన యీ ముకుంద మాలలోని శ్లోకములన్నియు విరుపణ్ణకు కంఠస్థములే. ఆతడు విష్ణు పురాణమునుగూడ ఇటీవల పండితులవద్ద శ్రవణముచేయు నారంభించినాడు. ఇట్లు శివకేశవాద్వైతభావన ఆయనలో పరిపక్వమునకు వచ్చుచున్నది. తరువాత రామోజు తక్కిన చిత్తరువులనుగూడ చూపుచు వివరింపబూనెను.

"ఇటువచ్చి ఈయుపరిభాగపు చిత్రములను తిలకింపుడు. ఇది మనుచోళరాజు కథ. మనుచోళుడు పరమధర్మమూర్తి.

ఆయన యెల్లప్పుడును ప్రజల మొఱ లాలించి, వారి కుపకార మొనరింప సంసిద్ధుడైయుండువాడు. అందుకాయన మొగసాలలో నొకగంటను గట్టించినాడు. అవసరమున్న వా రా గంటను మ్రోయించినచో రాజు శబ్దమును విని వచ్చి వారి యక్కఱలను దీర్చుచుండువాడు. ఒకనాడు రాజపుత్రుడు రథారూఢుడై రాజవీథిని బోవుచుండగా ఆవుదూడయొకటి రథచక్రముక్రిందబడి మరణించినది. ఆవు ఆ సంగతిని మనుచోళ మహారాజునకు మొఱపెట్టుకొన్నది. ఆ ప్రభువు తన కుమారుని బరుండబెట్టి ఆతనిమీదుగా రథము తోలవలసినదని ఆవునకు తీర్పుచెప్పి నాడు. భటులు రాజాజ్ఞను నిర్వర్తించినారు. రాజపుత్రుడు రథముక్రింద మరణించెను. రాజుగారి ధర్మబుద్ధికి మెచ్చి పరమే శ్వరుడు ప్రత్యక్షమై ఆవుదూడను, రాజపుత్రుని బ్రతికించి, వారి ననుగ్రహించినాడు. ఈ కథను తొండమండలమునుండి వచ్చినచిత్రకారులు పరమసుందరముగా చిత్రించినారు స్వామీ! ఆ చిత్తరువులను తిలకింతురుగాక!"

వీరణ్ణ: ఇది మాధవవర్మ కథవలె నున్నదే.

రామోజు: ఉండవచ్చును. తమిళులు ఇది మనుచోళునికథగా చెప్పుచుందురు.

విరుపణ్ణ: ఇది ద్రౌపదీ స్వయంవర గాథయా

రామోజు: ఔను. కృష్ణప్రేరణమున ధనుర్ధారియైన పార్థుడు అదిగో! యంత్రమత్స్యమును భేదించుచున్నాడు చూడుడు.

వీరణ్ణ ఓహో ఇది యెంతరమణీయముగా నున్నది శిల్పీశ్వరా! ఇచ్చట పార్వతీ దేవి శరీరము నలంకరించుకొను చున్నదా ? ఆ పిమ్మట ఆజగజ్జనని శివునితో చదరంగ మాడుచున్నదా ? ఇవి యెంత మనోహర చిత్రములు ! ఇది పార్వతీదేవి శయ్యామందిరముకాబోలు. శిల్పా చార్యా ! ఇంచలి కుడ్యములమీది యాలేఖ్యములలో శిల్పసౌందర్యము మిన్నుముట్టినదయ్యా ! వీనిని చూచిన పిమ్మట పాడులోకమును చూచుట పాపమని నాకు తోచుచున్నది.

రామోజు : ప్రభువు లిటు దయచేయవలయును. ఆ పై భాగ మును దిలకింపుడు.

వీరణ్ణ : ఏమీ ! అన్నగారిని నన్ను గూడా చిత్రించినారా ? ఈపని యెందుకు చేసినారు శిల్పిచంద్రమా ?

రామోజు : ఇది అత్యవసరము ప్రభూ ! కర్తలు కారయితలు తప్పక యిచ్చట నుండవలయునను తలంపుతో పురు షోత్తమ స్థపతివర్యుని, జక్కణాచార్యుని, బత్తైనను గూడ మీతోపాటు చిత్రించినాము.

వీరణ్ణ వారినిగూడా చిత్రించుట మాకు పరమామోదము. మహాశిల్పాచార్యులారా ! మీ కృషి ఫలితముగా లేపాక్షి అజరామరమైనది. దీని చరిత్రను భావికాల మున సువర్ణాక్షరములతో లిఖింతురు. ఇంతవఱకును

ఈ కొండమీద దేవతలు అదృశ్యరూపులై విహ రించుచున్నారని వినుచున్నాము. అట్టి దేవతలను మీరు సర్వకాలసర్వావస్థలయందును ప్రజలకు ప్రత్యక్ష మగునట్లు ఈ కొండమీద విహరింప జేసినారు. మీరెంత పుణ్యాత్ములు! మీ ఋణము నీలోక మెట్లు తీర్చుకొనును? మేమెట్లు తీర్చుకొందుము! ఈ కూర్మాద్రి ఈనాడు దేవతలు విహరించు సువర్ణాద్రియే యైనది. మేము ధన్యులమైనాము. మా ప్రయత్నము ఫలించినది.

పిమ్మట విరుపణ్ణ – రామోజు శిల్పాచార్యా! ఈ చిత్తరువులు సాక్షాత్కరించిన దేవతలవలెనున్నవిగాని, చిత్ర ములవలె లేవయ్యా! వీనిలో ప్రాణస్పందనము, చైతన్యము ఉన్నట్లున్నవిగాని, నిర్జీవముగా లేవు. ఇంతటి మహోజ్జ్వలము లైన యీ చిత్రములను జూడగనే నాకొక కథ జ్ఞప్తికివచ్చు చున్నది.

“ముగ్గురు శిల్పులు తమ శిల్పవిజ్ఞానమును రాజుగారి యెదుట ప్రదర్శింపనెంచి మూడు వస్తువులను తయారుచేసి, రంగులుసవరించి తీసికొని వచ్చినారట. అందు మొదటివాడొక తామరపూవును సుందరముగా తీర్చి తెచ్చినాడు. ఆ పూవు రాజుగారి యెదుట నుంచబడినది. కొంతసేపటి కది నిజముగా పద్మమే యనుకొని తుమ్మెదలువచ్చి దానిపై మూగినవట. రెండవవాడు ఎలుక నొకదానిని చేసికొనివచ్చినాడు. ఆ యెలుకను వంటయింటిలోపెట్టగా, పిల్లి అది నిక్కమైన మూషి కమే యనుకొని పరువెత్తికొనివెళ్ళి దానిని నోటకఱచికొని

మోసపోయినదట. మూడవవాడు రాజుగారి నొక యింటికి తీసికొనిపోయి మహారాజా ! నా శిల్పము ఈ తెరలోపల నున్నది. ఈ తెరను తొలగించుకొనిపోయి తాము దానిని దర్శింపవచ్చునని చెప్పినాడు, రాజు తెరను చేతితో తొలగింప బోయినాడు. అది తెరయే కాదు. ఒక గోడపై ఆ శిల్పి తీర్చిన తెరమాదిరిగా నున్న చిత్రమే యది. అప్పుడు రాజా శిల్పుల ప్రతిభ కచ్చెరువుపడి యిట్లన్నాడు : "ఓ శిల్పులారా ! మీలో మొదటివారు తీర్చిన పద్మశిల్పము కీటకమైన తుమ్మెదను వంచించినది. రెండవవారి యెలుక శిల్పము తిర్యగ్జంతువులలో చేరినపిల్లిని మోసముచేసినది. ఇక మూడవవారి శిల్పమన్న జ్ఞానశాలియు, కళావేత్తయునగు మానవునే వంచించినది. అని వారిని బహూకరించి పంపినాడట." మీ చిత్తరువు లిట్టి తరగతికి చెందినట్టివి. నాటి మయసభలోని శిల్పములును చిత్రములును ఇట్టివే కావచ్చునని నాకనిపించుచున్నది."

వీరుపణ్ణ యిట్లు చెప్పుచుండగనే ఎవరో యొక శివయోగి అచ్చటకు విచ్చేసినాడు. ఆయన వయోభారముచేత పండబారియున్నాడు. అతనికి నూరేండ్లు నిండియుండునని చూచిన వారికి అనిపించును. దబ్బపండువంటి మేని చాయ ఆతనిది. గడ్డము, మీసలు, తలవెండ్రుకలు నరసిపోయి మెఱుగువెట్టిన సన్నని వెండితీగెలవలె వెలుగుచున్నవి. ఆత డెంత యందముగను, ఆకర్షణీయుడుగను నున్నాడో వర్ణింపజాలము. లేబ్రాయమున ఆతని మూర్తి ఇంకెంత యందముగా నున్నదో తెలియదు. ఆతడు చంకలో నొక సంచిని, చేతిలో యోగదండమును దాల్చి విభూతిరేఖలను మెయినిండనలది రెండవశివునివలె

యన్నట్లు ప్రకాశించుచున్నాడు. ఆతనిని చూడగానే అప్రయత్నముగనే అందఱు చేతులెత్తి నమస్కరించిరి. వీరుపణ్ణ "తమరెవరో తెలిసికొనగోరుచున్నా"మని యనెను.

"నేనొక బైరాగినని నాయాకారమే చెప్పుచున్నది గదా. ఇంతవఱకును మహీశూరపురమునందలి చాముండేశ్వరి కొండమీద నుంటిని. ఏవో యోగాభ్యాసాదులతో జీవితమంతయు గడచినది. మీరు లేపాక్షిలో దివ్య శిల్పములను, చిత్తరువులను వెలయింపజేయుచున్నారని మా ప్రాంతపు జనులు విపరీతముగా చెప్పుకొనుచున్నారు. ఆ శిల్పములను దర్శించుచు పావనమగు నీ కచ్ఛపాద్రిమీద ఈశ్వరధ్యానముతో కొంతకాలము గడుపుదమని యెంచి వచ్చినాను. మీ కభ్యంతరము లేనియెడల నిచ్చట నుందును." అని యాతడు పలికెను. విరుపణ్ణ కాతనిమీద అప్పటికప్పుడే ఒక గురుభావము కలిగినది. "తా మిచ్చట నుండుటవలన మేము ధన్యులమగుదు."మని యాతడు తన యంగీకారమును చూపెను. పద్మినీవీరభద్రు లాయన యడుగులకు నమస్కరించి అతని దీవెన లందుకొనిరి.

ముఖమండపాదులలో శిల్పములును చిత్తరువులును పూర్తియైనందున, ఒకసారి తుది పర్యవేక్షణము జరుపదలంచి పురుషోత్తమ స్థపతి హంపణ మాచమూర్తులతో గలసి వచ్చినాడు. ఆయన ముఖమండపములోని పద్మినీ పాంచాలజాతి మూర్తులను గాంచినాడు. "హంపణాచార్యా! ఈ పద్మినీ

మూర్తికి పాదముల క్రింద నొక మకరమును జెక్కుము. అప్పు డామె గంగాదేవి కాగలదు. ఇంతవఱకు మీరెవ్వరును ఇచ్చట గంగామూర్తిని చెక్కినట్లు లేదు. పార్వతీమూర్తులే పెక్కులగ పడుచున్నవి. గంగాపార్వతులు శివుని ప్రియురాండ్రైనందున ఎవ్వరినీ మనము చిన్నచూపుచూడరాదు.'' అని ఆతని చేతిలోని సన్నని యులిని చిన్ని సుత్తెను తీసికొని వీరభద్రప్పకు ప్రతి నిధిగానున్న పాంచాలమూర్తి క్రింది పెదవిమీద ఆనునట్లు రెండు సన్నని కోఱలను చెక్కి విడిచినాడు. దానితో ఆమూర్తి వీరభద్రప్పదను భ్రాంతి పోయినది. ఆ శిల్పీశ్వరుడు ఎందుకట్లు చేసినాడో యెవ్వరికిని దెలియదు. అదేమని ఆయనను ప్రశ్నించు ధైర్యముకూడ వారిలో నెవ్వరికిని లేకపోయినది. హంపణ్ణ మకరమును తీర్చి పద్మినిని గంగాదేవి నొనర్చినాడు.

అటుపిమ్మట పురుషోత్తమ స్థపతి నాట్యమండపములోని కేగినాడు. వీరి వెంట కన్నప్ప యుండనే యున్నాడు. స్థపతి జక్కణ్ణతో నాట్యమండపములోని యొక స్తంభమధ్యమున కన్నప్పమూర్తిని తీర్పవలసినదని చెప్పెను. ఆతడాపని చేసెను. దానితో కన్నప్పకును, కన్నప్పకీర్తికిని శాశ్వతత్వము కలిగినది.

## 20

బత్తెనాచార్యుని యాధిపత్యమున మాచమూర్తి ప్రధాన కృషితో లేపాక్షిలో కల్యాణమండప నిర్మాణము సగపాలు పూర్తియైనది. ఎనిమిది దిక్కులయందును ఎనిమిది మహాస్తంభములు. ఆ స్తంభములమీద వరుసగా ఇంద్రుడు,

అగ్ని, యముడు, నిర్‌ృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు అను అష్టదిక్పాలురమూర్తులు వాహనాయుధాది సర్వలక్షణములతో గండరింపబడినవి. కావునదానిని అష్టదిక్పాలక మండపమని కూడ అనవచ్చును. స్తంభముల చుట్టును మఱి కొన్ని శిల్పములు చెక్కబడినవి. ముఖమండపార్ధమండప నాట్య మండపములకన్న, కల్యాణమండపము సర్వశ్రేష్ఠముగానుండ వలయునని పురుషోత్తమ స్థపతి సంకల్పించుకొనియున్నాడు. ప్రేమాస్పదుడగు కుమారుడు వీరభద్రప్ప సంకల్పము కావున నాతని యందచందములకు దగినట్లుగనే కల్యాణమండప మొప్పవలయునని విరుపణ్ణ సంపూర్ణ ప్రోత్సాహమిచ్చు చున్నాడు.

లేపాక్షిలోని శిల్పకళ చాలా భాగము స్తంభముల మూతగాగొని వెలసినట్టిదే. కుడ్యాదులమీదను, ద్వారముల మీదను నున్న శిల్పమంత ప్రధానమని ఆ శిల్పులు తలంచినట్లు లేదు. వారు తమ కళాచాతుర్యమును విరివిగా స్తంభముల మీదనే విన్యసింపపూనినారు. అందుకు కల్యాణమండపమొక విశిష్ట రచనము కావలయుననిగాబోలు శిల్పిగణమంతయు తన్నిర్మాణమున చేయివేసినది. ఒకవరుసగానున్న స్తంభావళిలో శివకల్యాణమునకు వేంచేసిన మహర్షి గణమును పరమసుందర ముగాతీర్చినారు. ప్రశాంతమైన బ్రహ్మవర్చస్సుతో నామూర్తులు ఆధ్యాత్మిక తేజోరాశులుగానున్నవి. వసిష్ఠ, దత్తాత్రేయ, నారద మూర్తుల సొగసు, సప్తర్షిగణ సౌందర్యము మనల ముగ్ధుల నొనర్చును. ఈమహర్షులు ఒకరున్న తీరులో ఇంకొక రుండక ఎంతో వైవిధ్యమును ప్రకటించుచున్నారు. వారిచంకలలోని

తాళపత్ర గ్రంథములను, చేతులలోనికమండలువులను పరికింపుడు. చేతులలోని జపమాలలు చూచినారా! శ్రీ మహావిష్ణువు, బ్రహ్మాది దేవతావర్గ మంతయు కల్యాణమునకు విచ్చేసినారు. పార్వతీపరమేశ్వర కల్యాణ శిల్పము అందమునకు నెలవు. గిరిజ శివశీర్షమునబోయు తలంబ్రాలనుగూడ నా శిల్పులు కఠిన పాషాణములమీద మలచిపెట్టినారు. కన్యాదాతలగు మేనకా హిమవంతులు పిల్లన త్తవారింటికి పంపునప్పుడు తలిదండ్రులు పొందు దీనత్వము ముద్దకట్టినట్లే చిత్రితులైనారు.

కల్యాణమంటప స్తంభశిల్పమును చూచుటకు పద్మినీ వీరభద్రులు వచ్చినారు. వారితోబాటు లక్ష్మియు, లలిత యును విచ్చేసినారు. లక్ష్మి లేప్రాయములోనున్న పిల్ల. ఆమె రెండవ అపర్ణాదేవిని బోలియుండును. ఆమె మోమున ఎల ప్రాయపుసారు కొలువుతీరి యున్నది. తనవద్ద నాట్యసంగీత ముల నభ్యసించు లక్ష్మిమీాద పద్మిని కెనలేని యభిమానము. అందును ఆమె ప్రధాన శిల్పాచార్యుని తనయగదా. ఆమె నెవ్వరభిమానింపరు? అనురాగరసము పొంగులువారుచుండగా పద్మిని లక్ష్మిని చేరదీసి యన్నది: "లక్ష్మీ! పెండ్లికూతురైన పార్వతిని చూడుము. ఈ పార్వతీమూర్తిని మాచమూర్తి తీర్చి నాడటమ్మా! అన్నిరీతుల నిన్నే పోలియున్నదీ జగజ్జనని. మాచ మూర్తి తన మేనమామకూతును శిల్పములో తీర్పజాలుదునో లేదో యని ప్రయత్నము చేసినట్లున్నది. చక్కగానే తీర్చి నాడుగాని, నీ చిన్నారి చిబుకముమీాదనున్న సూది బెజ్జమంత పుట్టుమచ్చను శిల్పించుటలోమాత్ర మోటుపడినాడాశిల్పి."

ఈ మాటలు వినుచున్న లక్ష్మిని నునుసిగు దొంతర లావరించినవి. ఆమె లజ్జాభయములతో ముడుచుకొని పోయి నది. ఈ హాస్యమాడునది తన యధ్యాపకురాలై నందున ఆమెకు తగిన సమాధానము చెప్పవీలుకాలేదు. ఇంకొకరి కైనచో ఆ పిల్ల చెంపమీద గొట్టినట్లు చమత్కారముగా సమాధాన మిచ్చెడిదే.

లక్ష్మి చురుకైనపిల్ల. ఆ చురుకుదనమునకు దగిన చక్కదనముగూడ నామెలో నున్నది. ఆమె భూమి కవత రించిన బాలాత్రిపురసుందరివలె నుండును. పురుషోత్తమ స్థపతి బాలామంత్రోపాసనము చేసిన కొలదిదినముల కా పిల్ల పుట్టిన దట. అందుచేతనే కాబోలు ఆమెలో చాలా సౌందర్యసౌశీల్య ప్రతిభాశక్తులు ప్రోగుపడినవి. స్థపతి యామెకు తన తల్లి పేరు పెట్టుకొన్నాడు. లక్ష్మిని తల్లిలేని పిల్లవాడైన మాచమూర్తి కిచ్చి పెండ్లి చేయవలయునని పురుషోత్తమస్థపతి యాశయము. ఆ యుద్దేశ్యముతోనే మాచమూర్తిని దగ్గఱకు దీసి యింత వానిని చేసినాడు.

లేపాక్షి వచ్చునాటికి లక్ష్మి ఈడేఱియున్నను, ఆమెకు వివాహ సంబంధమైన విషయము లాలోచించుకొను శక్తి లేదు. తగిన వయస్సురానిదే ఆడుపిల్లలకు వరులను గూర్చిన యాలోచనలు రావు. వారి మనశ్శరీరముల వికాసము ఒక స్థాయిని చేరుకొన్నగాని వారికట్టి తలంపు లవతరింప వీలు లేదు. ఇటీవలనే ఆమెకు వరనిర్ణయమును గూర్చి అభిప్రాయము లేర్పడుచున్నట్లున్నవి. రంగమండప నిర్మాతలలో ప్రాధాన్యము వహించిన జక్కణాచార్యునిపై ఆమెమనస్సు లగ్నమైనట్లున్నది.

మాచమూర్తి తన్ను పెండ్లాడ నువ్విళులూరు చున్నాడనియు, ఆతనికే తన్నీయవలయునని తండ్రి యాలోచనమనియు లక్ష్మికి తెలియును. అందుకే మాచమూర్తి కల్యాణమండపములోని పార్వతీమూర్తిలో లక్ష్మి సౌందర్యమును చిత్రించుకొని మురియుచున్నాడు. ఈ సంగతి పద్మిని యెఱిగియే యున్నది. కాని లక్ష్మికిమాత్ర మిది యిష్టముకాదు. ఎట్టకేలకు తెగించి లక్ష్మి యిట్లన్నది :

లక్ష్మి : ఈ పార్వతీమూర్తి కన్నను ముఖమండపములోని పద్మినీమూర్తియే నాకు బాగున్నది. జక్కణాచార్యుడు తనశక్తినంతయు ధారపోసి యామూర్తిని చెక్కినాడు. శిల్పనిర్మాణములో మా బావకన్న జక్కణయే దొడ్డ వాడని నేననుకొందును.

పద్మిని : అదేమమ్మా! అట్లందువు. మాచమూర్తి తక్కువ వాడా యేమి? కల్యాణమండపమూర్తులు పెక్కులు మాచమూర్తి సృష్టులే. అంతేకాక నాయనగారు తప శ్శక్తిచే నిర్మించిన నాగలింగేశ్వరుని కెదురుగా అంతటి పెద్దనందిని చెక్కిన శిల్పి నీ దృష్టికి చిన్నవాడుగా నున్నట్లున్నాడే!

లక్ష్మి : ఆ నంది బావ తెలివిచేత మాత్రమే అట్లు తయారు కాలేదు. తన్నిర్మాణమునందును జక్కణ, హంపణ్ణల ప్రజ్ఞయే పనిచేసినది. హోయసలయుగమున వెలసిన నందులను మీరు చూచినచో ఈ లేపాక్షి నంది యే సంప్రదాయము నెఱింగిన శిల్పుల సృష్టియో బోధపడ

గలదు. అట్లే వేలాపురియందలి చెన్న కేశవాలయము లోని మదనికామూర్తులను తిలకించినచో పద్మినీమూర్తి తీర్పునుగూర్చి తీర్పు చెప్పవచ్చును. ఇది అన్నివిధముల జక్కణాచార్యుల వారి శిల్పశైలీవిశిష్టము. నే నిటీవల నాయనగారితో బేలూరువెళ్ళినప్పు డా దేవాలయ శిల్పములను పరిశీలించి వచ్చినాను.

లలిత : మాచమూర్తిగారు జక్కణాచార్యుల వారికి తీసిపోవు వారు గారులే లక్ష్మి !

పద్మిని : అదేమిటి లక్ష్మి ! మీ బావగారి ప్రతిభనే నీవు విమర్శించుచున్నావు ? ఈ కల్యాణమండప స్తంభగత మూర్తులలో ఆంధ్ర శిల్పకళాముద్ర లెట్లు హత్తుకొన్నవో గమనించలేదా ?

లక్ష్మి : ఉత్తమ కళావిమర్శ చేయునప్పుడు నా వాడు పరుడు అను స్వపరభేదములు అడ్డు తగులరాదు. ఆ మమకారములో సత్యమగు విమర్శ సాగ నేరదు. మా బావకన్న జక్కణాచార్యుడెన్నో రెట్లు శిల్పరచనములో నధికుడు. అందుకు సందేహము లేదు. సందేహమున్నచో నాన్నగారి నడిగి తెలిసికొనవచ్చును.

లలిత : పద్మినీదేవిగా రన్నట్లు కల్యాణమండప శిల్పమచ్చముగా ఆం లి. రంగమండప మూర్తులు జక్కణాచార్య శైలిలో నున్నవి.

వీరభద్ర : పద్మినీ ! లక్ష్మితో ఏల వాదింతువు. ఆమె మహా శిల్పాచార్యులవారి పుత్రిక. శిల్పరహస్యము నర్థము చేసికొన్నట్టిది. ఆమెకన్న మనకెక్కువ యెట్లు తెలియును? పద్మినీమూర్తి బాగున్నదనుటలో నేనును లక్ష్మిదేవితో నేకీభవింతును. నీ వాదమునకు బలము లేదు. అదియునుగాక ఒక్కొక్కరికి ఒక్కొక్కరిమీద అభిమాన ముండును. దానిని కాదనలేము. ఇందుకు నీవే నిదర్శన భూతురాలవు. నీ యభిమత వ్యక్తులను నీవు చిన్నచూపు చూడగలవా ? లలిత యన్నట్లు ఇది ఆంధ్రశిల్ప శైలియే. రంగమండప శిల్పశైలిహొయసల శైలియే. దేని అందము దానిది !

వీరభద్రప్ప చేసిన ఈ వ్యంగ్య గర్భసంభాషణకు లక్ష్మి పద్మను లిరువురును సిగ్గుపడినారు. తన పలుకులతో ఆత డిరువురి గుట్టును బట్టబయలు చేసినట్లయినది. లక్ష్మికి మాచమూర్తిని పెండ్లాడ నిష్టము లేదనియు, ఆమె దృష్టి జక్కణాచార్యుని పైనున్న దనియు వీరభద్రప్ప గ్రహించినాడు. అందు కాత డాశ్చర్యపడ లేదు. తనకు మేనమామ కూతురు గౌరిపై నేల ప్రేమ లేదు. ఆమెగూడ చక్కని పిల్లయే, తెలివి తేటలు గలదే - కదా. పైపెచ్చు తన తల్లికి, తనకు గౌరినిచ్చి పెండ్లి చేయవలెననెడి మక్కువ చిన్ననాటినుండియు నున్నదే. కనుక ఈ కోరికలు, అనురాగములు, ఆశలు విచిత్రముగా నుండును. వీరి సంభాషణము నాలించుచున్న లలిత మొగము చిన్నవోయినది. లక్ష్మి మాచమూర్తిని విమర్శించుటను మెచ్చజాలక ఆమె యలిగినది.

శిల్పవిమర్శలోవలె సంగీత నాట్యములలోగూడ లక్ష్మి చురుకత్తివలె పదునైనదే. ఇప్పటికే ఆమెకా రెండుకళలును చాలవఱకు హస్తగతములైనవి. పద్మినికామెపై అపూర్వాను రాగముదయించినది. లక్ష్మిచిత్తము జక్కణాచార్యసమాసక్త మని యామె గ్రహించినది. తనకు కృష్ణప్ప నాయకుడన్న నెందుకిష్టముకాలేదు ? వీరభద్రప్పమీద నేలయనురాగముద యించినది ? అట్లే లక్ష్మికిని మాచమూర్తి గొప్పశిల్పియే యైనను ప్రేమలేకపోవచ్చును. జక్కణమీద ఆమె మనస్సు లగ్నమగుటలో నాక్షేప మేమి ? ఇందుకు కారణములు మనుష్యబుద్ధికందునవికావు. అందుకే మనపెద్దలు పూర్వజన్మ కర్మలనీ, అవియనీ, ఇవియనీ, ఏవేవో అదృష్టహేతువుల నుగ్గ డించుచుందురు. కనుక లక్ష్మి వివాహవిషయములో తానును సాయపడవలయును. పురుషోత్తమస్థపతికి లక్ష్మి యుద్దేశ్యము నెఱిగించి ఆమెకు జక్కణతోనే వివాహమగునట్లు చూడవలెనని పద్మిని తలంచినది. వీరభద్రప్పకును నట్టియభిప్రాయమే యేర్పడి నది. ఎవరికిష్టమైనవారిని వారు పెండ్లాడవలయునని సూచించు చున్న లక్ష్మి యుద్దేశ పద్మినీవీరభద్రుల యనురాగపాశము మఱింత దృఢతరమగుటకు ప్రోదిచేసినది

ఇంతలో జక్కణ్ణ యచ్చటికివచ్చి కొన్ని వింతశిల్పము లను వారికి చూప మొదలిడెను. "వీరభద్రా ! ఇటురమ్ము. ఈ స్తంభముపైనున్న మూడుతలలమావును చూచినారా ?"

పద్మిని : వీరభద్ర : ఓహో ! ఇది విచిత్రముగానున్నదే. ఒక్క దేహమునకే మూడుతలలమర్చి దీనిని దత్తాత్రేయునిగా చూసినారా యేమి ?

లక్ష్మి : కాదండీ! ఈ ఒక్క దేహమే మూడుతలలకును సరిపడును. మొత్తము మూడావులను తలలనుబట్టి మూడు రీతులలో నున్నట్లు శిల్పించినారు. అదియొక విచిత్ర శిల్పము.

జక్కణ : ఇదిగో, ఈ కోతిని చూడుడు. ఇందు చెక్కినవి రెండు తలలు మాత్రమే. దీనిని నాలుగు కోతులుగా చూడవచ్చును. ఇటురండు ఇచ్చట ముగ్గురు మనుష్యుల దేహములున్నవి. ఈముగ్వురికీ ఆరుకాళ్ళుండవలయును. కాని నాలుగుకాళ్ళనే చెక్కి ముగ్గురికి సరిపడునట్లు చేయుటయైనది. ఇదిచూచినారా? ఇరువురు మనుష్యులు మండలాకారముగా వంగి వ్యాయామ ప్రదర్శనము చేయుచున్నారు. ఇటురండు. ఇవి అన్నియు యోగాసనములను ప్రదర్శించు శిల్పములు. ఇట్టి వింత శిల్పములు గూడ ఒకతరగతి వారి నాకర్షించుటకు అవసరములు. ఇటువచ్చి ఈ సోమవార మండపమును, ఉయ్యాల మండపమునుగూడా చూడుడు. కల్యాణమండపమునకు పైకప్పు మాత్రము అమర్చవలసియున్నది. దానికి కావలసినబండలు తీయుటకు కూలివాండ్రు చిక్కనందున ఆ పని ఆగియున్నది.

ఈ శిల్ప సందర్శనము చేసినంతసేపును ఎడనెడ లక్ష్మి చూపులు జక్కణ్ణమీదనే ప్రసరించుచున్నవి. ఆమె మధ్యమధ్య జక్కణాచార్యునితో అవసరమున్నను లేకున్నను మాటలను గూడ కలుపుచునేయున్నది. జక్కణకును లక్ష్మిపై అనురాగము లేకపోలేదు. కాని ఆమె ప్రధానాచార్యుని పుత్రిక యయినందున

ఆతని బాహ్యాకృతిలో శృంగార చేష్టాచిహ్నములకు తావు లేకపోయినది. ఆతడటనుండి వెడలిపోయినాడు.

జక్కణాచార్యుడటు వెళ్ళగనే మాచమూర్తి వచ్చినాడు. లలిత మోము వికసించినది. మాచమూర్తి రాకనుగాంచి లక్ష్మి "మా అమ్మగారు తొందరగా రమ్మన్నారు, పద్మినీదేవి గారూ!" అని యామెవద్ద సెలవుగైకొని వెళ్ళినది. పద్మినీదేవి శిష్య వాత్సల్యముకల ఉపాధ్యాయ. లక్ష్మి, లలితా, గౌరీ దేవుల విషయములో ఆమెకు ఒకరిమీదకన్న నింకొకరిమీద ప్రేమ యెక్కువ. ఇందుకు కారణమామె పక్షపాతబుద్ధి కాదు; ఆ బాలికల తెలివి తేటలు, చురుకుదనము-మున్నగునవే. లక్ష్మి మాచమూర్తిని విమర్శించునప్పుడు లలిత మోమున నెత్తురుచుక్క లేకపోవుట, ఎడనెడ మాచమూర్తి శిల్పములను సమర్థించుట పద్మిని గమనించుచునే యున్నది. "లలిత చిత్తమునకు మాచమూర్తి నచ్చినాడా!" అని ఆమె శంకింపకపోలేదు.

మాచమూర్తికిగూడ లక్ష్మి తన్ను పెండ్లాడునను ఆశ నానాటికి సన్నగిల్లుచున్నది. ఆమె ప్రతివిషయమునను తనకు వ్యతిరేకముగా నుండుట, తానురాగనే మెల్లగ అవలకు జారుట, తన మాటలను పూర్వపక్షముసేయుట, తానేదైన హాస్యమాడిన కస్సుమనుట— మొదలగు లక్షణములచేత ఆతడామెకు తనపై ప్రేమలేదని నిర్ణయించుకొన్నాడు. ఒకవంక మేనమామ యన్నచో, మాచమూర్తికి భయము. తన తల్లి చిన్నప్పుడెప్పుడో చనిపోగా తన్ను దెచ్చి పెంచి, విద్యాబుద్ధులు నేర్పి, శిల్పవిద్యనలవఱచి యింతవానిని జేసినాడు. మేనమామ భార్య వీరాంబగూడ తన్ను కుమారునిగానే చూచుకొన్నది గాని,

తన ఆడుబిడ్డ కుమారుడని వేఱుగా చూడలేదు. వీరాంబ తన్నెంతగా పెంచినదో, ఎంతగావాత్సల్యమును ప్రదర్శించినదో తలచుకొన్నచో, అప్పుడే మాచమూర్తి కన్నులలో నీరు తిరుగును. ఆతడామె ఋణము నెట్లుతీర్చుకొందునాయని విచార పడును. ఇట్టిస్థితిలో తానేమిచేయవలయునో మాచమూర్తికి తోచలేదు. బలవంతముగా మేనమామ తనకు లక్ష్మినిచ్చి చేసినచో, ఆ పిల్ల తన్ను గౌరవించనిచో, తన జీవితమేమి కావలయును! "లక్ష్మికినన్ను పెండ్లాడనిష్టము లేదుమామయ్యా" అని మేనమామకు చెప్పు సాహసమూ తనకులేదు. ఆయన గౌరవన్నియు తెలిసినవారు. మహారాజుల మన్ననలందుకొన్న మహనీయుడు, ఆయనకు తానేదైన సూచనలిచ్చుట గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లుండును. పోనీ, వీరాంబవద్ద తనకు చనువున్నందున, ఆమెకు సంగతిని తేటపఱచుటకును మాచమూర్తి సాహసింపలేకపోయినాడు. ఇట్టి స్థితిలోపడి ఆతడు నలిగిపోవుచున్నాడు.

తానా పెండ్లీడు వచ్చినవాడు. ఏదో యొక నిర్ణయము చేసికొని గృహస్థుడు కావలయును. విద్యానిధి కూతురు లలితకు తనపై దృష్టి ఉన్నట్లాతడు గ్రహించినాడు. అట్టి ఉద్దేశ్యమామెకున్నను, తానేమియు చలింపరాదు. తన కామెపై కోరికయున్నట్లు సూచింపరాదు. అట్లు జరిగినచో మేనమామ యేమనుకొనును ? తన్ను ధిక్కరించుచున్నాడని బాధపడునుగదా ! పాపము ! మాచమూర్తి స్థితి మహా సంకటములో నున్నది. మాచమూర్తిని గాంచి వీరభద్రప్ప యన్నాడు :

వీరభద్రప్ప : మాచమూర్తిగారూ ! కల్యాణమండప శిల్పము లెంత రమ్యముగానున్నవండీ ! నా కోరికకు తగినట్లుగా మీరు వీనిని శిల్పించి నన్ను ఋణగ్రస్తుని చేసినారు.

మాచమూర్తి : ఏదో, పెద్దల ఆశీస్సుల ఫలముగా అవి అట్లు తయారైనవి. దీని కంతటికిని బత్తెనాచార్యులవారి చేతి చలువయే కారణము.

వీరభద్ర : బత్తెనాచార్యులవారు ఆంధ్రశిల్పశైలిలో అందె వేసినవారని విన్నాను.

పద్మిని : అసలీ శైలులనగా నేమో నాకు తెలియకున్నది. కొంచెము వివరించిన సంతోషింతుము మాచమూర్తి గారూ !

**మాచమూర్తి** : ఒక్కొక్క యుగమున వెలసిన శిల్పములు కొన్నికొన్ని ప్రత్యేక లక్షణములతో నొప్పుచుండును. వానిని ఒక్కొక్క పేరుతో పిలుతురు. అమరావతిలో వెలసిన శిల్పములనుగూర్చి అమరావతీశైలి యని పేర్కొన్నారు. కొందఱు దానిని ఆంధ్రశైలి యనియు నందురు. అట్లే నాగార్జునకొండలో వెలసిన వానిని గూడ ఆ పేరుతోనే వ్యవహరింతురు. ఇట్లే అజంతా శైలి—పల్లవ, చోళ, చాళుక్య, హొయసల, విజయ నగర శైలులని పలుభేదము లున్నవి. వీని లక్షణము లను వివరింపవలయునన్నచో కొన్ని ఉపాన్యాసములు చేయవలసివచ్చును.

పద్మిని : ఏమో నబ్బా! మాకు తెలిసినదంతయు విగ్రహము బాగున్నదా లేదా యని మాత్రమే.

వీరభద్ర : ఎవని విద్యలోని మర్మములు వారికి తెలియును. ఒకరి దింకొకరి కగమ్యగోచరముగానే ఉండును. మీ సంగీతములో భూపాళము - నేపాళము, అదీ, ఇదీ అని ఎన్నో రాగములున్నవిగదా! వానికిగల పరస్పర భేదములు, రహస్యములు మాకేమి తెలియును? మేమొక్క శ్రావ్యత్వమును మాత్రమే గమనించి యానందింతుము.

పద్మిని : మీకు సమాధానము చెప్పలేము.

వీరభద్ర : మఱేమి? శిల్పమన్న గజ్జెలు గట్టి గంతులువేయు టనుకొన్నావా? దానికెంతో శాస్త్రము, శిక్షణము, కౌశలము, ప్రతిభ ఉండవలయును. లేకున్న కఠిన పాషాణములు కరగి కామినులెట్లు కాగలవు?

పద్మిని : మీ పరియాచకముల కేమి లెండు!

మాచమూర్తి : చిరకాలానుభవమున్నగాని, ఆయా శిల్ప శైలీవిభేదముల నెఱింగి, శిల్పించలేము పద్మినిగారూ! అందుకే శిల్పమనగా అభ్యాససాధ్యమైనదని యొక నిర్వాచన మున్నది.

వీరభద్ర : ఇంకొక నిర్వాచనముగూడ నున్నదా యేమి?

మాచమూర్తి : ఉన్నది. "శీల సమాధౌ" అను ధాతువును బట్టి చూచినచో సమాధిసుఖము నొడగూర్చునది శిల్ప

మని యర్థము సిద్ధించును. ద్రష్ట శిల్పమును చూచు నప్పుడు యోగిసంవేద్యమగు బ్రహ్మానందమును పొందును గాన, సమాధ్యర్థము కుదురుచున్నది. ఇట్లే రెండు మూడు విధముల వ్యుత్పత్త్యర్థములను గ్రహింపనచ్చును.

వీరభద్ర : అది వ్యాకరణ విషయము లెండు. పద్మినీ! ఇంతటి మనోజ్ఞశిల్పములను నిర్మించియిచ్చిన యువశిల్పి మాచమూర్తి కేమిచ్చి కృతజ్ఞులము కాగలమో తోచకున్నది.

పద్మిని : వారికి తగిన బహుమానము నిచ్చుటకే నేను నిర్ణయించుకొని యున్నాను. మన లలిత కోపింపకున్నచో, ఆ బహుమానము నిప్పుడే నేను ప్రకటింపగలను.

లలిత : అదేమిటి, పద్మినీదేవిగారూ ! మీరు మాచమూర్తి గారిని బహుమానించుటేమి ? నాకు కోపము నచ్చుటేమి ? నేనట్టి అసూయాపరురాలను కానండీ !

పద్మిని : నీ వాగ్రహింపకున్న, నేనా బహుమానమును ప్రకటించుటకు సిద్ధముగానే యున్నాను లలితా !

వీరభద్ర : ఊరక వేధింపక నీ యభిప్రాయమేమో చెప్పు పద్మినీ ! నీ కిటీవల సరసము లెక్కువైనవి !

పద్మిని : ఏమీ లేదండీ! మన లలితమ్మగారినే మాచమూర్తి గారికి బహుమానముగా నిచ్చిన సరిపోవును. ఇంతకన్న యువశిల్పికి తగిన బహుమాన మింకేముండును ?

ఈ మాటలకు వీరభద్రప్ప నవ్వుకొన్నాడు. మాచ మూర్తి మోము విప్పారినది. లలిత సిగ్గుపడి యట నుండక వెడలిపోయినది. మాచమూర్తి ఆమె ననుసరించినాడు.

వీరభద్రప్ప వ్రేలికున్న నవరత్నాంగుళీయకముపై పద్మిని దృష్టి ప్రసరించినది. మహిమోపేతమగు నా యుంగరమును తానుగూడ కొన్నాళ్ళు తాల్పవలయునని పద్మిని యభిప్రాయము. వీరభద్రప్ప నడిగిన యేమనుకొనునో యని సందేహము. ఆమె చూపు నర్థము చేసికొన్న వీరభద్రుడు "పద్మినీ! ఈ యుంగరము నీ వ్రేలికి పెట్టుకొన్న నెట్లుండునో చూడవలయును. ఏదీ ఒకసారి ఆచేతి నిట్లు తెమ్ము." అని ఆమె హస్తము నందీయగా తా నంగుళీయకమును దొడిగినాడు. ఆ స్పర్శ సుఖము ఇరువురిని అనిర్వచనీయానందసాగరమున ఓలలాడింప జేసినది. పద్మిని నవ్వు మొగముతో రసజ్ఞశేఖరు లిక రాజశేఖరు లయ్యెదరుకాబోలు నని పరిహాసక మాడినది.

*   *   *   *

విరుపణ్ణ పురుషోత్తమస్థపతి గురుత్వమున నిదివఱకే యోగాభ్యాసము నారంభించినాడు. అష్టాంగయోగములోని యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారము లనెడి బాహ్యాంగములైదింటిని అభ్యసించినాడు. ధ్యాన, ధారణా, సమాధుల నెడి అంతరంగములలో మొదటి రెంటను ఆయనకు నిలకడ చిక్కినది. ఇక సమాధి, అందలి సబీజ, నిర్బీజ - సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాతాది భేదములు అలవఱచుకొనవలసి యున్నవి. శివయోగివచ్చిన పిమ్మట ఆ యోగశేషమును

ఆయనగురుత్వమున సాక్షింపవలసినదని పురుషోత్తమాచార్యుడే చెప్పుటచేత, విరుపణ్ణ ఆపరిణతసిద్ధుని యుపదేశములననుసరించి సమాధి నభ్యసింప పూనినాడు. అందు చాలదూరము పయనించినాడుకూడ. విరుపణ్ణ సిప్పుడు రాజ్యాంగవిషయములుగాని, కుటుంబవిషయములుగాని వ్యాకులపెట్టుటలేదు. ఆతడు వానికతీతుడై ఈశ్వరవిధేయతతో ఒక సమున్నత పరమార్థస్థాయికి చేరుకొనుచున్నాడు.

# 21

శిశిరమువచ్చి చెట్లయాకులను రాల్చిపోయినది. వసంతము ప్రవేశించి వృక్షములకు చిగురురంగులు హత్త మొదలుపెట్టినది. సరస్సులు అల్పనీరములగుచున్నవి. ఎండలుమెండగుచున్నవి. పడమటి గాడ్పులు ప్రచండముగా వీవసాగినవి. వైశాఖము తొంగిచూచినది. విజయనగర ప్రభువు లిట్టివేళల పెనుగొండకువచ్చి విడియుట పరిపాటి. సదాశివరాయలు గగనమహాలులో విశ్రమించు రోజులవి.

అప్పనాయకుడు చక్రవర్తికి రాజ్యవ్యవహారములు నివేదించుటకు అదను కల్పించుకొన్నాడు. ఒకనాటి సాయంసమయమున ప్రభువు ప్రాసాదోపరిభాగమున గూర్చుండి పరిసరప్రకృతిరామణీయకమును నేత్రానందముగా తిలకించుచున్నాడు. గగనమహాలున గూర్చుండి ప్రకృతిరామణీయకమును గాంచునప్పు డొక దివ్యానందము చిత్తమునకు హత్తుకొనును. కొండలతో చెలిమిచేయుచున్న కోటగోడలు, ఆ కోటగోడల బురు

జులు, శతాధికముగానున్న పెనుగొండలోని దేవాలయములు-అన్నియు కనువిందుచేయును. ప్రక్కనేయున్న కాశీశ్వర, యోగ రామస్వామి దేవాలయధ్వజఘంటికలు గాలికికదలి చిఱుచప్పుడులు చేయుచున్నవి. దుర్గాదేవి అదృశ్యరూపముతో పెనుగొండ మీద నొక పాదమును, లేపాక్షి కూర్మాద్రిమీద నొక పాదమును పెట్టి ఆంధ్రసామ్రాజ్యస్థితినాకళించుకొనుచున్నది. ప్రభువుకు ప్రక్కనే ఒక యాసనముమీద దుర్గాధ్యక్షుడు కృష్ణప్ప నాయకు సీనుడై మండలములోని రాజకీయములను ప్రస్తావించుచున్నాడు

"చక్రవర్తులు దివ్యచిత్తముతో నవధరింపవలయును. విజయనగరసామ్రాజ్య మిప్పుడు విషమఘట్టములో నున్నది. అళియరామరాయలవారు దక్షిణదేశ దండయాత్రలో నిద్రాహారములులేక శ్రమించుచున్నారు. ఆ యుద్ధమున కెక్కడెక్కడి ధనమును చాలుటలేదు. విజయనగర కోశము ఖాళీయైనది. గుత్తి, ఆదవాని, అనంతపురముల దుర్గాధిపతులు ఎంతయో ధనము నంపుచునే యున్నారు. అయినను అది చాలుటలేదు. అచ్చట పోరు ఘోరముగా సాగుచున్నదట ప్రభూ! అల్లుడు రామరాజులవారు వెనుకంజ వేయువారు కారు. ఆయన వీరసాహసముల యవతారము. మిమ్ము సింహాసనము నెక్కించుటకు ఆయన చేసిన ప్రయత్నమింతింతకాదు. విజయనగరమునకు చుట్టుప్రక్కలనున్న దుర్గములపాలకులందఱు నాడు అచ్యుతదేవరాయల వారి కిష్టులు. వారిని తొలగింపనిదే మీకు వజ్రసింహాసనము దక్కదని ఆ ప్రభువు అచ్యుతదేవరాయలు తిరుపతికేగిన యదను కనిపెట్టి, సలకము సోదరుల

యాటలు కట్టించినాడు. ఆపై గుత్తి మున్నగు దుర్గముల పాలకులనుగూడ పదచ్యుతుల నొనర్చి, ఆ తావులలో క్రొత్త వారిని నిలిపి, వా రందఱి సాయముతో మిమ్ము సింహాసనా రూఢుల జేసినాడు. ఈ సందర్భముననే నేను పెనుగొండమండ లాధిపతినైతిని. ఇంతవఱకును పెనుగొండకు విరుపణ్ణ యధిపతిగా నున్నాడు. తన్ను రామరాజు పదవినుండి తొలగించినాడను సాకుతో నాతడు సామ్రాజ్యముపై పగబట్టి యున్నాడు స్వామీ!

సదాశివ : పదవిని కోల్పోయిన దుర్గాధిపతుల కందఱికిని లేని పగ విరుపణ్ణకేల నయ్యా!

కృష్ణప్ప : ఔను ప్రభూ నాకును అదియే వింతగా నున్నది. విరుపణ్ణ అందఱివంటివాడు కాడు. పట్టుదలగలమానిసి.

సదాశివ : కావచ్చును. అయినను పదచ్యుతుడైనవాడు ప్రభుత్వమునకు జేయు నెగ్గేమి యుండును?

కృష్ణప్ప : ఆతడు చేయవలసిన యెగ్గేదో ఇదివఱకే చేసినాడు ప్రభూ! విరుపణ్ణ యింతకుముందు సామ్రాజ్య ధనా గారమునకు కూడ నధిపతికదా.

సదాశివ : ఔను. అయిననేమి?

కృష్ణప్ప : నే నేమని చెప్పుదును ప్రభూ! ఏమి చెప్పినను ఆతనిపై చాడీలుచెప్పి నేరములు మోపినవాడనగుదును.

ఈ పాపము నా కేలయని యూరకొందునన్న, రాజ ద్రోహమగును. నాకు ముందు నూయి వెనుక గోయిగా నున్నది.

సదాశివ : విరుపణ్ణవలన సంభవించిన అంతటిసామ్రాజ్యోపద్రవ మేమందువు ?

కృష్ణప్ప : ఆతడు బొక్కసములోని విస్తారధనమును వెచ్చించి లేపాక్షిలో దేవాలయములను నిర్మింపజేయుచున్నాడు స్వామీ ! అవి సామాన్య దేవాలయములు కావు. అద్భుత శిల్పకళావిరాజితములు. మన విజయనగరమున వెలసినశిల్పకళను తలదన్నవలయునని యెంచి ఆతడచ్యుత ప్రభువు నామోదమునుగూడ పొంది, యిక్కడి శిల్పా చార్యులనుగూడ లేపాక్షికి తరలించుకొనిపోయినాడు. ఈ సంగతి నెఱింగియే రామరాయలవా రాతనివలన సామ్రాజ్యమునకు హాని సంభవించునని పదవినుండి తొలగించినారు.

సదాశివ : ఆత డట్టి రాజద్రోహమే చేసినచో తగినశిక్ష రామరాజేల విధింపలేదు ?

కృష్ణప్ప : అది సంధిసమయముకదా ప్రభూ ! అచ్యుత దేవ రాయలను పదచ్యుతు నొనర్చి, మి మ్మాస్థానమున నభి షేకింప దలంచి యున్నందున, ఆసమయములో వానిని దండించుట అనర్థహేతువని ప్రభు వుపేక్షించియుండును. ఇంతలో వారు దండయాత్ర కేగవలసివచ్చినది. దండిం చుట కింకెక్కడ వీలున్నది ?

సదాశివ : విరుపణ్ణ పరమ భ క్తశిఖామణియని వినుచున్నామే. నీ విట్లు చెప్పెదు వేమి ?

కృష్ణప్ప : ఔను. ఆతడు భక్తుడే. మంచివాడే. తన భక్తికి నిదర్శనముగా ప్రభుత్వధనమును వెచ్చించి గుళ్ళు - గోపురములు కట్టించుట యేటిధర్మము ? — అంతియే కాదు. తన్ను పదవినుండి తొలగించినారను కోపముతో ప్రజలను రెచ్చగొట్టి, పన్నులనుగూడ చెల్లింపనీయకుండ జేయుచున్నాడు. ఇప్పటికింకను పన్నులు పూర్తిగా వసూలు కానేలేదు ఇంకను సగము పన్నులు వసూలు కావలసియున్నవి. అవి వసూలు కాకుండుటకు విరుపణ్ణయే కారణము ప్రభూ !

సదాశివ : విరుపణ్ణ యింతటి రాజద్రోహమునకు పూనినాడుగా! విచారింతము గాక.

కృష్ణప్ప : అతనికి మొదటినుండియు మీపై సదభిప్రాయము లేనేలేదు ప్రభూ ! రామరాయలవారు మిమ్ము సింహాసనము నెక్కించుటకు ముందు పూర్వపు మండలాధిపతుల యామోదము నడిగినాడు. అప్పుడు విరుపణ్ణ మిమ్ములను, మీ శక్తి సామర్థ్యములను గూర్చి హేళన చేసినతీరు నేను ప్రభువులకు విన్నవింపజాలను. మీరన్నచో ఎంతమాత్రమును గిట్టని అచ్యుత దేవరాయల పక్షపాతి యాతడు. ఇప్పటికిని సలకము చినతిరుమలరాజుతో చేయికలిపి కుట్రలుపన్నుచు మీ కపకారము చేయజూచుచున్నట్లే తెలియుచున్నది.

సదాశివ : నన్నవహేళన చేసిన చేయుగాక. ప్రభుత్వ ధనము నపహరించి స్వామిద్రోహము చేసినచో, అదెట్లు క్షమార్హము కాగలదు ?

కృష్ణప్ప : ఏమో! నాకును అదియే విచిత్రముగా నున్నది. నామాటపై నమ్మకము లేకున్న, ప్రభువులే స్వయముగా లేపాక్షికి పోయిగాని, చారులను బంపిగాని ఆతడు చేయించుచున్న శిల్పకార్యములను గూర్చి తెలిసికొనవచ్చును.

ఇంతలో సాయంకాల స్నానఘంటికలు మ్రోయుట చేత ప్రభువు లోనికేగుచు "మేము రేపే చారులనుబంపి లేపాక్షిలో విరుపణ్ణ నిర్మింప జేయుచున్న దేవాలయ విశేషములను గూర్చి జాడ తెప్పింతుము. ఆపైని కర్తవ్యమాలోచింతము." అని పలికెను.

*

రెండుమూడు దినము లైనపిమ్మట రాయలు పంపిన చారులువచ్చి ప్రభువునకు లేపాక్షి దేవాలయ శిల్పవిశేషములను గూర్చిచెప్పినారు. లేపాక్షిలోని దేవాలయశిల్పములు విజయనగర శిల్పములకన్న మిన్నగా నున్నవనియు, చిత్రకళాలక్ష్మిఆ అలయములో కొలువుదీరి యున్నదనియు, ఏడెనిమిది సంవత్సరముల నుండి ఈ శిల్పనిర్మాణము జరుగుచున్నదనియు, ఇప్పటికి లక్షల సంఖ్యలో విత్తము వ్యయమైయుండుననియు చారులు వర్ణించిచెప్పిరి. ప్రభువునకు కృష్ణప్పనాయకుని

మాటలు నిజమే యని ఆతనిపై విశ్వాసము కలిగినది. విరుపణ్ణ రాజద్రవ్యమును స్వతంత్రుడై పాడుచేయుచున్నాడని యాగ్రహమును గలిగినది.

ఇంతలో యుద్ధసంబళిక ఖాళీపడినదనియు భాండాగారమునుండి పదివేల వరహాలైనను పంపవలసిన దనియు రామరాయలవద్దనుండి చారులువచ్చి విన్నవించినారు. ప్రభువున కేమి చేయుటకును తోచలేదు. ఇంతకుముందే కృష్ణప్పనాయకుడు ధనాగారస్థితిని గూర్చి చెప్పియున్నాడు. చారులతోబాటు తిమ్మప్ప నాయకుడును వచ్చియున్నాడు. ప్రభువు, అన్నదమ్ము లిద్దఱను రామరాయలకు తమువంపు నేర్పాటు చేయగోరెను.

కృష్ణప్ప : స్వామీ! మమ్మేమిచేయుమందురు ? విరుపణ్ణ చేసిన స్వామిద్రోహము వలన బొక్కసము రిక్తమై పోయినది. మా మండలమునుండియైనను కొంతధనము పంపుదమన్న విరుపణ్ణ ప్రేరణచేత ప్రజలు పన్నులు చెల్లింపక తిరుగబడినారని యిదివఱకే దేవరవారికి మనవి చేసికొనియుంటినిగదా. ఇప్పుడు విరుపనికి తగిన దండనము విధించినగాని, మా దుర్గములోని ప్రజలు తమకున్న యండ పడిపోయినదని తలంచి మాకు లొంగరు ప్రభూ! పన్నులు రానిది ధన మెట్లు సమకూడును ?

సదాశివ : వ్యవహారమింత శ్రుతి మించు వఱకును మీరేమి చేయుచున్నారు? ఆ దుర్మార్గుడైన విరుపని స్వామి

ద్రోహము నెప్పుడో ప్రభువులకు నివేదింపవలసిన బాధ్యత మీకు లేదా ?

కృష్ణప్ప : ఔను, స్వామీ! ఆత డింకనైనను దారికి వచ్చునని వేచియున్నందుకు మాకుతగిన ప్రాయశ్చిత్తమైనది. ఇంతకును, రామరాయలు నగరమున లేకుండుటచే వాడిట్లు మేర మీఱినాడు స్వామీ !

సదాశివ : ఏమేమీ ! రామరాయలు లేకున్న, ఉన్నవారు ప్రభువులు కారనుకొన్నారా? వారికి దుష్టులను దండించు శక్తిసామర్థ్యములు లేవనుకొన్నారా ? ఈ యనర్థమంతయు మీ మాంద్యమువలననే సంభవించినది. ఇప్పటికైనను వానిని దండించుటకు మా హృదయము తొందరపడుచున్నది. ప్రభుత్వధనము నపహరించిన రాజద్రోహి కెట్టి శిక్ష విధింపవలయునో ప్రాడ్వివాకులను విచారించి రండు. నాకు మాత్రమ మా ద్రోహికి మరణదండనమే తగినదని తోచుచున్నది.

కృష్ణప్ప : ఎంత దారుణదండనము. ప్రభువు లనుగ్రహింపవలయును. తోడిదుర్గాధిపతి యాత్మనాశనమును నేను సహింపజాలను ప్రభూ! దయయుంచి అతనికి మరణశిక్షనుగాక మఱొక దండన మేదైనను విధింపుడు.

మరణశిక్ష దారుణమని కృ భూపతి యనుటచేత అతనికి విరుపణ్ణపై నిక్కమైన ప్రేమయు, సానుభూతియు నున్నవని తలంచి సదాశివరాయ లిట్లనెను :

సదాశివ : ఆ తగినదండన మేదో ప్రాడ్వివాకులను విచారించి రండు.

కృష్ణప్ప : ఇందుకు ప్రాడ్వివాకులను విచారింపవలసిన పని యే మున్నది ప్రభూ! మహాసమ్రాట్టులు - పినతండ్రులగు శ్రీకృష్ణదేవరాయల వారి మార్గమే మన కనుసరణీయము. రామరాయల వారున్నను అట్లే చేసెడి వారు.

సదాశివ : నీ వేదో అస్పష్టముగా మాటాడుచున్నావు. మా పినతండ్రుల మార్గ మే దందువు?

కృష్ణప్ప : ప్రశాంత చిత్తముతో అవధరింపుడు. సర్వశిరః ప్రధాని సాళువ తిమ్మరుసయ్య రాయలవారి కెంత కూర్చువారో తా మెఱుంగక పోలేదు. అట్టి తిమ్మరుసు తనపుత్రుని చంపినాడని చక్రవర్తులు అతనికి విధించిన శిక్ష దేవరవారికి తెలిసియేయుండును. ఇది సంప్రదాయ సిద్ధమైన దండనముకూడ గాగలదు.

సదాశివ కన్నులు పెఱికించినారు. ఈపాటి శిక్ష చాలు నందురా?

కృష్ణప్ప : చాలును ప్రభూ! చాలును. చేసిన తప్పునకు జీవితాంతము లోకమును గాంచు భాగ్యము లేక వాఁడే కుమిలి కుమిలి చావగలఁడు. మరణశిక్ష విధించినారను నిందయు ప్రభువులకు తప్పును?

సదాశివ : మండలాధిపతుల యుద్దేశ్యము మాకును నచ్చినది. రేపే దండనపత్రమును వ్రాయించి ప్రభుముద్రతో విరుపణ్ణకు పంపుడు. తక్కిన దుర్గాధిపతులకుగూడ రామరాయలవారికి యుద్ధవ్యయార్థము ధనము పంపవలసి వచ్చినదనియు, వెనువెంటనే విత్తమును సేకరించి ప్రభుత్వమునకు పంపవలసినదనియు ఆజ్ఞాపత్రముల నంపుటకు తిమ్మప్పనాయకుడు పూనుకొనుగాక.

తిమ్మ : ప్రభువుల యాజ్ఞను శిరసావహించి రేపే ఆ కార్యమునకు పూనుకొందును.

కృష్ణప్ప : ఇంకొక యాలోచనకూడ నాకు తట్టినది ప్రభూ! యుద్ధసమయమున పన్నులు పెంచియు, ధనవంతుల నుండి విరాళములను సంపాదించియు, అవసరములు తీర్చుకొని ప్రభుత్వమాపదనుండి గట్టెక్కుట పూర్వము నుండియు వచ్చుచున్న సంప్రదాయమే. కావున దేవర యాజ్ఞ యైనచో ఆ పనిగూడ మన కోశాధిపతి నిర్వర్తింపగలడు.

సదాశివ : మంచి యుపాయమే. ఆ పనిగూడ చేయవచ్చును.

*

కృష్ణప్పనాయకుడు విరుపణ్ణకు తగిన శిక్ష విధించితిని గదా యని యుబ్బితబ్బిబ్బగుచున్నాడు. "ఇక విరుపణ్ణ గ్రుడ్డివాడు కాగలడు. ఈ ముసలితనమున ఆ బాధను భరింపలేక చచ్చినను చావవచ్చును. ఆతని చావుతో నా పంతము తీరి

పోవును. ఆ సద్దిని నాకు దక్కనప్పుడు అది యెట్లు చచ్చినను నాకేమి! ఎట్లయినను విరుపన్న కుటుంబమును ఇక్కట్టులపాలు చేసినాను. నా కదియే చాలు." ఇట్టి తలంపులతో నాతడు శయ్యాగారమున పట్టుపరుపులపాన్పుపై సన్నగిలించెను. క్రమముగా ఆతడు జాగ్రదవస్థను గడచినాడు. విరుపన్న ఆతని యెదుట సాక్షాత్కరించినాడు. ఆతని కన్నులు, గ్రుడ్లు పెకలికి వేయుటవలన వేడినెత్తురులను కార్చుచున్నవి. రక్తధారలతో ఆతని మోమంతయు తడిసి యున్నది. కన్నులు లోట్టలై వికృతములుగా నున్నవి. ఆ రూపము కృష్ణప్పకు భయము గొల్పుచున్నది.

కొంతసేపటికి భయంకర దుర్గామూర్తిగా విరుపన్న మారినాడు. ఆమె అష్టబాహుదుర్గ. మహిషాసురుని త్రిశూలముతో నోటబొడుచుచున్నది. అంతలో నా రూపుకూడ మాయమైనది. సిమ్మట తలవెంట్రుకలు విరియబోసికొన్న నల్లని భయంకరాకృతి యొకటి తోచినది. ఆయాకృతి స్త్రీయో పురుషుడో పోల్చుకొనుటకు కృష్ణప్పకు తోచలేదు. లోదొడల వఱకు ఒక చెడ్డీమాత్రము ఆయాకృతికి బిగించికట్టబడి యున్నది. అదియొక మహామారిగానో, పిశాచముగానో, రక్కసిగానో, లోకములను దిగమ్రింగవచ్చిన భయంకరశక్తిగానో ఆతనికి తోచినది. పరికించి చూచునప్పటికి దానికి మోకాళ్ళు వెనుకకును, మోచేతులు ముందునకును తిరిగియున్నవి. ఈ విపరీతమునకు కృష్ణప్ప యబ్బురపడినాడు. పెదవులుదాటిన పెద్దపెద్ద కోఱల కాంతులు చీకట్లను చికాకుపఱచుచుండ ఆ భూతము వికటాట్టహాసముచేయుచు కృష్ణప్పను సమీపించి బరిసెలవంటి

గోళ్ళతో ఆతనిని ఱక్కుచు నోరు తెఱచి దిగమ్రింగబోవు చున్నది. ఆతడు కత్తినిబట్టి దానితో పోరాడ నుద్యమించి నాడు. ఆతనిచేయి స్తంభించిపోయినది. కాళ్ళతో తన్నబోయి నాడు. కాని కాళ్ళాడలేదు. ఎట్టకేలకా భూతము కృష్ణప్పను నేలబడవైచినది. ఆతని ఱొమ్ముపై నెక్కి కూర్చున్నది. తన రెండు చేతులతో కృష్ణప్ప కుత్తుకనుబట్టి గట్టిగా నొక్కు చున్నది. ఆతడు దాని బారినుండి తప్పించుకొనుటకు పెనగు లాడుచున్నాడు. అఱచుచున్నాడు. ఆ అఱపులో నాతని నెవరో తట్టి లేపిరి.

ఆతని యొడలంతయు చెమటనీళ్ళతో తడిసియున్నది. శరీరము వణకుచున్నది. ఆతడు కొంతనడికి తేరుకొని తాను కన్నది కలయని సమాధానపడినాడు. "నిరపరాధియగు విరు పణ్ణకు అపకారముచేయ దలపెట్టినందున తనకిట్టి కల నచ్చెనా? కాదు. తాను విరుపణ్ణనుగూర్చి భావించుచు పండుకొన్నాడు. ఆ తలంపులే కలలో ఈ రూపమున వచ్చినవి. అందు కంతగా విచారింప నక్కఱలేదు." అని ఆతడు సరిపుచ్చుకొన్నాడు. మఱల రెండవనాటి రేయికూడ అట్టి స్వప్నమే వచ్చినది. ఇప్పుడు కృష్ణప్పకు అనుమాన మేర్పడినది. అతని గుండెలో పిఱికితనము చోటుచేసికొన్నది. మూడవనాడును అదియే కల. అతనికి ధైర్యము పూర్తిగా దిగజాఱిపోయినది. నాలవనాడును ఆ స్వప్నమే. ఆనా డింకొక విచిత్రము జరిగినది.

"కృష్ణప్పనాయకా! విరుపణ్ణ నీకేమి యపకార మొన ర్చినాడు? ఆతని జీవితమునచేసిన చెడ్డకార్యము లేమి?

ఆతఁడు నిరపరాధి. సజ్జనుఁడు. మంచి మంకతేఁనుఁడు. విశేషించి పరమేశ్వరభక్తుఁడు. ఆతఁ చేసిన జూహితములు నీవు చేయుచున్నావా ? ఆవి కజరామరమైన శిల్పచిత్రకళలను పెంపు చేయుచున్నాఁడు. నీవేమిచేయుచున్నావో ఆలోచించుకొనుము. ఒక సత్పురుషుని సర్వనాశనము చేయుచున్నావు. నీవు మండలాధిపతివై యిప్పటినుండి చేసిన మంచిపని యొక్కటియైన కలదేమో ఆలోచించిచూడుము. పాపము! పద్మిని. ఆ దిక్కులేని పిల్ల నీ కేమి యెగ్గుచేసినదిరా ? నీ చదరంగములో పావుకాలేదని యామెపై కక్ష పూనెదవా ? అసలాపిల్ల యెవరనుకొన్నావు ? బోగముదని తలంచి చెఱబట్ట జూచెదవా ? ఆమె నీ తలిదండ్రులకు మోక్షమార్గమును చూపిన పరమ గురుమూర్తి నంజుండ శివయోగి కూతురు కాదటరా ? ఆ నంజుండప్ప నీకు మాత్రము గురుప్రాయుఁడు కాఁ ? అట్టి గురుపుత్రినా నీవు వలచునది ? పాపిష్ఠుఁడా ! నీ పాపమునకు పరిహారమున్నదా ! ఇదిగో ! నిన్నిప్పుడే కబళించెదను. నీ పాపములు పండినవి. ఇక నిన్ను క్షమింపను. లే, లెమ్ము. లేపాక్షికి పొమ్ము. విరుప ప్రభువును శరణు వేఁడుము. నీ తప్పుల నొప్పుకొని మన్నింప ప్రార్థింపుము. లేకున్న నిన్నిప్పుడే మ్రింగివేసెదను."

అని యావింతభూతము కొండబిలమునంటి తన నోటిని తెఱచి కృష్ణప్పను తర్జించుచు పైబడి మ్రింగవచ్చినది. ఆతఁడులికిపడి లేచినాడు. జాగ్రదవస్థలోగూడ అతనికా భూత మగపడినది. ఇన్నాళ్ళు మెలకువరాగనే అంతయు మాయమయ్యెడిది. ఈనాడు మేల్కాంచినను భూతము దర్శనమిచ్చు

చున్నది. ఆతడు భయభ్రాంతుడై తన జీవితమును సింహావలోకనము చేసికొనబూనినాడు.

"నిజమే. తానుచేసిన మంచిపనిగాని, విరుపణ్ణచేసిన చెడుపనిగాని యెక్కడైనను లేదు. తాను తన స్వార్థము సిద్ధింపలేదని విరుపణ్ణమీద పగబట్టినాడు. పద్మిని నంజుండప్ప కూతురని చెన్నబసవప్ప వలన తెలిసినపిమ్మటగూడ తాను క్రోధమును వీడలేదు. పద్మినీ విరుపణ్ణలను సాధించి వారి జీవితములను పాడుచేయుటకే, సదాశివరాయలకు విరుపణ్ణపై నేరములు చెప్పి శిక్ష విధింపజేసినాడు. ఔను. గురుపుత్రిని కామించుట దోషమేల కాదు? తాను మండలాధిపతియైన పిమ్మట ప్రజలకుచేసిన మేలున్నైత మేమున్నది? వారు తన ఏలుబడిని గర్హించి యెదురు తిరుగుచున్నారు. ఈ సమస్త దుష్కర్మముల ఫలమే ఈ నాడీ రూపమున తన్ను వేధించుచున్నది. రెండుమూడు దినములేదో కలలే యని తాను లక్ష్యముసేయలేదు. ఆ యలక్ష్యముతోనే దండనపత్రమును ఈ సాయంకాలమే భటునకిచ్చి, లేపాక్షిలోనున్న విరుపణ్ణను శిక్షింప బంపినాడు. ప్రతిదినమును బాధించుటతోమాత్రమే తృప్తిపడెడు భూతము నేటిరాత్రి నోరువిప్పి తన తప్పిదములను, విరుపణ్ణ నిర్దోషిత్వమును గంటగొట్టినట్లు చెప్పినది. తప్పుదిద్దుకొని విరుపప్రభువును శరణువేడుకొను టొక్కటే తనకు తరణోపాయమన్నది. అందు కంగీకరింపనిచో ప్రమింగెద నన్నది."

ఆత డా పడకగదిలో భూతముబారిబడకుండ తప్పించుకొని తిరుగ యత్నించినాడు. ఎటు పోయినను శక్తి దర్శనమే.

అని చేయు భయంకరధ్వనియే. అది తన పాలిటి మృత్యు దేవతయా యేమి ! ఆవిడు ప్రాణము విసిగి గత్యంతరము లేక తన్ను రక్షింపుమని పరాశక్తి పాదములమీద వ్రాలినాడు.

## 22

లేపాక్షిలో కల్యాణమంటప స్తంభ నిర్మాణము పూర్తి యైనది. పైని కప్పుబండలు పఱచుటకును, దాని మీద చిత్తరువులు దిద్దుటకును ప్రయత్నములు జరుగుచున్నవి. విరుపణ్ణ ఆ కార్యమును కుమారునికిని ప్రధాన స్థపతికిని విడిచి వేసినాడు. తాను విశ్రాంతిగా సర్వకాలసర్వావస్థలయందును శివారాధనములోను, యోగాభ్యాసములోనే కాలము గడుపు చున్నాడు. పగలంతయును, రాత్రిపదిగడియలు ప్రొద్దుబోవు నటకును వీరభద్రాలయములోనే ఆయన కాలక్షేపము. తీఱిక వేళల నాయన శిల్పవిశేషములనారయుచుండును.

అనేకులు శిల్పములనుగాని, చిత్తరువులనుగాని చూచు చుండవచ్చును. వారికవి సామాన్యపు బొమ్మలుగాను, ఏవేవో కథాచిత్రములుగాను తోపవచ్చును. కాని ఒకానొక కళా భావుకునికి మాత్రమే అందలి శిల్పరహస్యములు, విశేషములు గోచరించును. ఆతనికిగూడ ఒకప్పుడు తోచిన విశేషములకన్న కాలాంతరమున నింకను రహస్యములు, మర్మములు బోధపడ వచ్చును. మఱియొకడాయాకథా దృశ్యములలో కరగిపోవచ్చును, ఇంకొకని మానసమున ఆ శిల్పకళయే నిత్యనూతన భావముల నుదయింపజేసి వాని హృదయగత పూర్వ సంస్కారములను

ఉద్బుద్ధ మొనర్చి వాని నొక సమున్నత భావశిఖరమునకుద్ధరింప వచ్చును. ఈ యనుభవభేదములన్నియు కళాద్రష్టల సంస్కార ములనుబట్టి కలుగుచుండును. ఒకనికి దేవాలయస్థ ప్రతిమ సాక్షాదీశ్వర స్వరూపము. ఇంకొకనికి ఏదో శిల్పి చేసిన రాతి బొమ్మ. "యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ." విరుపణ్ణ పరిణత సంస్కారుడు. కనుకనే ఆతని కా శిల్ప చిత్రములు అపవర్గానందానుభూతి నందించుచున్నవి. ఎన్ని సారులుచూచియు నాతడు తనివి చెందనిది అందుకొఱకే.

ఈ శిల్పవిశేషములనుగాంచుటకు లేపాక్షి పరిసరగ్రామ ముల నుండియే కాక దూరప్రదేశములనుండియు ప్రతిదినమును వేల సంఖ్యలో యాత్రికులు రాకపోకలు చేయుచున్నారు. విరుపణ్ణ చేయించిన ఈ మహాశిల్ప రచనములు వారి కాతనిపై భక్తిప్రపత్తులను దినదినాభివృద్ధి చేయుచున్నవి. భగవదారాధ నాసక్తినిగూడ పెంపొందింపజేయుచున్నవి. ప్రజల దృష్టిలో విరుపడీనాడొక యపరశంకరుడు. ఆయన శైవతత్త్వపు ముద్ద. ఆయన పాపనాశేశ్వరాలయములో ప్రధానార్చకుడు. దైవ దర్శనమునకన్న, ఆ పరమభక్తుని దివ్యసందర్శనమే ప్రజలకు ప్రధానమైనది. వారికి విరుపణ్ణ యుపదేశము వేదము. అనేకులు జన్మసంతరణసాధనము నుపదేశింపుడని విరుపణ్ణను వేడుచుండిరి. వారి కీశ్వరభక్తిని మించిన సాధనము లేదనియు, సమస్తకర్మ ములు నీశ్వరార్పణబుద్ధితో జగత్కల్యాణ సంధాయకముగా నొనర్చుటే యుత్తమ కర్మయోగమనియు నాతడు చెప్పు చుండువాడు. ఈ కర్మయు భక్తియు మనుజులకు జ్ఞానసంసిద్ధిని జేకూర్చుననియు, ఆ జ్ఞానముచేత జీవేశ్వరైక్యముకలిగి జీవులు

అమృతులగుదురనియు విరుపణ్ణ స్వానుభవముచేతను, శాస్త్రము చేతను తెలుసుకొన్నాడు. శక్తియున్నవారు పాతంజల యోగమును అనుష్ఠింపవచ్చును. తన్నర్థించువారికిని ఆతడిచ్చు సందేశమిదియే.

నాడు విరుపణ్ణ ప్రాతస్సంధ్యార్చనము ముగిసినపిమ్మట వీరభద్రాలయమండపములలోని శిల్పచిత్రము లన్నిటిని సవిమర్శముగా చూడ మొదలిడినాడు. వానియందచందములు నిత్యనూతనములై యాతనికి తోచుచున్నవి. ఇంతటి యపూర్వ శిల్పకళాభ్యుదయము తాను కారణముగా జరిగినదనియింతవరకాతడు భావించువాడు. కాని ఆనాడాభావము పోయినది. "ఒకానొక దైవశక్తిప్రేరణముచేత, ఈ కార్యములు సాగినవి. దేవుడు వీరభద్రప్పకు వాక్కుల నిచ్చి, అది కారణముగా తనొక్క సాధనమును చేసికొన్నాడు. తానీ పనికి నిమిత్తమాత్రుడే. మహాభారత సంగ్రామమున కర్జునుడు నిమిత్తమాత్రుడే కదా. జరిగినదంతయు శ్రీకృష్ణ ప్రభావముననే జరిగిపోయినది. అట్లు కాకున్న ఇంతమంది శిల్పులు, ఇందఱు ప్రజలు తనతో సహకరించి ఈశిల్ప యజ్ఞమునిట్లు నిర్విఘ్నము చేయగలిగెడివారా?" ఇట్టి యాలోచనముతో విరుపణ్ణ శిల్ప సందర్శనము చేయుచుండగా నచ్చటికి కామాక్షివచ్చినది.

ఆమె వీరభద్రప్ప వివాహము సంగతి భర్తతో నెచ్చరించి తెలుసుకొననెంచినది. తన దృష్టినిబట్టి చూచినచో పద్మినీ వీరభద్రుల యనురాగయాత్ర చాలదూరము సాగినట్లే తోచుచున్నది. లేకున్న, వీరభద్రప్పచేతి మహామూల్య మగు నవరత్నాంగుళీయకము పద్మినివ్రేలినేల యలంకరించును?

యువతీయువకు లుంగరములను మార్చుకొనుట యొక యను రాగచిహ్నము. అయినను తాను విరుపణ్ణ నడిగి యాయన నిర్ణయము నెఱుంగవలయును. కనుక కుమారుని పెండ్లి ముచ్చట నెత్తి "గారిని వీరభద్రప్పకిచ్చి వివాహమొనర్త" మన్నది.

విరుపణ్ణ : వీరభద్రప్ప యందు కంగీకరించినాడా !

కామాక్షి : మీరు చెప్పినచో నొప్పుకొనును.

విరుపణ్ణ : మఱి యాతని యిష్టమును గుర్తించినావా ? అబ్బాయినే అడిగిచూచిన బాగుండెడిది కదా !

కామాక్షి : వాని మనస్సు పద్మినిపై నున్నది.

విరుపణ్ణ : మఱి నేను గారిని పెండ్లాడుమని చెప్పిన ఆతడెట్లు అంగీకరించును ?

కామాక్షి : మీమాట నాతడు జవదాటడు.

విరుపణ్ణ : వాని కిష్టములేని పిల్లను నా నిర్బంధముచే వాడు పెండ్లాడవలయునని నీ యభిప్రాయమన్నమాట.

కామాక్షి : మీకు కుటుంబ విషయములలో శ్రద్ధయే లేదు. ఇక వాడు మీమాట యెట్లు వినును !

విరుపణ్ణ : శ్రద్ధ యుండి మన స్థపతిగారేమి చేయజాలినారు ? మేనల్లుడు మాచమూర్తి కీయ దలచిన కూతును ఆమె యభిప్రాయమునుబట్టి జక్కణాచార్యున కిచ్చి

పెండ్లి చేయ సిద్ధపడ లేదా? కనుక పిల్లలయిష్టమునుగూడ తలిదండ్రులు మద్దు చేయవలయును. వారి నిర్ణయము లలో దోషము లేనప్పుడు-ఇబ్బందులు లేనప్పుడు పెద్ద వా రాశీర్వదించుటయే మంచిది.

కామాక్షి : మరి మాచమూర్తి సంగతి?

విరుపణ్ణ : పిచ్చిదానా ? పూర్వజన్మ సంస్కారానుగుణముగా అన్నియును జరిగిపోవుచుండును. మన మేదో కర్తల మనుకొని, అహంకారముపూని భంగపడుచుందుము. వీరభద్రప్పకు నేను చెప్పలేదని నీకు కోపము. ఈశ్వర నిర్ణయమును నీవుగాని, నేనుగాని ఇంకెవరుగాని త్రిప్ప లేరు. మాచమూర్తి విద్యానిధి కూతురు లలితను పెండ్లాడును.

కామాక్షి : లలితనా? వారికీ వీరికీ గోత్రములపే కలియకుండ వలయును గదా!

విరుపణ్ణ : కలియవు. మాచమూర్తి సనాతన ఋషి గోత్రము వాడు. విద్యానిధిది సుపర్ణసగోత్రమట. వారు యజు శ్శాఖవారు. వీరు ప్రణవశాఖవారు.

కామాక్షి : ఇన్ని సంగతులను మీ రెప్పుడు విచారించి సంబంధ ములు నిశ్చయించినారో! ఇంతకును వీరభద్రప్పకు పద్మినినే పెండ్లిచేయుదమని మీ యభిప్రాయ మన్న మాట.

విరుపణ్ణ : పొరపాటు పడుచున్నావు. నా యభిప్రాయముకాదు. వీరభద్రుని యభిప్రాయమునకు నా ఆమోదము మాత్రమే.

కామాక్షి : మఱి గౌరి మాట ?

విరుపణ్ణ : వీరణ్ణకుమారుని కా పిల్లపై దృష్టియున్నదని నీవే చెప్పితివిగదా. ఇది యన్ని విధములను యోగ్యముగానే యుండును. నాకు మధ్యాహ్న శివపూజకు వేళయైనది.

విరుపణ్ణ శివపూజ ముగించుకొని, విశ్రాంతిగైకొని నాలుగు గడియల ప్రొద్దున్నదనగా వీరభద్రాలయమునకు చేరినాడు. వెంటనే ఇరువురు భటు లాతని పాదములపై వ్రాలి లేచి, కన్నీరు కార్చుచు శిక్షాపత్రము నాయన కందించి యిట్లనిరి :

"మా చల్లని ప్రభూ ! తమ కొలువులో నున్నంత కాలము కడుపులోనీరు కదలకుండ బ్రతికినాము. కృష్ణప్పనాయకుల హయాములో మేమందుచున్న యిక్కట్లకు లెక్క లేదు. ఆయన చండశాసను డయినాడు. మొన్న గగనమహాలునకు సదాశివ ప్రభువులు దయచేసినారు. వారు వచ్చినప్పటినుండియు కృష్ణప్ప నాయకుడు వారిని గలియని రోజులేదు స్వామీ ! తమపై ఏమేమి నేరములు మోపినాడో, సదాశివప్రభువు లేమన్నారో ఎవ్వరికిని తెలియదు. నిన్న సాయంకాల మీ శిక్షాపత్రమును మాకిచ్చి నేటి సాయంకాలములోపల పని ముగించుకొని రమ్మన్నారు. మీ ఉప్పు పులుసు తిని పెరిగిన చేతులతో ప్రభువులకు మేమీ కీడు చేయజాలము స్వామీ ! మమ్ము మన్నింపుడు."

విరుపణ్ణ శిక్షాపత్రమును రెండు మూడుసార్లు చదువుకొన్నాడు. "ఇది సదాశివరాయలవారికి స్వయముగా కలిగిన బుద్ధికాదు. కృష్ణప్పనాయకుడేవో నేరములను నాపై మోపి ప్రభువుల మనస్సు విఱుగిదీసి యుండవచ్చును. లేకున్న శిల్పకళాపోషకులగు విజయనగర రాజులేమి, నిరపరాధినియగు కళారాధకున కిట్టి దండనమును విధించుటేమి ? బొక్కసములోని విత్తమును హరించి లేపాక్షి దేవాలయమును గట్టించినానని నేరమా ! పరమేశ్వరా ! ఏమిటీ పరీక్ష ? ఇది తగిన పరీక్షయే. ఇంతటి మహోన్నతి శిల్పములలో యుగయుగాలనాటి పరమేశ్వరలీలలను ప్రత్యక్షముగా దర్శించినాను. ఇంతవఱకు పుస్తకములలో చదువుకొని మానసికముగాపొందు సంతృప్తి నిప్పుడు నేత్రేంద్రియముతో దర్శించికూడ పొందినాను. ఈ నేత్రములతో నిక ఈ ప్రాకృతజగత్తును జూడవలదని పరమేశ్వరాజ్ఞ. ఇది యెంత సమంజసము. ఈశ్వరునికి నాపై నెంతదయ. ఆయన కరుణాసముద్రుడనుట కిదియే నిదర్శనము. ఓ జగదీశ్వరా !

"త్వ మేవ మాతా చ పితా త్వ మేవ
త్వ మేవ బంధు శ్చ సఖా త్వ మేవ
త్వ మేవ విద్యా ద్రవిణం త్వ మేవ
త్వ మేవ సర్వం మమ దేవ ! దేవ !"

"నీ యానతి మీఱను. నా కన్నుల నిదే సమధికానందముతో సమర్పించుచున్నాను. ఓ భటులారా ! మీరు నా

ఓ దేవదేవా ! నీవే తల్లివి. తండ్రివియు నీవే. నీవే బంధుడవు. చెలికాడవును నీవే. విద్యయును, ధనమును నీవే. ఇంతయేల ? నాకు సర్వమును నీవే.

కన్నుల నూడబెఱుకవలసి వచ్చినదని సందేహింపవలదు. ఆ గోరుగంటి నిటు తెండు. మీరు పెనుగొండకేగి ప్రభునాజ్ఞ నిర్వర్తింపబడినదని ఆ కృష్ణప్రభూపతికి నివేదింపుడు.''

భటులిక నక్కడ నుండ లేకపోయినారు. వారు విరుప ప్రభుని గృహమునకేగి ఈ దుర్వార్తను జెప్పిరి. విరుపణ్ణకు నేత్రోత్పాటనశిక్ష యని లేపాక్షియంతయు మాఱుమ్రోగినది. లేపాక్షిలోని జనమంతయు కూర్మాద్రిపై మూగినది.

విరూపాక్షుడు తుదిసారిగా తదాలయ శిల్ప చిత్రముల నన్నింటిని సావధానముగా తిలకించినాడు. వీరభద్రస్వామి 'గర్భగుడి'లోని కేగినాడు. ఆ స్వామికి సాష్టాంగపడి లేచినాడు. మోమున సంతోషశ్రీ నిండారుచుండగా గోరుగంటితో రెండుకన్నుల నూడబెఱికి, వీరభద్రస్వామి పాదములపై సమర్పించినాడు. ఆ మహాభక్తునిలోకోత్తర త్యాగశక్తికి బ్రహ్మాండము ఊటాడినది. భూమి కంపించినది. ఆకసమార్చినది. గాలి జగము నుఱ్ఱూతలూపినది. ఆ భయానక దృశ్యమును గాంచజాలక సూర్యుడు అస్త పర్వత శిఖరపు మాటునకు పరువిడుచున్నాడు. ఈ ఘోరన్యాయమును సహింపజాలక రఘునాథమూర్తి ధనుర్బాణముల నాయత్తము చేసి కొన్నాడు, స్తంభోద్భవదుర్గాదేవి కన్నుల కెంపుగదుర బొమముడిపెట్టినది. ఏడు తలల నాగేంద్రుడు అతిక్రూరముగా బుసకొట్టినాడు. లేపాక్షి నందీశ్వరుడు, కాలు నేలపై రాచి దిక్కు లదరునట్లు ఱంకెవేసినాడు. మహానటుడు భయంకర ప్రళయ తాండవము చేసినాడు. ఋషిగణము భయభ్రాన్తమైనది. వీరభద్రస్వామి

సముద్ధతుడై దక్షయజ్ఞ విధ్వంసనావసర మహారౌద్రాకారము ప్రస్ఫుటముకాగా, తన పాదములపైనున్న రెండు నేత్రములను పైకి చిమ్మినాడు. అవి ఫిరంగి గుండ్లవలె వచ్చి దేవాలయపు వెలుపలిగోడకు కొట్టుకొన్నవి. ఆగుంటలనుండి రక్తము, ధారలు ధారలై ప్రవహించినది. వటపత్రశాయియైన శ్రీకృష్ణపరమాత్మ ఈ దృశ్యములనన్నింటిని ఱెప్పవేయక రెండుకన్నులతో చూచుచునేయున్నాడు.

విరుపణ్ణకుటుంబము, శిల్పికుటుంబములు, లేపాక్షివాసులు దుఃఖోద్విగ్న చిత్తములతో ఆలయమునకు విచ్చేసినారు కామాక్షి తడిగుడ్డను విరుపణ్ణ కన్నులకుగట్టి శుశ్రూషించుచు పద్మిని విరుపణ్ణ కాళ్ళపై బడి విలపించుచు ఇట్లన్నది :

“ప్రభూ! ఈ ఘోరమున కంతటికిని నేనే కారణమను. నన్ను కృష్ణప్ప నాయకుడు చెఱబట్టదలంచినాడు. నేను మిమ్ము శరణుచొచ్చితిని. ఇది యాతనికి దుస్సహమైనది. నన్ను పొందుటకు ఆస్థాన నర్తకీ పదమును ఎరగా చూపినాడు. నేను దాని కాశపడలేదు. అతడందుకు మీరు కారణమని ఈ దురాగతమునకు ఒడిగట్టినాడు. నేను పాపిష్ఠురాలను. స్వార్థపరాయణను. నా స్వార్థమునకు మీరు బలియైనారు, ప్రభూ! నేనీదుఃఖమును భరింపలేను. నాకు మరణమే శరణము.

విరుపణ్ణ : లేదమ్మా! లేదు. నీవు దుఃఖింపవలదు. ఎవరి కర్మమునకు, ఎవ్వరును కారణము కారు, నిన్ను నేను

రక్షింపకున్న, ఇంకెవ్వరైనను రక్షించి పుణ్యము కట్టుకొనెడివారే. అప్పుడు వారైనను కృష్ణప్పనాయకుని క్రోధమునకు గురియయ్యెడివారే. ఎవరికోదక్క వలసిన త్యాగఫలేన పుణ్యమును నాకుదక్కించి నీవు నాకుపకారము చేసినావు తల్లీ! నీవు నా కాపురాలవు. నా భక్తి ప్రపత్తు లింతగా పెంపొంది నేను శివానుగ్రహమునకు పాత్రుడనగుటకు నీవును కారణభూతురాలవను సంగతి నీకు తెలియదు. కనుక నీవు చింతింపనవసరము లేదు. మరణప్రసక్తికి తావే లేదు. అమంగళవాక్యము లాడ వలదు.

పద్మిని: ఇంతటి మహాశిల్పములను వెలయజేసిన అసాధారణ కళారాధకునకీయిక్కట్టా ప్రభూ! జీవితము నంతటిని గుడ్డితనముతో నెట్లు వేగింపగలరు? పాపియైన కృష్ణప్పకు రావలసినయాపద మీకు వచ్చినదేమి స్వామీ!

పురుషోత్తమస్థపతి: ఔనమ్మా! కర్మగతి విచిత్రముగా నుండును. ఎవ్వడే సమయమున నెట్టి యాపదకు గురియగునో మనము చెప్పజాలము. కృష్ణప్పనాయకుని మాత్ర మీ కర్మసూత్రము కట్టికుడుపదని యెట్లు చెప్పగలము. శుభాశుభకర్మ లెప్పుడెప్పుడు ఎట్లెట్లు ఫలించునో తెలియదు.

అనుచుండగనే రొప్పుచు రోజుచు కృష్ణప్ప నాయకుడు ఎటనుండియో వచ్చి విరూపాక్షశ్రేష్ఠి కాళ్ళపై బడి క్షమింప వేడుకొనుచున్నాడు. ప్రజలాతనిని చావమోదుటకు దుడ్డు

కట్టులతో సిద్ధమయినారు. విరుపణ్ణ యీ కలకలము నాలకించి కృష్ణప్ప నాయకుని ఒక్కమాటన్నను, ఒక్క దెబ్బ కొట్టినను తనపై దెబ్బతీసినట్లేయని ప్రజలను నివారించినాడు. విరుపణ్ణ యీ యౌదార్యము కృష్ణప్పను మఱింతగా బాధించినది.

కృష్ణప్ప: విరూపాక్షులు నన్ను క్షమింపవలయును. నేను మహాపాపిష్ఠుడను. మహానుభావులగు తమపై కత్తిగట్టి యిట్టి బన్నమునకు గుఱిచేసిన దుర్మార్గుడను. నా పాపములకు పరిహారములేదు. మీ యెదుట నా పాపముల నొప్పుకొని, ఈ కత్తితో పొడుచుకొని చావనెంచి యిక్కడకు వచ్చినాడను. చక్రవర్తులకు మీపై నూరి పోసినవాడను నేను. విజయనగర భాండాగార ధనమును హరించినది నా సోదరుడు తిమ్మనాయకుడును నేనును. అది మీరపహరించినట్లు ప్రభువులకు చెప్పి నమ్మించి యీ శిక్షను వేయించినదియు నేనే. ఈ పాపములకు ప్రాయశ్చిత్తముగా నిదిగో ఆత్మహత్య చేసికొనుచున్నాను.

విరుపణ్ణ: వలదు కృష్ణప్ప నాయకా! వలదు. నీవు నాసోదర తుల్యుడవు. మానవులు స్వార్థపరులై తప్పులు చేయు చుందురు. పరాపకారములొనర్తురు. వానికి ఆత్మహత్య పరిహారము కాదు. అది మహాపాపమని పెద్ద లందురు. గాఢమగు పశ్చాత్తాపమే అన్ని దోషములను హరించు నట్టిది. నీవు నీ తప్పులను తెలిసికొన్నావు. వానికి పశ్చాత్తాపపడుము. ముందిట్టి దోషము లొనర్పనని

దేవునియెదుట ప్రతిజ్ఞ చేయుము. భావిజీవితమును విశ్వకల్యాణకరమగుభద్రమార్గముననడుపుము. ఇదియే నీ కర్తవ్యము.

కృష్ణప్ప : సోదరీ ! పద్మినీదేవి ! నిన్ను వేశ్యగా భావించి నా యుంపుడుకత్తెనుగా జేసికొనయత్నించిన పాపాత్ముడ నమ్మా ! నేను. నాకిటీవలనే వీరణ్ణ కుమారుని వలన తెలిసినది. నీవు వేశ్యవు కావు. మహాశివభక్తుడగు నంజుండప్ప పుత్రికవు. ఆయన మా తలిదండ్రులకు గురువు. అట్టి మహానుభావునికి పుట్టినందుననే నీ విట్టి గుణశీలములు కలదానవై నావు. వానికి దగినట్లే భగవానుడు నీకు చక్కని విద్యాబుద్ధులను ప్రసాదించి ఆదర్శ నారీరత్నమునుగాతీర్చినాడు. నీవు వీరభద్రప్పను ప్రేమించుచున్నావని అసూయ పడినందుననే విరుప ప్రభువులకీ కీడు మూడజేసి పాపము మూటగట్టుకొన్నా నమ్మా నేను. నీవు నాకు గురుపుత్రివైనందున తోబుట్టువవౌదువు. చిన్నదానవైనను గుణములనుబట్టి పెద్దదానవే. నన్ను మన్నింపుము చెల్లీ ! మన్నింపుము.

కృష్ణప్ప యిట్లనుచుండగనే శివయోగి పద్మినీదేవిని వాత్సల్యదృష్టులతో గాంచుచు నన్నాడు :

"పద్మినీదేవి నంజుండప్ప కూతురా ? ఎవ్వరా నంజుండప్ప ? అతనినిగూర్చి వివరింపగోరుచున్నాను."

కృష్ణప్ప : నంజుండప్ప అనంతపురనివాసి. వారి కులమేదో తెలియదుగాని, దింజులని యనుకొనువారు. ఆయన

గొప్ప శివయోగియై శిష్యుల కుపదేశములు చేయుచు శైవమత ప్రచారము చేసెడివాడు. ఆ మహానీయుని కూతురే ఈ పద్మినీదేవి.

శివయోగి : అమ్మా పద్మినీ! నీవు నా తమ్ముని కూతురవా? నీ జన్మము చేత మా వంశము పావనమైనదమ్మా! కృష్ణప్ప మాటలనుబట్టి చూడ నీవెన్నో కష్టములపాలై నట్లు తెలియుచున్నదమ్మా, బిడ్డా!

శివయోగీంద్రుని మాటలకందఱును దిగ్భ్రాంతులైనారు. "నంజుండప్ప మీతమ్ముడెట్లో వివరింపుడ"ని వీరణ్ణ శివయోగి నడిగినాడు. శివయోగి యీ రీతిగా తమ వృత్తాంతమును వినిపించినాడు.

"మాది కన్నడ దేశమందలి చిక్కబళ్ళాపురము. మేము వైశ్యులము. వాణిజ్యము మాకు జీవనము. చిక్కబళ్ళాపురములో పాపఘ్నిమఠమని యొక గొప్ప శైవపీఠ ముండెడిది. దానిని పాపాగ్ని పీఠము, పాపాగ్ని మఠము, అనియు నను చుండెడివారు. జగదంబ పాపఘ్నిదేవి రూపమున ఆ పీఠము నందారాధింపబడుచు భక్తుల పాపములను గాల్చివేయుచుండెడి దట. ఆపీఠమునకు మా తాతగారికాలమున సిద్ధలింగమాహేశ్వరులు అధిపతులు. మా తాతగారు ఆ పరమమాహేశ్వరులకు ప్రియశిష్యులై శివయోగులైనారు. మా తలిదండ్రులకు నేనును, మా తమ్ముడును ఇరువురమే కలిగినాము. నాపేరు రుద్రప్ప, తమ్మునిపేరు నంజుండప్ప. నేను పెండ్లియాడక జంగమ (జంగమనగా సంతట తిరుగువాడని వ్యుత్పత్త్యర్థము) నగుదునని

పట్టుపట్టియుంటిని. అందుచే మా తలిదండ్రులు నంజుండప్పకు మాత్రమే పెండ్లి చేసినారు. తమ్ముడు కొంచెము తీవ్రవాది. మా తలిదండ్రులు వీరశైవులయ్యు కులభేదములను పాటించు చున్నారని యాగ్రహించి, తలిదండ్రులతో కలహించి భార్యతో గూడ వాడు దేశాంతరమునకు బయలుదేరిపోయినాడు. ఇంత వఱకు మాత్రమే వానికథ నే నెఱుంగుదును. నేనును వెంటనే వైరాగ్యము కలిగి దేశాంతరమేగితిని. కాశీ ప్రభృతి పుణ్య క్షేత్రములందు సంచరించి మహీశూరపురమునకు వచ్చి, కొంత కాలమునుండియు చాముండేశ్వరీగిరిమీద తపోయోగానుష్ఠాన ములతో కాలము గడుపుచున్నాను. నా తమ్ముడు నంజుండప్ప చరిత్రము మీ రెఱింగినంతవఱకు వినిపింపుడు."

వీరణ్ణ, నంజుండప్ప చరిత్రను వివరించినాడు. పద్మినీదేవి 'పెదనాయనా !' యని రుద్రప్ప శివయోగిని కౌగలించు కొన్నది. ఆయన వైరాగ్యమేమైనదో మఱి. ఆత డామె తలను కన్నీళ్ళతో ముంచి యెత్తినాడు. అది రక్తసంబంధ మహిమ కాబోలు! పద్మిని రూపములో రుద్రప్ప పోలికలెన్నో చూచువారి కగపడినవి. ఆమె ఈ వంశములో బుట్టినదే యని ఆ ఉభయుల రూపసాదృశ్యముకూడ రుజువుచేసినది. ఆమె మాతృపితృహీనయైనను, ఈనాటికొక పెదతండ్రి లభించుటచే సంతసించినది.

కృష్ణప్ప : పద్మినీదేవీ ! నీ జన్మమునుగూర్చి ఇక నెవ్వరికిని సందేహము లుండుటకు వీలులేదు తల్లీ ! పరమేశ్వరుడు నీ పాలిట కల్పతరువై యున్నాడు. నాయనా ! వీర

భద్రా! ఎక్కడున్నావు? నీ తండ్రి కంఠత్వమును ప్రాప్తింపజేసిన పాపిని క్షమింపవా బాబూ! తల్లీ! కామాక్షీ! సోదరా. వీరణ్ణా! మీ రందఱును నన్ను క్షమింపవలయును. మీరు క్షమించినను భగవంతుడు క్షమించునా? అన్నా, విరూపాక్షా! నా బాధను వినుము. నేను నీకొనర్చిన ద్రోహమునకు దుర్గాపరమేశ్వరికి నాపై కోపము కలిగినది. ఆమె ఒక మహాభయంకర శక్తిస్వరూపముతో నాలుగు రాత్రులనుండి నన్ను వెంటాడుచు నిద్రపోనిచ్చుటలేదు. పలుకేతుల భయ పెట్టుచున్నది. దిగ్భ్రమింగెద ననుచున్నది. నేను ఏదో చెప్పరాని బాధ ననుభవించుచున్నాను. మూడురాత్రు లెట్లో త్రోసివేసికొని గడపితిని. నిన్నటిరాత్రి ఆ తల్లి గాఢముగా విజృంభించినది. మిమ్ము, మన్నింప వేడుకొన వలసినదని నన్ను వెంటాడినది. దురదృష్టవంతుడను. నేను వచ్చునంతలో జరుగవలసిన ఘోరమేదో జరిగియే పోయినది. తల్లీ! కామాక్షీ! నీ దేవీ సముపాసనా దీక్ష ఫలించినదమ్మా! నిన్నా తల్లి యనుగ్రహించినది. మీ దంపతులకు పునర్జన్మము లేదు. మీరు భవబంధ ములనుండి విముక్తులైనారు. శాశ్వత శివసాయుజ్యము మీకు సిద్ధించినది. మీరు ధన్యులు. విరూపాక్షా! నా పాపమునకు పరిహారము చెప్పుము. అది పశ్చాత్తాప మాత్రమున బోదని నేనెఱుంగుదును.

విరుపణ్ణ : సోదరా! చింతిల్లకుము. నీకన్న మిన్నగా పాపములు చేసినవారే బాగుపడినట్లు పురాణములు పలుకు

చున్నవి. నీవీ క్షేత్రమున దుర్గాదేవిని, పాపనాశే శ్వరుని ఉపాసింపుము. ఆ దేవతలు నీ పాపములను కడిగివేయుదురు.

ఈ మాటలు పండ్లబిగువుతో చెప్పుచున్నాడే కాని విరుపణ్ణ నేత్రబాధ దుస్సహముగానున్నది. ఆతడు మధ్యమధ్య శివా, శంభో, శంకరా యని ఈశ్వర నామస్మరణము చేయు చునేయున్నాడు. బాధ నోర్చుకొనుచునే యున్నాడు. ఆతని బాధను గాంచు చూపఱ నేత్రములు కన్నీళ్ళతో నిండిపోయినవి. విరుపణ్ణ యడ్డంకిచేతనే వారు కృష్ణప్పను నమలలేక, మ్రింగ లేక యూరకున్నారు. అంతట కృష్ణప్ప యిట్లన్నాడు :

"తండ్రీ ! విరూపాక్షా ! ఈ సంకటసమయములో మీ అంగీకారముతో ఒక మంచిపనిచేయదలంచినాను. సోదరియగు పద్మినీదేవిని ఈ సహస్రాధిక దేవతల సన్నిధానమున కుమారుడు వీరభద్రప్పకు కన్యాదానము చేసెదను. అంతియేకాదు. అతనికి అరణముగా ఈ పెనుగొండమండలాధిపత్యమును సమర్పించె దను. ఈ విషయములన్నియు సదాశివరాయలవారి కెఱింగించి వారినుండి క్షమాభిక్ష నర్థించి, వారి యామోదముతోనే ఈ సత్కార్యములను నెఱవేర్చెదను. ఇందుకు ముందుగా మీ యాశీర్వాదము నిండు."

ఈమాటలకు అంత దుఃఖములోనున్న కామాక్షి మోము విప్పారినది. వీరణ్ణయు సంతోషించినాడు. వీరభద్రప్పకు విప రీతమైన యాశ్చర్యమును, సంతోషమును కలిగినవి. ఆ సంతో షాశ్చర్యములు తండ్రికిగలిగిన యిక్కట్టుచే నతనికి సంభవించిన

చింతతో సమ్మేళనమునంది, యొక వింత మనస్స్థితిని సంపాదించినవి. కృష్ణభూపతికిగలిగిన మనఃపరివర్తనమున కెల్లరును విస్మితులైనారు. విరూపాక్షుని నేత్రరాహిత్యముచే గల్గిన బాధ మాత్రము వారి హృదయములనుండి తొలగలేదు.

విరుపణ్ణ పద్మినీదేవి నుద్దేశించి "కృష్ణభూపతి యభిప్రాయమునకు సమాధానమేమమ్మా!" యనినాడు. ఆమె అశ్రుపూర్ణాక్షియై రుద్ధకంఠముతో "మామయ్యా!" అని విరూపాక్షుని పాదములపై వ్రాలినది. ఆత డామెను లేవనెత్తి "దీర్ఘసుమంగలీ భవ" అని యాశీర్వదించినాడు. "కృష్ణప్పనాయకా! నీ యభిప్రాయమును పరమేశ్వరుడే నెఱవేర్పగలడు. నీ సదాశయముల కెల్లప్పుడును నా యాశీర్వాదములు తప్పక లభించును." అని యాతడు కృష్ణప్ప నభినందించినాడు.

పద్మిని దొడ్డనాచార్యుడు కూడియిచ్చిన మిశ్రలోహముతో విద్యానిధి నవరత్నాంగుళీయకమును జేసియిచ్చుటచే, వీరభద్రప్పకు దుర్గాధిపత్యము సిద్ధించినందులకును, అలనాడు బైరాగి తనకు చెప్పిన హస్తరేఖల ఫలితముగా తా నొక దుర్గాధిపతికి ధర్మపత్ని యగుచున్నందులకును లోలోన సంతోషించినది. ఈ సమయమున తన పెంపుడుతల్లి కుప్పాయమ్మ యుండిన ఎంత బాగుండెడిదనియు విచారపడినది.

విరుపణ్ణ స్థపతీశ్వరా! నేను మీ కెంతయో ఋణపడియున్నాను. మీ బోధల ఫలితముగా నా జీవితము పండినది. మీరు నాకు గురువులు. ఎన్నెన్ని ఆధ్యాత్మిక రహస్యములో మీ వలన విన్నాను. మీరు నా

నమస్సులు. నా జీవితనాటకము ముగిసినది. లేపాక్షి దేవాలయ శిల్పనిర్మాణ నాటకమున చివరి యంకము సాగుచున్నది. కుమార వీరభద్రుడు మోజు పడి కల్యాణమండప నిర్మాణమునకు సంకల్పము చేసి కొన్నాడు. అది యింతవఱకును శిల్పస్వాముల దయచేత చక్కగనే సాగినది. పైకప్పు పనిగూడ పూర్తి చేయించి, ఈ శిల్పయజ్ఞమున అవభృథ స్నానముచేయ ప్రార్థించుచున్నాను.

పురుషోత్తమ : ప్రభూ ! తమ యాజ్ఞ శిరసావహింప దగినదే. కాని ఈ కల్యాణమండపము పూర్తి కాదు. శంకుస్థాపనమునాడే నాకీ యనుమానము కలిగినది. మీవంటి యుత్తమ ప్రభువులు, ఉదాత్తులు, కళారహస్యజ్ఞులు అంధులైన పిమ్మట మా కళాకౌశలమునుగాంచి యానందించు వారెవ్వరు ? అందలి రహస్యములను గ్రహించు వారెవ్వరు ? విరుపప్రభువు చూడని శిల్పములుకూడ శిల్పములేనా ? ఇదిగో ! ఇప్పుడే నా జీవితములో నిక శిల్పము చేయనని వీరభద్రస్వామి పాదములు సాక్షిగా ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఈ కళారాధకద్రోహము దుస్సహము. ఆలయకుడ్యమునకు కొట్టుకొన్న మీ కనుగ్రుడ్లు అచ్చట రెండుగుంటల నేర్పఱచినవి. ఆ గుంటలనుండి నెత్తురులోడి, చారలేర్పడినవి. అవి యెన్నటికిని మాయక చూచువారికి మీ త్యాగమయ జీవితకథను చాటుచుండును. ఇది తప్పదు. ఇది లేపాక్షి కాదు. విరుపప్రభుని కన్నుల

నూడబెటికించిన అంధీకృతాక్షి. ఈ మహిమమునకు ఫల ముగా ఈ కల్యాణమండపమును నేనే కాదు; ఎవ్వరును పూర్తిచేయజాలరు. ఇది కూడ తమ త్యాగమునకు చిహ్నముగా ఇట్లే పాడుపడియుండవలసినదే. తామిం కొక విషయము నిప్పుడు పాటింపవలయును. ఈ శిల్ప ములమీదగాని, బంధుమిత్రాదులమీదగాని మీ రెట్టి కోరికలును పెట్టుకొనవలదు. ఇది సమస్త వాంఛలను విడనాడవలసిన సమయము. మన మింతవఱకు లోకము నకు చేయగలిగినదేదో చేసినాము. అంతటితో తృప్తి పడుట మంచిది. ఆశాపాశమున కంతులేదు. అది ఎంత పెంచిన నంత పెరుగుచుండును. నేటితో మన యుగము ముగిసినదని భావింపుడు. రానున్న యుగము నకు రూపురేకలు దిద్దవలసినవారు-వర్ధమాని వీరభద్రులు; గౌరీ చెన్నబసవప్పలు; లక్ష్మి జక్కణ్ణలు; లలితా మాచమార్తులు. కృష్ణప్పనాయకుని మనఃపరివర్తనము వలన వీరభద్రుడు పెనుగొండ మండలాధీశ్వరుడు కాబోవుచున్నాడు గదా! ఇది లోకమున కంతటికిని పరమామోదమైన విషయము.

మహాతపస్వియు, వేదశాస్త్ర వేత్తయు నగు శిల్పి మనస్సునత్పరుషాపకారముజరిగినందున దెబ్బతిని ఖిన్నమైనది. ఆతడిట్లు శపించుటలో వింత లేదు. విరుపణ్ణ శిల్పీశ్వరుని శాప వాక్కులకును, శిల్పముచేయనన్న భీషణప్రతిజ్ఞకును కదలిపోయి నాడు. విధివిధానము నెఱింగినవాడు గనుక లేపాక్షి గతి యిక

నింతే యనుకొన్నాడు. లేపాక్షి శిల్పచిత్రకళారంగమున చివరి తెర జారినది.

శిల్పీశ్వరుని చిట్టచివరి ప్రబోధవాక్యములు విరుపణ్ణను మేలు కొల్పినవి. అతడు తన కర్తవ్యమును గుర్తించినాడు. మహిమగల యుంగరమును చేసియిచ్చి, పోయిన దుర్గాధిపత్యమును సంపాదించిపెట్టిన శిల్పీశ్వరుల కాతడు తుదిగా ధన్యవాదము లర్పించినాడు.

క్షణక్షణమునకును విరుపణ్ణ కన్నుల బాధ మిక్కుటమగుచున్నది. నేత్రమండలములోని నరముల నెవ్వరో లాగుచున్నట్లాతడు వెతచెందుచున్నాడు. ఆబాధ శిరస్సున కంతటికిని ప్రాకి మెదడులో ప్రవేశించినది. ఆతడు "శివోఽహం, శివోఽహం" అనుకొనుచు కామాక్షీపద్మినుల చేయూతతో గర్భాలయములోనికి పోయినాడు. పాపనాశేశ్వరస్వామి లింగమునకు తన శిరస్సును హత్తించి—

*"తపో యజ్ఞ యోగాదిభి శ్శుద్ధ బుద్ధి
ర్వీరక్తో నృపాదౌ పదే తుచ్ఛబుద్ధ్యా
పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్త్వం
పరబ్రహ్మ నిత్యం త దేవాహ మస్మి."

తపస్సు, యజ్ఞము, యోగము మొదలగు సాధనములచేత పరిశుద్ధమైన బుద్ధిగలవాడై, రాజాదిపదవులు అల్పము లనెడి దృష్టితో వానిని పరిత్యజించి, మానవుడే పరమతత్త్వమునందునో, అట్టి నిత్యమగు పరబ్రహ్మతత్త్వము నే నేనగుచున్నాను.

అను శ్లోకమును పఠించినాడు. తన ప్రాణవాయువులను అనంతాకాశమునందలి మహావాయువులో లీనముచేసినాడు. ఆతని జీవాత్మ శరీరబంధమునుండి ముక్తమై (విడివడి) అఖండ పరమాత్మలో ఐక్యమైనది. ఆతని ప్రారబ్ధ మనుభవించుటచే నశించినది. సంచితకర్మజాలము తత్త్వజ్ఞానాగ్నిచే దగ్ధమైనది. ఆగామికర్మములోని పుణ్యములను మిత్రులును, పాపములను శత్రువులును పంచుకొన్నారు. కర్మబంధము లిట్లు కాలిపోయి నందున, విరుపప్రభుని స్థూలసూక్ష్మకారణశరీరములు తమకు హేతువులైన పంచభూతములలో లయించినవి. ఆతడీ మూడు దేహముల నెడు త్రిపురములను గాల్చివేసి త్రిపురహరుడైనాడు. ఆతడు జపించిన "నేను శివుడను" అను నర్థముగల "శివోఽహం" సార్థకమైనది.

సూర్యభగవాను డస్తమించినాడు. పశ్చిమాకాశము విరుపణ్ణ నేత్రమార్గవినిస్సృత భయంకరరక్తారుణకాంతుల నుమిసి నది. దక్షిణాంబరమున నక్షత్రమై వెలుగుచున్న అగస్త్య మహర్షి తాను ప్రతిష్ఠించిన లింగము జీవులకు మోక్షము నొసంగుచున్నందులకు పరమానందభరితుడైనాడు. పురుషోత్త మాచార్యుడు, విరుపణ్ణ జీవిత రహస్యము నిట్లు వ్యాఖ్యానము చేసినాడు:

"మహాజనులారా! విరుపణ్ణ సార్థకజీవి. భగవద్గీతలో భగవానుడు — తన్ను భజించువారు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని—అని నాలుగు రీతులనుందురని సెలవిచ్చినాడు. విరుపప్రభువు కుమారుని మూకత్వముపోవుటకు ఒక ఆర్తుడుగా

పరమేశ్వరార్చనము మొదలిడినాడు. ఆయన జీవితమునం దిది యొక సాధనదశ. క్రమముగా అది ఆయన నొక జిజ్ఞాసువుగా మార్చినది. ఆత డనేక గురువులవద్ద పరమార్థరహస్యముల నెఱింగి, శాస్త్రముల నవగాహనచేసికొనినాడు. ఇది రెండవ దశ. పిమ్మట గురుశాస్త్రవాక్యముల ననుష్ఠానములోపెట్టి జ్ఞానియైనాడు. ఇది కట్టకడపటి సాధనదశ. తత్ఫలితము సిద్ధావస్థ కలుగుట. మూడవదైన యర్థార్థిత్వము విరుపణ్ణ జీవితమున సంభవింపలేదు. ఆతడు ఫలాకాంక్షతో ఏ పనిని చేయని నిష్కామ కర్మయోగి. కావుననే అర్థార్థిత్వస్థితి ఆయనకు పట్ట లేదు. ఈ నాల్గుదశలవారిలో జ్ఞానినే భగవంతు డెక్కువగా ప్రేమించును. జ్ఞానికిని, తనకును భేదములేదనియే భగవద్వాక్యము. ఇట్లాత డీశ్వరునికి పరమప్రేమాస్పదు డైనాడు.

"కాళిదాసు చెప్పినట్లు శైశవమున విద్యాభ్యాసము నొనర్చి, యౌవనమున గృహస్థధర్మము నాచరించి, వానప్రస్థమునకు దగిన మునివృత్తి నవలంబించినాడు విరుపణ్ణ. లేపాక్షిలోని యాతని జీవిత చర్యయంతయు వానప్రస్థమునకు సంబంధించినదే. తుదకు కర్మగతి నెఱింగి యోగమార్గమున శరీరత్యాగముచేసి ధన్యుడయినాడీ మహనీయుడు. కాషాయవస్త్రధారణాదులు చేయక పోయినను, అర్థముచేసికొన యత్నించిననో, ఇత డొక గృహస్థ సన్న్యాసియని గ్రహింపవచ్చును. ఇది విరుపణ్ణ ఆధ్యాత్మిక జీవితము. లౌకిక జీవితములో ప్రజాపరిపాలనము మున్నగు ననేక లోకహిత కార్యము లొనర్చినాడు. అవి యన్నియు మీా రెఱింగియే యున్నారు. ఇంతకన్న మానవజీవితసార్థక్యమున కింకేమి కావలయును!"

*　　*　　*　　*

చంద్రోదయ మైనది. చీకట్లు మాయ మైనవి. పద్మినీవీరభద్రులును, గౌరీచెన్నబసవప్పలును, లక్ష్మీరాజక్కణ్ణలును, లలితారామచంద్రమూర్తులును జంటలు జంటలై వచ్చి పురుషోత్తమ భారతికిని, రుద్రప్పశివయోగికిని నమస్కరించి, వారి దీవెన లందుకొన్నారు.

# స వ ర ణ లు

| పుట | బంతి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 35 | 20 | వేవాలయతనము | దేవాయతనము |
| 41 | 21 | గాయత్రపీఠా | గాయత్రీపీఠా |
| 42 | 20 | సముత్తోంగలీచీ | సముత్తుంగవీచీ |
| 47 | 24 | విశిష్ఠ | విశిష్ట |
| 49 | 24 | తేనేమమిహ | తేనేమ మగ్న ఇహా |
| 142 | 19 | వారు నేర్పరులు | నేర్పరులు |
| 158 | 18 | సింహాసనము | సింహవాహనము |
| 211 | 24 | చూసినారా | చూపినారా |
| 215 | 21 | ఉపాన్యాసములు | ఉపన్యాసములు |
| 224 | 18 | అలయములో | ఆలయములో |
| 233 | 19 | మఱియెక | మఱియొక |
| 235 | 9 | కళాభుదయము | కళాభ్యుదయము |
| 240 | 17 | ఘోరన్యాయము | ఘోరాన్యాయము |